# వల్లభమంత్రి

విశ్వనాథ సత్యనారాయణ



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ

# వల్లభమంత్రి

## పునాది

### ౧

"లోకములోఁ దండ్రికొడుకులు భార్యాభర్తలు అన్నదమ్ములుగా సన్నిహితబంధువులున్నారు. దూరబంధువులుందురు. మిత్రులుందురు. పరిచితులుందురు. ఎఱుగనివారు కూడ నుందురు. పరమసన్నిహితులైన తండ్రికొడుకులమధ్య నన్నదమ్ములమధ్య విరోధమంకురించి యెఱుఁగనిపరమవిరోధుల నడుమఁ గ్రోధభావ మెంత విజృంభించునో యంత విజృంభించినపుడు విజృంభించఁగలయప్పుడు లోకముయొక్క స్వరూపమిట్టిదని చెప్పుట యెట్లు? తండ్రి వేఱుపెండ్లి యాడినాడు. మొదటి సంబంధపుకొడుకు తనభాగము తనకుఁ బంచిపెట్టుమన్నాఁడు. అట్టికొడుకుతో విరోధము పెట్టికొనుటయే కాదు; వానిని ఛంపించిన తండ్రులున్నారు. ఒక తల్లి తన సంసారమునంతయుఁ ద్రవ్వి కూఁతునకుఁ బెట్టుచుండును. మగఁడు తానుగీచినగీటు దాటఁడు. వారికొక్కఁడే కొడుకు, వానికిఁ గష్టము వేసెను. చివఱకుఁ దనకు దినుటకేమియు మిగులదనిపించెను. తల్లితో నన్నాఁడు. ఆరాత్రి పూట తల్లితండ్రులిద్దఱును గలిసి వానినిఁ జంపినారు. ఇట్టికథలు సృష్టిలో వేనకువేలు కలవు. తెలియనివారు కొందఱు నమ్మరు. ఇట్లు జరుగునా? ఇది యసంభవమందురు. ఇట్లు జరుగునా యన్న

ప్రశ్న యెచ్చటినుండి పుట్టుచున్నది. ఆ ప్రశ్నవేసినవాని పరిమితానుభవమునుండి పుట్టుచున్నది. వానిమనస్సు వేఱు. వాని యనుభవము వేఱుగాఁ జెప్పరాదు. ఇవి రెండు నొక్కటే. అనుభవాతీతమయిన విషయమును మనస్సుతో నాలోచించఁగల వానికి సృష్టిలో నిది జరుగు, నిది జరుగదను సందియముండదు. వాఁడు మనస్సుతో దేని నాలోచించును? లోకమునందలి మనస్సు నాలోచించును. ఆ మనస్సుయొక్క లక్షణ మాలోచించును.

మనస్సనగా నేమి? ఒకజీవుఁడు తాను జన్మమెత్తి యీ లోకమును బాపుకొందమని చేసెడి యూహలసముదాయము. లోకమును బాపుకొనుట యనగాఁ గాంతాకనకములను సమకూర్చికొనుట. ఎన్నివిధములుగా సుఖమును సంపాదించవచ్చునని యతఁ డూహించునో యన్నిమార్గముల నంగలువేయుట, బారలుసాచుట. అంగవేయుచున్నాఁడు. ఆ క్రింద గోయియున్న దేమోయన్న విచారణకూడ లేదు. ఒకొక్కకప్పు డంగవేయును. గోతిలోఁబడును. ఈస్థితిలో మానవులలో రెండువిధములు. ఒకఁడు తనపేరాసకొలఁది ముందువెనుకలువిచారించక యంగవేయును. ఆ మొదటివాని యాశకంటె నెక్కువయాశ యున్నను మఱియొకఁడు విచారించి కాలుజాఱనిలక్షణము చూచికొని యంగ వేయును. ఇద్దఱును దుర్నీతిపరులే. వ్యామోహితమనస్కులే. రెండవవానిని లోకము వివేకియనును. వానికి చాల పేరులు కలవు. నిర్వాహకుఁడు, సమర్థుఁడు, ప్రతిభాశాలి. ఒకొక్కప్పుడతఁడే మహామంత్రి. మహామంత్రియనుటతోడనే వ్యక్తిగతమయిన దుర్నీతి పోయి, తన రాజునకుసంబంధించిన క్షేమము

కొఱకు ప్రదర్శించిన నీతికలవాఁడై యొకగొప్పతనము ప్రాప్తించుచున్నది లోకములో సత్కార్యమైన నసత్కార్యమైన స్వార్థముకొఱకు చేసినచో దానిని లోకము మెచ్చుకొనదు. పరార్థముకొఱకు చేసినచో లోకము మెచ్చుకొనును. ఇతరులమేలుకొఱకు చేసిన దుర్నీతి నీతియై తన మేలుకొఱకు చేసినది నీతి కాదా? ఇట్లు పరిగణించులోకము లోకక్షేమమును వాంఛించుచున్నది. లోకమనుటతోడనే యా వ్యక్తిని మినహాయించి తక్కిన సర్వజనులను లెక్కకట్టుచుందురు. ఆ వ్యక్తియు లోకమే కదా! ప్రతివాఁడును స్వాపేక్షయా లోకముకాదు, పరాపేక్షయా లోకము. ఇది దేనిని స్థాపించుచున్నది? వ్యక్తి యొక్క స్వతంత్రస్థితిని స్థాపించుచున్నది. సర్వసృష్టికి మూలభూతమయినది వ్యక్తియన్న విషయమును స్థాపించుచున్నది. ఈ వ్యక్తులయొక్క సమాహారము లోకము. లోకోపకారము, లోకక్షేమము మొదలైన శబ్దముల యర్థవివరణమునందుఁ గర్త ప్రత్యేకస్థానమువహించి తదితరులందఱు లోకమగుచున్నారు. సంఘమునకు జరిగిన మేలులో కర్తకూడ పాలుపంచుకొనుట లేదా? పంచుకొనినపుడు లోకము. కార్యకరణమునందు లోక భిన్నుఁడు. ఈ విభేదమునందలి సూక్ష్మతచేతఁ బరులక్షేమము కొఱకు చేసినదుర్నీతియందు దుర్నీతిశంక నివారితమగుచున్నది. ఇచట మరియొకప్రశ్న. ఈ ప్రశ్నయే సరిగా రామాద్యవతారములందు గూడఁ బుట్టుచున్నది. పరులకు మేలుచేయుట కొక హింసాకార్యము చేయఁబడుచున్నది. లోకము దానియందుఁ దూష్ణీంభావము వహించుచున్నది. తూష్ణీంభావమేకాదు; ప్రశంసించుచున్నది. లోకమునకు సంబంధించినంతవఱకు బాగుగనే

యున్నది. పరలోకమునకు సంబంధించినభాగమునం దేమగును? పరలోకవిషయమున రెండుభావములు. ఈశ్వరుఁడే సర్వకర్తయని యొకభావము. కర్మ సర్వహేతుకమని యొకభావము. ఈశ్వరునే యంగీకరించినచో నతఁడుకూడ నీ పరోపకారమును బుణ్యకర్మగా స్వీకరించి దానియందుఁగల హింసాభాగమును మన్నించవచ్చును. అప్పు డతఁడుకూడ లోకమువంటివాఁడే యగును. అతనియం దెక్కువ వైశిష్ట్యముండదు. అతఁడు పరమేశ్వరుఁడు కనుక నతని యిష్టమువచ్చినట్లు చేయువాఁడు; కనుక నతఁడుచేసిన దానికిఁ బ్రతి లేదు కనుక లోకమూరకుండును. కాదు; కర్మయే ప్రధానము చేసిన ప్రతికర్మకు ఫలిత ముండితీరవలయును. లేనిచో నే కార్యకారణభావము ననుసరించి సర్వసృష్టియు జరుగుచున్నదో యా కార్యకారణభావమునకు వైయర్థ్యము కలుగును. ఇది సృష్టియందు దృశ్యమానమైన విషయము కాదు. పరమేశ్వరుఁడు వేఱు, సృష్టి వేఱు. ఆ పరమేశ్వరుఁ డీ సృష్టిని పాలించును. అతని ధర్మస్వభావములు వేఱు. ఈ సృష్టియొక్క ధర్మస్వభావములు వేఱు. అనినచో పరమేశ్వరుఁడు తనకంటె భిన్నమయిన యీ సృష్టి నెచ్చటినుండి తెచ్చెనన్న ప్రశ్న పుట్టును. తనకంటె భిన్నమయిన యొక సృష్టిచేసినవాడు తనకంటె భిన్నమయిన లక్షసృష్టులు చేయవచ్చును. సర్వమతములు పరమేశ్వరుడు సృష్టినిజేసి దానియం దతఁడు ప్రవేశించెననియో యంతర్యామిగా నుండెననియో చెప్పుచున్నవి. పరమేశ్వర విషయముననే పెడవాదము చేయవచ్చును. ఆ పరమేశ్వరుఁడు మనుష్యబుద్ధికల్పితుఁడు. వాఁడు లేనేలేఁడని. అప్పుడుమఱియును సులువు. ఏ కార్యకారణభావము లోకమునందు సర్వత్ర దృశ్య

మానమగుచున్నదో యా కార్యకారణభావము సర్వత్ర పట్టి తీరవలయును. ఇతరుల మేలుకోసము హింస చేసినను, మేలు చేసిన దానికి సత్ఫలము కలిగినట్లు హింసచేసినదానికి నసత్ఫలము కలుగవలయును ఈ సదసత్ఫలములు ప్రత్యక్షములా? అప్రత్యక్షములా? ఫలము సద్యఃఫలము-దూరఫలము ద్విధా కనిపించుచున్నది. సద్యఃఫలమే ఫలము దూరఫలితమయినది సమన్వయముచేతఁ జెప్పఁబడుచున్నది కాని విశ్వసించుటకు వీలులేదన్నచో సర్వకార్యములకు సద్యఃఫలము కన్పించుట లేదు. అప్పుడు కార్యకారణభావమునందు వైయర్థ్యము భాసించుచున్నది. దూరఫలితము సమన్వయముచేతనే భాసించును. ఈ సమన్వయముచేత భాసించిన దూరఫలితమునకుఁ దద్దూర భూత కాలకృతకార్యమునకు సంబంధము లేదనుట నాస్తికమతమునకు మొదటిమెట్టు. చివఱకుఁ బర్యాలోచించినచో నాస్తికమత మొప్పుకొననిది కార్యకారణభావమగుచున్నది. ఆ నాస్తికుఁడు కూడ సద్యఃఫలితమునందు ఫలితత్వ మంగీకరించి దూరఫలితమునందు దాని నంగీకరింపనిచో సృష్టిగమనము నియతఫలము కాక యథేచ్ఛావర్తి కావలసివచ్చును. అది వానికైన ననభిప్రేతమే యగును.

అందుకనియే రామచంద్రుఁడు పరమేశ్వరుఁడై లోక క్షేమముకొఱకు దానవసంహారముచేసెను. వాలివధము కావించెను. వాలివధఫలితముగాఁ గృష్ణజన్మము నందెను. కిరాత శరతాడితుఁడయ్యెను. శ్రీరామచంద్రుఁడు చేసిన పుణ్యకార్యములకు ఫలితము లేదు. ఆయన పరమేశ్వరుఁడు కనుక, సర్వపుణ్యఫలితము పరమేశ్వరమహాన్నునం దంతర్భూతమై యుండును

కనుక, ఆయనచేసినకర్మకు ఫలితము పుట్టినది. ఇచ్చట మఱల నొకప్రశ్న. రామావతారమునందుఁజేసిన వాలివధాదికార్యములకు ఫలితముపుట్టినచోఁ గృష్ణావతారమునందుఁ జేసినకార్యములకు ఫలితము పుట్టదా? కృష్ణావతారమునందుఁ జేసినకార్యములకు ఫలితము పుట్టినట్లులేదే! ఇచ్చటనే యీ రెండవతారముల భేదము. ఆయన మాయామానుషవిగ్రహుఁడు. ఈయన లీలామానుషవిగ్రహుడు. శ్రీరామచంద్రునియందు అధ్యస్తలక్షణమున్నది. కృష్ణునియందు లేదు. ఇది యద్వైతమతమునందలి పరమరహస్యము.

ఒక మహామంత్రియొక్క నీతి విమర్శించునపు డేతన్మీమాంసావిచారము చేయవలసియున్నది. ముద్రారాక్షసమున రాక్షస చాణక్యు లిద్దఱున్నారు. ఇద్దఱు మహామంత్రులు. తమ రాజుయొక్క రాజ్యము నిలఁబెట్టుకొనుటకు వారు చేసినపనులు దుర్నితికరములు కావనుటకు వీలులేదు. ఇద్దఱు హింసాకాండము నెఱపినవారే. రాజ్యమునందుఁ బ్రజలయొక్క క్షేమము పరిపాలించునపుడు హింసాదూరముగాఁ బ్రవర్తించవచ్చును. పరరాజుతో యుద్ధముకలిగినపుడు తనరాజ్యము పోకుండఁ గాపాడుకోవలసినపుడు హింసావ్యపేతదృష్టి పట్టి తార్కికదృష్టి. పరమార్థదృష్టి వేఱు. వ్యావహారికదృష్టి వేఱు. సర్వము పారమార్థికదృష్టితోఁ జేసినచో వ్యవహారమే లేదు. లోకమే లేదు. చేయుట యన్నదే లేదు. లీలామానుషవిగ్రహుఁడయిన శ్రీకృష్ణదేవుఁడు చేసినట్లు చేయవచ్చును కదా యన్నచోఁ జేయవచ్చును. అపుడందఱు శ్రీకృష్ణులే. శ్రీకృష్ణుఁ డవతరించినది ధర్మసంస్థాపనముకొఱకు, శిష్టరక్షణము—అశిష్టశిక్షణముకొఱకు. శిష్టులు అశిష్టులు

ధర్మము నివియన్నియు నధ్యస్తభాగములోనివి. అనధ్యస్త మయిన శుద్ధచైతన్యము శ్రీకృష్ణదేవుఁడు. అందఱు నట్టివారయి నచో నవతారమే యక్కఱలేదు. లోకమే లేదు.

మంత్రులుందురు. ఒకఁడు జ్ఞాని. మఱియొకఁడజ్ఞాని. ఈ హింసాకాండ మజ్ఞానిని బాధించినట్లు జ్ఞానిని బాధించదు. మరి యొక విషయము. ఈ పుణ్యపాపవిమర్శనము వేఱు. కావ్యము వేఱు. కావ్యమునందుఁ బాపులు, పుణ్యవంతులు, నాయకుఁడు, ప్రతినాయకుఁడు. తత్తత్సన్నివేశములు వీనియొక్క పర్యాలోచనచేత మనస్సునకుఁ గలిగెడి చమత్కారము, తన్మయత, రస భావములు ప్రధానమగును. అచ్చట నీతి దుర్నీతులు విచారించి నచో విచారించవచ్చును గాని, లోకమునందలి వ్యక్తియొక్క శీలవిచారణవలెఁ జేయరాదు. కావ్యగతపాత్రశీలము విచార ణము రసభావాదులయందుఁ బర్యవసించుటకుఁ బనికివచ్చును. లోకగతవ్యక్తులయొక్క శీలపరిశీలనము వాని పుణ్యపాపముల వివక్షతకొఱకు చేయునది. ఈ రెంటికిఁ జాలభేదమున్నది. మఱియుఁ బాపముకూడఁ బరహింసను బుద్ధిపూర్వకముగఁ జేయుటవలన వచ్చెడిది వేఱు. తన్నెవఁడో హింసింపవచ్చినపుడు తన్నుఁదా రక్షించుకొనుటకుఁ జేసినహింస వేఱు. అది హింసయే కాదను టకు వీలులేదు తన్నెవఁడో చంపవచ్చినపుడు చంపనిమ్మని యూరకున్నచో నూరకుండును. అట్లూరకున్నవానికిని తన్నుఁ దా రక్షించుకొనుటకుఁ జంపవచ్చినవానినిఁ జంపినవానికిని భేదము లేకపోవలసివచ్చును.

కనుక క్లిష్టపరిస్థితులయందు పాపాల్పత పుణ్యాధికత విచా రించి సత్పురుషులు చేయుదురు" అని యూరకున్నాఁడు

గౌరీపతిశాస్త్రి. తత్రత్యులయిన తక్కిన నలుఁవురును నింత సేపు మాటాడకుండ నూరకున్నారు. గౌరీపతిశాస్త్రి షట్ఛాస్త్ర వేత్త. మహాపండితుఁడు. మంత్రియింటికి యాచార్థము వచ్చి నాఁడు. యాచకు లెవరువచ్చినను రాజుగారియింటికిఁ బోరు. మంత్రియింటికే వత్తురు. మంత్రి నిర్ధనికుఁడు, మహాదాత. ఆయనదాతృత్వము మంత్రిత్వముచేత సాగుచున్నది. ఆయన ధనవంతుడో నిర్ధనికుడో యెవరికిని దెలియదు. ఆసంగతి తెలిసిన వాఁడు హంగరాజొక్కఁడే. హంగరాజునకు మంత్రియన్నచోఁ బరమగౌరవము. మఱియుఁ బరమ ద్వేషము. వల్లభుఁ డున్నంత వరకు తనయాటలు సాగవు. వల్లభుని చంపించుటకుగూడఁ బ్రయత్నములు చేసెను. వల్లభుని చంపించినచో రాజ్యములో విప్లవము బయలు దేరును. హంగరాజునకైనను వల్లభునిఁ జంపింపవలయునని లేదు. అతనిని యావజ్జీవకారాగారమునం దుంచవలయునని అది చేయుటకు మొదలే ధైర్యము లేదు.

హంగరాజు రాజపుత్రులకు మేనమామ. రాజపుత్రు లిద్దఱు. ఈ రాజకుమారులతండ్రి చనిపోయెను. ఆయన ధర్మాత్ముఁడు. వేదవేదాంగములు చదివినవాఁడు. మహాతపస్వి. ఆయన బ్రదికియుండఁగాఁ బ్రజలు తాము రామరాజ్యములో నున్నామనుకొనిరి. ఆ రాజు మరణించునాటికి హంగరాజు దగ్గఱ నుండెను. మంత్రి దూర దేశమందుండెను. హంగరాజు రాజ్యాంగ మంతయుఁ దనవశము చేసికొనెను. అది తన బావగారియిష్టమని వెలయించెను. అప్పటికి రాజపుత్రులిద్దఱు చిన్నవాండ్రు. పెద్ద వాని కెనిమిదేండ్లు. రెండవవానికి నాలుగేండ్లు. ఆ పిల్లలకు మేనమామవద్ద చనవు. హంగరాజు సరియైన మేనమామ కాదు.

అసలు మేనమామయే కాఁడేమో! ఎందుచేతననగా రాజభార్య తండ్రి యొకత్తు నుంచికొనగా నామెకు గలిగినవాఁడు. ఆ తండ్రికి సంతానము లేకపోవుటవలన నితఁడే వారసుఁడై యీ రాజ్యమున కధికారియయ్యెను. ఆ రాజ్యము చిన్నది. పాడి పంటలు సమృద్ధిగా గల దేశము కాదు. కొండదేశము. సముద్రమునకుఁ జాల దూరమయిన దేశము. వానకురిసి సెలయేళ్లు పుట్టినచో పర్వతములలోఁ బ్రవహించి పర్వతదేశము దాటిన వెంటనే యున్న యెడారిలో నింకిపోవును. ఆ వర్షజలము నదీరూపమే తాల్పదు. సెలయేళ్ళవలెఁ గోసికొనిపోవుచు. ఆ కోసికొనిచను ప్రవాహములు తాడిలోతున నుండును. ఒక కట్ట వేయుటకు నా నీటిని భూమిమీఁద మరలించుటకు వీలులేదు. ఒకవేళ నట్టి ప్రయత్నము చేసినను జదునైన దేశము లేదు. నీరు ప్రవహించుటకు వీలులేదు. అన్నియు మిట్టపల్లములు. ఒక చిన్న మడిచేసి నీరు ప్రవహింపఁజేయుటకే వీలులేదు కాని పర్వత పార్శ్వభాగములయందుఁ గొన్నిచోట్ల దున్ని సజ్జజొన్న రాగి మొదలైనవి పండింతురు. ఆ పంట యేమూలకును రాదు. దేశంలో నారణ్యకమయిన వృక్షసంపద యెక్కువ. అడవులు కొట్టినచో బోలెడంత దారువు వచ్చును. అవి కొట్టి యీ సెలయేళ్ళలో వేయుదురు. కలపయంతయు నెడారిలో వచ్చి నిలుచును. అచ్చటినుండి పరదేశముల కెగుమతి సేయుదురు. ఆ దేశమునందు ద్రాక్షలు, అంజూర మొదలైన ఫలములు సమృద్ధిగాఁ బండును. వాని నెగుమతి చేయుదురు. పర్వతప్రాంతములందలి జనులు యుద్ధకుశలులు, మోటువారు. సమీపదేశములమీఁదికి దండుపోదురు. గ్రామములమీఁదఁబడి దోచు

కొందురు. అచ్చటిప్రజ కీ మూఁడే వృత్తులు. కలపవర్తకము, పండ్లవర్తకము, దోపిడి. ఈ దేశమునకు హాంగరాజు రాజు. హాంగరాజు గొప్ప రాజనీతివేత్త. తంత్రజ్ఞుఁడు మానవసృష్టి యొక్క మనోధర్మమెఱిఁగినవాఁడు. తానీ రాజ్యాధికారము పూనినది మొదలు తన దేశము నెంతయో సుభిక్షముచేసెను. తన దేశప్రజల కీ రాజ్యమునందు స్థావరము కల్పించెను. ఇచట నివసించుచున్న ప్రజలద్వారా తన పలుకుబడి వృద్ధిపఱచు కొనెను. తన దేశీయుల కున్నతోద్యోగముల నిచ్చెను. ఈ దేశస్థులు కొందఱికి మహోద్యోగము లిచ్చి తనమాట సాగించి కొనుచుండెను.

కాని చాలమంది దేశీయులకు హాంగరాజన్నచో నిష్టము లేదు. తమ స్వాతంత్ర్యము హాంగరాజు హరించెనని వారి యుద్దేశము. కాని యెవ్వరును పైకిచెప్పరు. హాంగరాజు వల్లభ మంత్రిని గాదనుటకు వీలులేదు. మహారాణి జీవించియున్నది. ఆమెకు వల్లభమంత్రిమీఁద విశ్వాసము. హాంగరాజునకుఁ బలుకుబడి యెంతయున్నను ప్రజల యభిమానమంతయు మహా రాణిమీఁద నున్నది. మహారాణి నేమిచేయుటకు వీలులేదు. అందుచేత మంత్రి నేమిచేయుటకు వీలులేదు.

ఈ దేశీయులమతము వేఱు. హాంగరాజుమతము వేఱు. హాంగరాజుతండ్రి తొలుత నీ మతస్థుఁడే. ఆ ప్రజలు వేఱేమత స్థులు. హాంగరాజు రాజ్యమునకువచ్చినతరువాతఁ దాను ప్రజలమతమునే స్వీకరించెను. ఆ దేశములో రాజనియు ప్రజ లనియు లేదు. రాజనినచో రాజు. గుంపులు గుంపులుగాఁ జేరి దోపిడిచేసి జీవించుజాతికి రాజేమిటి. రాజన్నది యొక విశ్వా

సము. రాజేకాదు. రాజస్థానీయుడైన నంతే. అది యొక విశ్వాసము. సర్వమానవులకు నొక నీతి యున్నది. ప్రతివానికి నది జన్మతః వచ్చును. తన చుట్టుపట్లఁగల పరిస్థితులచేత నది వృద్ధి పొందును.ఎవఁడోయొకఁడు తమకునాయకుఁడనియోకులము పెద్దయనియో రాజనియో విశ్వసించి వానిచెప్పుచేతలలో మెలఁగుటకూడ మానవజాతిలక్షణ మనిపించును. లోకములో నున్న యధికారుల యధికారమంతయు నీ మానవలక్షణము మీఁద సాగుచున్నది. ఎవఁడైనను స్వతంత్రుఁడు కాదన్నచో నీ మానవసహజలక్షణముకల పలుమంది సాహాయ్యముతో నా యధికారి స్వతంత్రించిన వీసిని శిక్షించి తనయధికారమును నిలఁబెట్టికొనును. ఇట్టి స్వతంత్రులకు భీతికలుగును. ఆ సహజమయిన మానవజాతిబుద్ధియందుఁ గల సహజసేవాలక్షణము నీరీతిగా వ్యాపించిన భయమును రెంటిని బురస్కరించుకొని రాజు రాజగును. అధికారి యధకారియగును. నాగరకజాతుల యందుఁగూడ మూలసూత్రమిదేయైనను నీ యాటవికజాతుల యందు నీ మూలసూత్రము విస్పష్టముగా భాసించును. హంగ రాజు తన రాజత్వమును వృద్ధిపొందించుకొనుటకుఁ దన మేన యల్లుంగ్రడ రాజ్యమును జక్కగా వినియోగపఱచుకొనెను. పూర్వము తనదేశములో హంగరాజు రాజనగారాజు. అంతే. ఇప్పుడు యథార్థముగా రాజు. ఆదేశములోనున్న పలుమంది కిక్కడ వృత్తులు. ఈ దేశముయొక్క ధనము సమృద్ధిగా నా దేశమునకుఁ బోవుటచేత నచటి ప్రజలు పూర్వములేని భోగముల ననుభవించుచున్నారు. పెద్దపెద్ద మేడలు నిర్మించుకొన్నారు. చాలదేశము చదునుచేసికొన్నారు. పంటలుపండుట

యసంభవమన్న దేశములోఁ గొన్ని పంటలు పండించుచున్నారు. పూర్వము పట్టి కలపయుఁ బండ్లుమాత్రమే వర్తకముగాఁగల దేశము నేఁడు సర్వద్రవ్యములతో వర్తకముచేయుచున్నది. ఈ దేశమునందు బండినపంటలు నిక్కడి ఖనిజములు మొదలయిన సర్వద్రవ్యములు హంగరాజదేశమునకుఁ బోయి యచటినుండి తదితర దేశములకుఁ బోవలయును. హంగరాజుమహా మేధాశాలి.

అతని మేనల్లుండ్రిద్దఱు నేఁడు బుద్ధిమంతులయినారు. వారికి వయసువచ్చినది. పెద్దవానికిఁ బాతికయేండ్ల వయస్సు. రెండవవాని కిరువది దాటినది. హంగరాజు మున్నెప్పుడో పెద్ద వానికి రాజ్యమిచ్చి తాను తొలగవలసినవాఁడు. అతఁడు తొలగలేదు. రాజ్యము పెద్దవానిదా? చిన్నవానిదా యన్న ప్రశ్న పుట్టించినాఁడు. చిన్నవానిదైనప్పటికి వానికిని వయస్సురానేవచ్చి నది.అతనికప్పగించి పోవచ్చును.అప్పుడు మరలనొక ప్రశ్న పుట్టించి నాఁడు. చిన్నవాఁడు మేనమామ యెంత చెప్పినచో నంత.అతఁడు మేనమామమతమును స్వీకరించినాఁడు. రాజ్యము తనదే. తన బదులే మేనమామ రాజ్యముచేయుచున్నాఁడని యతనిచేతఁ జెప్పించినాఁడు. అన్నదమ్ములకుఁ బడదు. తమ్ముఁడీ పరమత మును స్వీకరించుట యన్నకేమియు గిట్టదు. కాని తమ్ముఁ డన్నచో మిక్కిలి ప్రేమ. రక్తస్పర్శము చాలచెడ్డది. తమ్ముఁడో కొడుకో మేనల్లుఁడో పరమతమును స్వీకరించును. ఆ మత మును స్వీకరించినవారి యిండ్లలో భోజనముచేయుటకుఁగూడఁ దగరు. వారి యాచారము లంత భిన్నములు. ఆ పరమతస్థుని వాకిటిలోనికిఁగూడ రానీయరు. వచ్చినచోఁ దాము మైలపడి పోయితి మనుకొందురు. అట్టిస్థితిలో నా పరమతస్వీకరణము

చేసిన బంధువునకు రహస్యముగా వంటయింటిలో నడ్డింతురు. కార్యక్రామతులన్నింటికి వాఁడును, వానిపరజాతిభార్యయు వచ్చి పాల్గొందురు. కట్నములు చదివింతురు. కానుకలు స్వీకరించిపోదురు. ఇది రక్తస్పర్శయొక్క మహిమ.

ఈ మహిమయు నన్నిప్రదేశముల సమానమైనయార్ద్రత కలిగియుండదు. ఆ పరమతము స్వీకరించినవాఁడు తన పూర్వమతమునకుఁ బ్రబలవిరోధి. వాఁడు వీరికిఁ బరమబంధువు. ఈ పరిస్థితి యింత వ్యత్యస్తముగా నుండును. వాని యభిమానమంతయుఁ బరమతమునందుఁ బరజాతియందు వీరికి వానిని బురస్కరించికొని తన్మతమునందుఁ దజ్జాతియందు నుపేక్షాభావము. వాని కంత తీవ్రత, వీరి కింత సౌజన్యము కలుగుటకుఁ గారణమేమి? ఒక మహాతటాకమున్నది. ఆ తటాకములోనుండి యొక కయ్య ప్రవహించినది.ఆ కయ్యనీ రెగువ కెప్పుడునుపోదు. తటాకజలమే సర్వదా కయ్యలోనికిఁ బ్రవహించుచుండును ఇది సహజము ఈ సహజత్వమెచ్చట నున్నది?తటాక మున్నత ప్రదేశమందున్నది. కయ్య నిమ్న దేశమందున్నది. ఆ తటాకమునకున్నతలక్షణములు సహజములు. ఈ కయ్యకు నిమ్నలక్షణములు సహజములు దాని యౌన్నత్యము దానికిఁ దెలియదు. దీని నిమ్నత్వము దీనికిఁ దెలియదు కాని సమానలక్షణము జలము. ఈ కయ్య కెప్పుడును తటాకములోని సర్వజలముచేతఁ దన్నుదా నిండించుకొనవలెనని. అప్పుడు తటాకమే లేదు. ఇది యొకదానికొకటి పొసగని విషయము. కాని వ్యామోహము చెడ్డది.

చనిపోయిన మహారాజుపేరు మాంధాత. పెద్దరాజు

కుమారునిపేరు వివస్వంతుఁడు. రెండవవాఁడు శశి. రాజకుమారు లిద్దఱు హంగరాజును గలిసి వల్లభమంత్రిదర్శనార్థము వచ్చి నారు. హంగరాజు వల్లభమంత్రిచేతఁ జెప్పించి వివస్వంతుని చేత నేదయినఁ జేయించవలయును. వివస్వంతుఁడు వల్లభ మంత్రిమాటయే వినును. ఒక మహాకార్యమును దలఁబోసి హంగరాజు మేనల్లుండ్రనిద్దఱిని వల్లభమంత్రికడకు దీసికొని వచ్చెను. ఆసమయములో గౌరీపతిశాస్త్రి మంత్రిదర్శనార్థము వచ్చెను. ఆయనకు దర్శనమిచ్చుట హంగరాజున కిష్టము లేదు. కాని మంత్రి పండితుని లోపలికిరమ్మని యనుజ్ఞయిచ్చెను. వా రేపనిమీఁదవచ్చిరో వల్లభమంత్రికిఁ దెలియును. ఆ కార్యము నకు వివస్వంతుఁడు వ్యతిరేకి. తానంతకుముందే వ్యతిరేకి. తన వ్యతిరేకభావము ప్రదర్శించినచో హంగరాజు మహోగ్రుఁ డగును. అతఁడు చిందులుత్రొక్కును. తందనాలాడును. బెదరిం చును. అట్లుచేయుదు నిట్లుచేయుదు ననును. అవియన్నియు వల్లభ మంత్రిముందు నిష్ఫలములు. ఐనను వల్లభమంత్రి సాధ్యమయి నంతవఱకు కట్టి పరిస్థితి సమకూర్చెఁడు. ఏదో రాజనీతిప్రసంగము తెచ్చి గౌరీపతిశాస్త్రిచేత నీ యుపన్యాస మిప్పించినాడు. కాలా తీతమయినదని యానాఁ డెవరిదారినివారు పోయిరి.

౨

"ఆ మాంధాత తన సర్వరాజ్యవ్యవహారములు తానే చూచుకొనుచుండెను. నేను పేరునకు మంత్రిని. ఏదైనను క్లిష్ట సమస్య వచ్చినపుడు నన్నడుగుచుండెడివాఁడు. నాకుఁదోచినది చెప్పెడివాఁడను, ఆయన నా మాట పాటించెడివాఁడు. నేను

మంత్రినని పేరేగాని మంత్రికిఁదగిన భోగములు నేనేమియు ననుభవించలేదు. నేను భోగవిముఖుఁడను. దీనికిఁగారణము నా జీవితాదియందుజరిగిన సన్నివేశము కావచ్చును. నా చిన్నతనములోననే నా భార్య కాపురపునకువచ్చెను. మేమిద్దఱము రెండేండ్లు కలిసి సంసారముచేసితిమోలేదో యామె చనిపోయినది. ఏడాదిపిల్లవానిని నా కప్పజెప్పి చనిపోయినది. నన్ను మరల వివాహముచేసికొమ్మని బంధువులు మిత్రములు చాల బలవంతముచేసిరి. ఆమెయందలి ప్రేమచేత నేను చేసికోలేదు. శాస్త్రిగారూ! ఈ ప్రేమయొక్క లక్షణమేమి? ఆమె యెవ్వరు? నేనెవ్వరు? ఆమెశరీరమునం దే జీవుఁడు వసించెనో? నా యీ శరీరమునం దీజీవుఁడు వసించుచున్నాఁడు. నాలోనున్నజీవుఁ డిట్టివాఁడని నాకుఁదెలియదు. ఈ జీవుఁ డీ శరీరముతో నభేదప్రతిపత్తి కలిపించికొని దీనియందు మమకారము కలిగియున్నాఁడు. ఈ శరీరముతో సంపర్కముకలిగి మరియొక శరీరమునందుఁగల జీవునకు నీ జీవునకు సంబంధమేమి? సంబంధముశరీరసంబంధము. శరీరము లింగవంతము. దానిని బురస్కరించికొని యీ సంబంధము. ఇది శరీరవ్రతమా? జీవవ్రతమా? శరీరవిశిష్టజీవులిద్దఱు పరస్పరసౌహార్దము పెంచికొనినదానిని ప్రేమయందురా? ఆ జీవుఁ డాశరీరమునందున్నంతవఱకే వారి కీ ప్రేమ. ఇద్దఱిలో నొకజీవుఁడు శరీరత్యాగముచేసి వెడలిపోయినతరువాత శరీరస్థజీవునకువలె వ్యపేతశరీరుఁడయిన రెండవజీవునకుఁగూడ నిట్టి ప్రేమ యుండునా? ఈ లోకమును సంగ్రహించికొనుటకీ శరీరమేర్పడినది. లోకసంగ్రహణశక్తి శరీరాంతము. ఈ ప్రేమ లోకసంగ్రహమునం దొక భావము. అందుచేతఁ జనిపోయినవారి

కొఱకు వ్రతమూపూనుట నిష్ప్రయోజనము. మఱియు నీ ప్రేమ తొలుదొలుత దుఃఖముగాఁ, దరువాత స్మరణగాఁ, పిదప భావముగా నిలిచిపోవుచున్నది. నా భార్య చనిపోయిన తొలినాళ్లలో నేనుపడినబాధకు మితిలేదు. బాధయనఁగా మనస్సులో నామెతోడి నా పరిచయమును బహుశః యాలోచించి యాలోచించి యా పరిచయము పోయినదన్న భావము నిశితమై యది బాధాజనకమగుట. ఆయూహలేకుండగూడ నొక దిగులు మనస్సులో నిత్యముగా నుండెడిది. ఊహలేకుండ దిగులుండెడిది. ఆయూహలసమూహము విహరించినతరువాత వాని ముద్రను మనస్సు నిలఁబెట్టుకొనుననుకొందును. అదియే దిగులు, తరువాత నా దుఃఖముపోయినది. మనస్సంతయుఁ బిల్లవాని క్షేమము చూచుటతో వ్యాపృతమైయున్నది. ఆపిల్లవాఁడిరువది యేండ్లు పెరిగి నాతోఁజెప్పకుండ వెడలిపోయినాఁడు. వాఁడు లేచిపోయెడి లక్షణములు నానియందుఁబూర్వమే గోచరించెడివి. ఆతల్లి పరలోకమునకుఁబోయినది. వీఁడు పరదేశములకుఁ బోయినాఁడు. ఆతల్లిలక్షణమే వానికినిబట్టినది. ఆమహారాజు మాంధాత పలుదేశములకుఁ జారులనుబంపి వెదకించినాఁడు. నేను వలదన్నాను. ఆయన దయావంతుఁడు. వాఁడు కనిపించలేదు. ఈరాజు నాకు నెలకు వేయి నిష్కముల జీతమిచ్చును. నాకెందుకు తమవంటి పండితులువత్తురు వారికిత్తును. పేదవారికిత్తును. నావంట నేనేచేసికొందును. రాజసేవకులు నాయింట వచ్చి నేనువలదన్నను బరిచర్యచేయుచుందురు. ఇదినా జీవితము. నాకు దేవితోడను సంబంధములేదు. కాని యామాంధాతకుమా

రులను సరియైన త్రోవలోఁబెట్టి వారిరాజ్యము వారి కప్పగించ వలసిన బాధ్యత నామీఁదనున్నది. ఈ హూంగరాజు ప్రపంచక మంతయు నాపోశనముపట్టదలచినవాఁడు. ఆయనకు నా ప్రకృతి తెలియును. సులభముగా రాజ్యము గ్రైవసముచేసికొన్నాఁడు. నేను నూరకుంటిని. రాజకుమారులకు బుద్ధివచ్చినతరువాతనితఁడు పోక తప్పదుగదా యనుకొంటిని. ఈ రాజ్యమున హూంగరా జీ యన్యాయమును జేసి యీ యన్యాయముచేయలేదని లేదు. వాని దొక దుర్మతము. వానిమతము మంచిదో చెడ్డదో మనకెం దుకు. ఈ దేశములోనిమతము నిర్మూలనముచేసి,తనమతమిచ్చట సర్వదా వ్యాపింపఁజేయవలయునని యతని యభీష్టము. తన మతము నెందుకు వ్యాపింపఁజేయవలయును. ఇచ్చటి ప్రజలం దరు చనిపోయి నరకలోకములకుఁ బోవుదురు. వారికి మోక్ష మిప్పించవలయుననియా? తనమతములోనే మోక్షమున్నది. పెఱమతములో లేదని తాను జూచివచ్చెనా? మతమనినంతనే కొన్ని ధర్మములు కొన్ని నియమములు కొన్ని విశ్వాసములు కదా! ఏ మతమునకు సంబంధించిన ప్రజాసామాన్యమును తద్ధర్మ నియమ విశ్వాసములుకలదని చెప్పుటకు వీలులేదు. ఏమతములో నైనను నెవ్వరో కొద్దిమంది తద్ధర్మ నియమవిశ్వాసములు కలిగి ప్రవర్తింతురు. వారిసంఖ్య చాల స్వల్పము. తక్కినవారందరు మోక్షమునుద్దేశించి బ్రదుకరు. లోకమునందలి సుఖమును సంప త్తిని భోగముల నుద్దేశించి బ్రదుకుదురు. ఇది మానవునియొక్క సహజలక్షణము. ఎవఁడో నియమవంతుఁడు. వానికిఁ దత్ఫలిత ముండవచ్చును. తక్కినవారికి శోకమేయుండును. అటువంటి యప్పుడు పరమతస్థులనుగూడఁ దనమతములోనికిఁ ద్రిప్పుకొన

వలెనని ప్రయత్నమెందులకు? మతమనినంతనే యాధ్యాత్మిక ప్రవృత్తికి సంబంధించినది. ఆ ప్రవృత్తియే లేనివారలకు మత మెందుకు? ఈ మతమును బురస్కరించికొని తన రాజ్యము తన యధికారము తన సంపద నభివృద్ధిచేసికొనుటకు మఱియింకొక ప్రయోజనము కనిపించుటలేదు. మానవుఁడు పుట్టుకచేత మూఢుఁడు. మానవునియొక్క మనస్సు పరమ కృత్రిమమైనది. క్రొత్తదానియందు దేనియందైన మోహపడునది తనకుఁ బరిచితమయినదానియందు లగ్నమగునది — ఈ రెండును బరస్పరభిన్నములైన గుణములు. ఈ మతమునందు బుట్టినవారి కిచ్చటి సంప్రదాయములు నాచారములు, పరిచితములయినవి. వానియందు సహజముగా నభిమానముండును. ఇది ప్రధాన మనోలక్షణమైయుండగాఁ గ్రొత్తదానిని దేనినో చూచి దాని యందు వ్యామోహమును బొందుట జరుగుచున్నది. ఇది మనో లక్షణమునకు భిన్నమయినది ఇది వ్యామోహలక్షణము కనుక మనస్సునకు సహజలక్షణ మొకటి, వ్యామోహలక్షణ మొకటి రెండున్నవని నిరూపితమగుచున్నవి. ఈ వ్యామోహలక్షణ మెట్టిది? ఈ వ్యామోహలక్షణము సహజలక్షణము నెట్లతిక్ర మించి వర్తించునో విచారించినచో వ్యామోహలక్షణ మెట్టిదని చర్చచేయవలయును. వ్యామోహలక్షణమనగా భోగలక్షణము. ఈ మనస్సుతో మానవుఁడు భోగించవలయునని ప్రయత్నిం చును. సుఖాదు లనుభవించవలయునని ప్రయత్నించును. ఆ సుఖానుభూతిభావము పలువిధములుగా నుండును. ఒకటి శ్రమపడకుండుట. రెండవది అనాలోచితముగ సమకూడివచ్చుట. మూఁడవది తనకేదో తెలియని యితర జీవులతోడి పరిచ

యమువలన లోకము నెక్కువ సంగ్రహించికొనుచున్నానన్న భ్రాంతి. ఆహార విహారాదులయందుఁ గొంత స్వేచ్ఛ. భోగ భావ మీ విషయముల సంబంధించియుండును. ఈలోకములో దేనియందును స్వేచ్ఛ లేదు. పరిచితమయినదానియందుఁగంటె నపరిచితమైనదానియందు స్వేచ్ఛ యెక్కువ యున్నట్లు కనిపించును. దానికిఁ గారణము తొలుదొలుత తన పరిచితమయిన దానిమెఱపుగా జూచును కాని లోనికి దిగినప్పుడు దాని తరుగులు తెలిసికొనుట. తన మతములోని తరుగులు తనకుఁ దెలియును. పరమతములోని తరుగులు తనకుఁ దొలుతఁ దెలియవు. తరువాతఁ దెలియును. తెలిసినతరువాతఁ జింతించి ప్రయోజనములేదు. మొదటఁ దాను త్వరపడి చేసినపనిని చివఱిదాఁక సమర్థించికొనుటకు మానవుఁడు లేనియావేశమును బుట్టించికొని ప్రవర్తించును. మధ్వవైష్ణవమునకు నామములు పెద్ద' యన్నమాట యిట్లే వచ్చినది. జగత్తునందలి సర్వజనులను దన మతమునకే త్రిప్పికొని వీఁడు సాధించెడిదేమి? చివఱకుఁ దా నే యూహతో దీని నారంభించెనో యా యూహయుఁ జెడిపోవును. తన చెప్పుచేతలలో నుండునని తన యదుపాజ్ఞలలో నుండునని వానిని దన మతములోనికిఁ ద్రిప్పికొన్నాఁడు. కొన్నాళ్లు గడచినతరువాత వీనికినిఁ దన 'పరాధీనలక్షణము తెలియును. తాన స్వాతంత్ర్యమవలంబించును. చివఱకు మిగులునది వాఁడు, నా మతస్థుఁడన్నది మాత్రమే. వాఁడు నా మతస్థుఁ డన్నమాటలోని విశేషమేమి? వాఁడు మా యూరివాఁడు, వాఁడు మా మండలమువాఁడు అన్నమాటలలో నెంత యర్థమున్నదో, వాఁడు నా మతస్థుఁడన్నమాటలోన

నంతే యర్థమున్నది. ప్రయోజనమునూలిన యొక యనుబంధ మును వృద్ధిచేసికొనుట. ప్రయోజనము దగ్గఱకువచ్చినపు డా యనుబంధము లేదు. ఎందుకనగాఁ బ్రతివాఁడును స్వార్థపరుఁడే. పై మెఱుపులు చెలుములు తళుకుమాటలు స్వార్థమును స్పృశించనంతవఱకు. ఈ మతవ్యాప్తిచేయువారి కీమాత్రము పరిజ్ఞానము లేదా యందము. లేదనియే చెప్పవలయును. ఉండి కూడ నిట్లు చేయుచున్నారన్నచో వారి దుర్వృత్తి కవధియే లేదు. ప్రతి మానవుఁడు మిక్కిలి బ్రదికినచో వందయేండ్లు బ్రదుకును. తరువాత వానిదారిని వాఁడు పోవును అప్పు డేమి జరుగునో వానికిఁ దెలియదు. తాను బ్రదికియున్నప్పుడు తనకుఁ గొంత లాభము జరుగును. ఆ తాత్కాలికలాభముకొఱకు సార్వకాలికముగా నుండిపోవు నొక యవినీతికార్యమును వాఁడు చేయును. వాని యాశ కాలమును బట్టదు.

మఱియుఁ గొందఱు తమ మతమును బరిత్యజించరు. ఒకఁ డెందుకు పరిత్యజించును? మఱియొకఁ డెందుకు పరిత్యజిం చఁడు? వీని కీ మతమెందుకు వ్యామోహజనకముగా నుండెను? వాని కెందుకులేదు? వీఁడెందుకు తీవ్రవాది? వాఁడెందుకు కాఁడు? నీ వొకదానిని విశ్వసించితివి. సర్వజను లట్టివిశ్వాసమునే కలిగి యుండవలయునని నీ వూహించుటయా. అది నీ యహంకారము. అది లోకముమేలుకొఱకన్నట్లు భాసింపఁజేయుదువు. మానవుఁ డొక ధనముచేతనే సంతోషించఁడు. ఒక్క భోగముచేతనే సంతోషించఁడు. మనస్సుయొక్కతృప్తి విలక్షణమయినది. తాననుకొన్నట్లే మఱి పదిమందికూడ ననుకొన్నచో వీని కొక తృప్తి. దానివలన సుఖపడునా? సుఖపడుటకేమియును లేదు.

అదియొక భోగము. భోగమన్నమాటయే చమత్కారమయినది. దేవాలయములలో స్వామికి భోగముచేయించితిమందురు. సరిగా నామాటయర్థము నిరూపింపబడుట కదియే స్థలము. దేవాలయములోనివిగ్రహ మనుభవించున దేదియు లేదు. పదితూముల బియ్యముతో పులిహోరచేయించి స్వామికారగింపించితివి. ఇదియొక భోగము. పది పన్నీరుబుడ్లతోఁ బది యత్తరుబుడ్లతోఁ బది నదీజలములతో స్వామికభిషేకము చేయించితివి. ఇది భోగము. స్వామికిఁ బట్టు జరీతాపితాలు కట్టించితివి. ఇది భోగము. ఈ భోగములు స్వామియందు నిష్ప్రయోజకములా? యన్న ప్రశ్న కిచ్చట తావులేదు. భోగశబ్దార్థనిర్ణయమే యిక్కడ తాత్పర్యము. భోగమనగా నిది. తనమతమును వేయిమంది కిప్పించును. తాను గురువువలె నూరివెంటఁ దిరుగుచుండును. అది యొకభోగము. తనకు వచ్చెడి దేమియు లేదు. కాని పదిమందితన్ను గౌరవముగాఁజూతురు. అహో! మానవుఁడు జీవించియున్నప్పుడు వాఁడు తనకుఁ దిండిత్రిప్పలు లేకపోయినను తన్ను నలుగురు గౌరవించుచుండిరని యొక యహంకారమును బొందును. ఇట్లు చేసినను గొంత నయమే మఱియింకొకలక్షణమున్నది. తన కేమియు లాభము లేదు. తనకువచ్చెడు గౌరవము లేదు. ఎవరికో లాభము వచ్చును. ఎవరికో గౌరవమువచ్చును. అది లోకోపకారమన్న బుద్ధితోఁగూడఁ జేయఁడు. ఆపనిని నేను జేసితినన్న యహంకారముకొఱకు చేయును. ఇది యాశ్చర్యము. మఱియింకొకఁడు తన జాతితోడనో తన మతముతోడనో తన సంఘముతోడనో యభేదాధ్యవసాయము కల్పించుకొని ప్రవృత్తుఁడగును. వానికివచ్చెడు లాభముకూడ నలుగురు చెప్పి

కొనుటయే. ఇట్టి ప్రతిష్ఠకొరకు మానవుఁడు ప్రధానముగా జీవించుచున్నట్లు కనిపించుచున్నది. ఇద్దఱును మూర్ఖులే. కాని తాత్కాలికమయిన తన యధికారముకొఱకు సార్వకాలికమైన రొక్క యవినీతిని వ్యాపింపఁజేయువానికంటె వీఁడు నయము.” అని వల్లభమంత్రి యూరకుండెను. గౌరీపతిశాస్త్రివచ్చి పది దినములయినది. మంత్రియింటనే యుండెను. క్రమముగా రాజ్యాంగముయొక్క స్వరూపము . తెలిసికొనుచుండెను. మంత్రి దాత. ఆయననుండి యేదో కొంత సంపాదించికొని కుటుంబపోషణము చేసికోవచ్చునని వచ్చినవాఁడు. అతఁడా దేశమువాఁడే కాని, యీ పండితులు దేనితోను జోక్యము కలిపించుకొనరు. తమ మతధర్మము చెడిపోవుచున్నదని దుఃఖింతురు. దాని నెదుర్కొనరు. తమ ధర్మము తమ యాచారము మాత్రము తమకు సంబంధించినంతవఱకు సంరక్షించికొందురు. ఎంత ధర్మమైనను మఱెంత యాచారమైనను జీవిక గడచుచుండ వలయును కదా! ‘రాజానుమతో ధర్మః’ ‘శరీరమాద్యంఖలు ధర్మ సాధనం’ మొదలయిన యభియుక్తోక్తులననుసరించి ప్రతివాఁడును తన జీవిక తాను చూచికోవలయును. జీవికసాగుటయు ధర్మము రక్షింపఁబడుటయు నీ రెండును దైవముయొక్క నిష్కృపవలన రెండుమార్గములు పట్టినేని ధర్మమునకుఁ జేటుకాలము వచ్చె నన్నమాట. ఐనను పండితులు తమ ధర్మాచారములను బరిత్యజించరు. లోకముతో జోక్యముపెట్టుకోరు. గౌరీపతిశాస్త్రి యిన్నాళ్లును దక్కిన పండితులవలె నిట్లే బ్రదికినవాఁడు. ఈ పదిదినములనుండి మంత్రియింటిలో నుండుట మూలముగ మంత్రి తనతోఁ జనవుగా మనసిచ్చి మాటాడుట

హేతువుగా రాజకీయవ్యవహారములయందుఁ గొంత ప్రవేశము కలిగించుకొనెను. ఆయన వలదన్నను ప్రవేశము కలుగక తప్పలేదు. శాస్త్రిగారి కొక్కసంగతి తెలిసినది. మంత్రి పరమ శాంతుఁడు; సాధువు; అహింసాపరుఁడు. మహా మేధావి. హంగరాజుచేసెడి యన్యాయములన్నియుఁ దెలిసిన వాఁడు. ప్రతిక్రియానిపుణుఁడు. కాని యది హింసామార్గమును నవినీతిమార్గమునని తా నూరకుండును. దీనిని హంగరాజు మంత్రియొక్క యసమర్థతయని భావించుచున్నాఁడు. హంగ రాజు చేసిన దుర్మార్గము చాల యున్నది. కొన్నిటిని మంత్రి తనతోఁ జెప్పినాఁడు. హంగరాజు తన మతమునం దావేశము కలవాఁడు; ఈ రాజ్యమును గ్రసించుట పరమోద్దేశముగా గల వాడు; అను రెండు భావములచేతను వానిమనస్సు సమాన ముగా తాడితమైనట్లు కనిపించుచున్నది అహోబలక్షేత్ర మున్నది. అచటికి ప్రతి మాఘపూర్ణిమకు నీ దేశ మతస్థులు వేలకొలఁది తీర్థయాత్రపోదురు. ఆ క్షేత్రములో జలసమృద్ధి లేదు. ఒక తటాకమున్నది. తిరునాళ్లు మూఁడు దినములు సాగును. ఆ తటాకమునందలి జలము కొంతవఱకు పాచిపట్టి యుండును. దానికి నీటివరవ లేదు. పూర్వ ముండెడిది. అది పూడిపోయినది. దానిని బాగుచేయించెడి రాజు లేఁడు. ఆ మూఁడుదినములు వేలకొలది యీ తీర్థప్రజ భక్త్యావేశతప్ప రులై యా నీరమే త్రాపుదురు. ఆ నీరముతోనే వండుకొం దురు. ఇదివఱకే కశ్మలమయిన యీ నీటిని దమ శరీరధర్మ నిర్వాహణమునందు మఱియుఁ గశ్మలముచేయుదురు. కలరా మొదలయిన వ్యాధులు మఱి యెందుకు ప్రబలవు. అట్టి స్థితిలో

హాంగరా జొక యేడాది యీ నీటిలో విషము కలిపించెను. వేలకొలది జనము చనిపోయిరి. ఇది హాంగరాజు చేసినాఁడని యందఱికిఁదెలియును. ఏమనుటకు వీలులేదు. ప్రజలు కొన్నాళ్లు గుములు గుములుగాఁ గూడి గుబ్బిసలాడినారు. కొన్నాళ్లకు మఱచిపోయినారు. దేశములో నుద్యోగములు గొప్ప వేతనములుకలవన్నియు హాంగరాజీయులకుఁ, దదనుయాయులకు మాత్రమే. హాంగరాజునకు వ్యతిరేకముగా నెవరెవ్వరు మాటాడుదురో వారిపేర్లు కనుగొని వారిని శిక్షించుటకు గూఢ చారులు కలరు. ఆ గూఢచారు లీ దేశస్థులే. వారికి దేశాభి మానమున్నదో లేదో తెలియదు. తొలుత జీవిక జరిగినగదా! దేశాభిమానము! మానవులలో నెవరో యుత్తములుందురు. వారిజీవిక సాగుటకంటె ధర్మము జీవితలక్ష్యము పాలింపబడుట ముఖ్యము. వారిసంఖ్య చాల స్వల్పముగా నుండును. తన జాతి భ్రంశమగుచున్నను తన ధర్మ మధఃపతనమగుచున్నను తాను బ్రదుకవలయునని తన దారపుత్రాదులను పోషించు కొనవలయునని సామాన్యజీవుడు తహతహలాడును. ధర్మము కొఱకు వారే కథానాయకులు. వారే యుత్తములు. వారి జీవితములే మహా కథలు.

హాంగరాజుచేసిన బహువిధములయిన యన్యాయముల చేత దేశము గగ్గోలుగా నున్నది. ఈ పదిదినములలో నొక సన్ని వేశము జరిగినది. కొందరు వ్యక్తులు వచ్చి మంత్రితో నొక విన్నపముచేసికొనిరి. వారిబంధువులు హాంగరాజుమతమును నిందించిరని వారిని జెఱసాలలో నుంచిరి. వారిని విడిపించికొను టకు నా బంధువులు పలుచోట్లకుఁ బోయి గొప్ప యధికారు

లతో జెప్పికొనిరి. వారట్టిపని చేయలేదనియు వారిమీఁద నీ యభూతకల్పన కొందరు చేసిరనియు వారు విన్నవించుకొనిరి. పై యధికారులుకూడ నేమియుఁ జేయలేకపోయిరి. వారు వచ్చి మంత్రితో జెప్పికొనిరి. మంత్రి హాంగరాజునింటికిఁ బోయెను. వారిని నిర్బంధించుట న్యాయముకాదని చెప్పెను. హాంగరాజు రాజ్యములో సర్వపాఠశాలలయందుఁ దన మతము బోధించునట్లుచేసెను ఆ బోధకు లీ రాజ్యమునందలి ప్రధానమతమును నిందించుటతప్ప మఱియొకపని చేయనేచేయరు. ఆ క్రొత్తమతమునుగూర్చి పెదవియెత్తి యొకమాట యన్నచోఁ బరమతసహనము లేకపోవుట యని వ్యాఖ్యానముచేసి యా మాటాడిన వానిజీవితమును క్లేశమయముగాఁ జేయుదురు. హాంగరాజు యొక్క సర్వప్రవృత్తియు నీ దేశమునందలి మతమునందు వానికిఁగల యసహనమే తప్ప మఱియొకటికాదు. ఇట్టి యన్యాయములు వందలు వేలును. ఒక వర్ణమున్నది. వారి యాచార వ్యవహారములు వేఱు. వారల్పసంఖ్యాకులు. గొప్ప ధనవంతులుకారు. అనాదినుండి యొక మరియాదకలవారు. వేఱొక సంఘమున్నది. వారధికసంఖ్యాకులు, ధనవంతులు. ఆస్తిపాస్తులుకలవారు. పలుకుబడికలవారు. అధికారములోనున్నవారు. వీరా ప్రథములను యథేచ్ఛముగా నిందింతురు, దూషింతురు. తిరస్కరింతురు. అగౌరవపఱతురు. ఆ యల్పసంఖ్యాకులలోని యొక్కఁడు వీరినిగుఱించి యే కొద్దిమాట యన్నను వాని కసహనమున్నదని వానినిఁ బట్టి పాలార్తురు. ఇందులోనైనఁ గొంత మేలున్నది. ఒకానొకవ్యక్తి యీ యధికసంఖ్యాకులగుఱించి యే మాటయు ననలేదు. వాని

నెందుకో సాధించవలయునని వీరిలోఁ గొందఱికి దుర్బుద్ధిపుట్టి నది. అది మొదలు వాఁ డననిమాట లన్నట్లుగా, వానికిలేని యూహాలు వాని కున్నట్లుగాఁ బ్రచారముచేసి, వానికిఁ బుట్టు గతులు లేకుండఁజేయుదురు. ఇదియంతయు హాంగరాజుయొక్క రాజనీతివికాసము. ఆ నీతివికాసము ముందు మాంథాతయొక్క రాజ్యము రాజ్యముగా లేదు. తత్పూర్వ మా దేశములోఁ బరస్పరసహనము ధర్మము ప్రేమ న్యాయము నెంత యుండె డివో యిప్పు డంతగా లేవు. వల్లభమంత్రి హాంగరాజువద్దకుఁ బోయి పరమతసహనములేనిది హాంగరాజీయులకుగాని, తన దేశప్రజలకుఁ గాదని వేయివిషయములు చూపించి, హాంగ రాజు నోరెత్తుటకులేకుండఁజేసెను. హాంగరాజునకు వల్లభ మంత్రిచాకచక్యము తెలియును. కడచిన యిరువదియేండ్లలో నెప్పు డెప్పు డెక్కడ నెక్కడ నే యే దుర్మార్గములు హాంగ రాజీయు లీ దేశమునందలిమతమును వంచించుటకుఁ జేసిరో యొకదానివెనుక నొకటిగా హాంగరాజునకుఁ జూపించెను. 'ఇది యంతయుఁ బరమతసహనమా? ఆ యిద్ద ఱట్లు మాటాడనే లేదు. ఒకవేళ మాటాడినచో మీరుచేసెడిద్రోహములలో నది లేశముకూడ కాదే' యని చెప్పి చూపును. వల్లభమంత్రి యొక్క యీ ప్రతిభకే హాంగరాజు భయపడును. ఎప్పు డేది జరిగినదో సర్వము వల్లభమంత్రికిఁ దెలియును. వల్లభమంత్రి యనుయాయులు దేశమునఁ గలరు. వారినందఱిని పట్టుకొని శిక్షించుట యసంభవము. వల్లభమంత్రియనుయాయులంద ఱును హాంగరాజుయొక్క దుష్టప్రబంధనలు లోకమునకుఁ దెలియఁజెప్పుచునేయున్నారు. దేశములో నెక్కువమంది

కన్నులు తెఱచినారు. కాని మనుగడకొఱకు హాంగరాజు కాద నుటకు వీలులేదు. ఉన్నతోద్యోగులు మూర్ఖులు. హాంగరాజు యొక్క దుష్టపథకము చెప్పినను తెలిసికోలేనివారు. లేదా స్వార్థపరులు. కాని సామాన్యప్రజ మాత్రము వల్లభమంత్రి వెనుక నున్నది. ఈసంగతి హాంగరాజునకుఁ దెలియును. అందు చేత వల్లభమంత్రియన్నచో హాంగరాజునకు భయము. వారిద్దఱిని వదలిపెట్టించెను.

ఆ దేశప్రజ యొక విలక్షణమయిన మనఃప్రవృత్తి కలది. అల్పసంతోషము వారి మనోలక్షణము. ఒక దుర్మార్గుఁడు నిన్ను మోసముచేయుటకు మెత్తగా మాటాడును. అమాయ కుఁడు వాని మెత్తనిమాటలను విని వాఁడు మంచివాడే యను కొనును. అదే పొరపాటుపడినాము, వాఁడు మంచివాఁడే సుమా యనుకొని యజాగ్రత్త నవలంబించును. వీఁడజాగ్రత్త పొందుటయే యా దుర్మార్గుని యభిలషితము. వాఁడు చేయఁ దలచికొనిన యపకారము సులవుగాఁ జేయును. వీఁడపకార హేతుఁడై, వానినిగూర్చి యనుకొనునది యేమనగా వాఁడు మిక్కిలి కృతఘ్నుడు. నమ్మకముతో ద్రోహము చేయువాఁడు. పరమ దుర్గతికిఁబోవునని. ఆ దేశప్రజ యిట్టి స్వభావముకలది. అట్టి ప్రజమీఁద హాంగరాజువంటి దుష్టునినీతి యెంతయైనను సాగును. ఆ దుష్టనీతికిఁ బ్రతిక్రియగాఁ, దాదృశమయిననీతిని బ్రయోగింపవలయును. వల్లభమంత్రి యీ దేశస్థుఁడు. ఇచ్చటి ప్రజాసామాన్యలక్షణ స్వభావములు కలవాఁడు. అతలివాఁడు కొన్నాళ్లకుఁ గాకపోయినఁ గొన్నాళ్లకయినను సాధులక్షణ

ములు కలవాఁ డగునని ప్రతీతిచేయును. కాలాంతరమునందు జన్మాంతరములందుఁ బరమదుర్మార్గుఁడుగూడ సుజనుఁడగు నేమో తెలియదు.

గౌరీపతిశాస్త్రికి సర్వ మిట్లు విదితమయినది. తన యందు మంత్రి కొక ప్రత్యయ మేర్పడినది. కుక్కకాటునకుఁ జెప్పుదెబ్బ గాని రాగిబిళ్ల వేసి కాకరాకుపసరుపోసి కట్టినచో నిశ్చయమైనచికిత్స యగునో కాదో తెలియదు. గౌరీపతిశాస్త్రి యిట్లనెను: మహామంత్రీ! ప్రపంచకముతో సంబంధములేని యోగులు వేఱు. ఆ యోగమార్గములోని కొన్ని సిద్ధాంత ములు తీసికొని వానిని లక్ష్యములుగాపెట్టికొని ప్రవర్తించుట యైహికాముష్మికముల రెండింటికిని జెడినమార్గము. దీని కిదే, దాని కదే."—మంత్రి మాటాడలేదు.

3

ఈ యిరువదియేండ్లుగా నీదేశస్థులలోఁ గొందరు హంగ రాజదేశీయులను బరమక్రూరులను నిర్దయావంతులను దురాశా పరులను గృతఘ్నులను ద్రావినచో మ్మెగ్రుద్దునటువంటి పశు ప్రాయులనుఁ గొందఱ నుపాంశువధఁ జేసిరి. అట్టివారిని వధించు టకు గొన్ని రహస్యకూటముల నేర్పఱచిరి. హంగరాజుగూఢ చారులు వారి నేరియేరి చిత్రవధలు కావించిరి. దేశీయులే వారి యాచోకీ నిచ్చిరి. ఆచోకీలిచ్చినవారు దేశీయులనుట యెందు లకు! గూఢచారులే దేశీయులు. కొందఱికి బుట్టుకతోడనే జాత్యభిమానముండదు. మతాభిమానముండదు. దేశాభిమాన ముండదు. ఇట్టి నిర్గుణ పరబ్రహ్మములు రెండుతెగలు. ఒకఁడు

స్వోదరపోషణార్థమై బ్రదికెడివాఁడు. వానికి సర్వము దార పుత్రాదులే. వానిని దేశాభిమానములేనివాఁడన్నచో వానికిఁ గోపమువచ్చును. వానికి దేశాభిమానముండఁగా లేదనుచున్నా మనికాదా కోపము. దేశమునకు రాజే ముఖ్యమని, తాను రాజభక్తికలవాఁడనని. ఇక్కడ రాజెవరు? హంగరాజు రాజు కాఁడుకదా! శశియే రాజు. ఆ రాజుయొక్క యోగక్షేమములు విచారించువాఁడు హంగరాజు. అందుచే హంగరాజే రాజని వాదన. ఆ దేశములో రాజు విష్ణ్వంశసంభూతుఁడని, దిక్పా లురయంశ రాజులోనుండునని పరంపరాప్రాప్తమయిన యొక సిద్ధాంతము. ఇంక నేమికావలయును? రాజు సాక్షాన్నారా యణస్వరూపుఁడు. ఆ రాజు కటికవాఁడు. కసాయివాఁడు. నిన్ను గూరవండుకొని తినువాఁడు. నీ భార్య నపహరించు వాఁడు. నీ కొడుకులను సంహరించువాఁడు. నీ యాస్తిని సర్వ క్షౌరముచేయువాఁడు. ఐనను వాఁడు విష్ణ్వంశసంభూతుఁడే. ఆ మహానుభావునికిఁ గాలస్వరూపము తెలియదు. కాలము చాల మాఱిపోయినది. రాజునందు విష్ణునంశమువచ్చినిలుచుటలేదు. దిక్పాలురయంశలు వారియందు స్థావరమేర్పఱచుకొనుటలేదు. వేదవేదాంగవేత్తలై స్మృతిరహస్యము లెఱిఁగి పరమదయా వంతులై తమ సుఖ మెన్నకొనక, తమసుఖముకంటెఁ బ్రజా క్షేమమే ముఖ్యమని భావించెడి రాజులకాలము పోయినది. ఆ పూర్వపురాజులు కాళిదాసు చెప్పినట్లు రాజ్యమనునాశ్రమము నందు నివసించు మునులు. ఈ రాజులు తరాజులుకూడఁ గారు. తరాజనఁగాఁ దక్కెడ. తరాజు న్యాయముగాఁ దూఁచును. ఆ శక్తికూడ వీరివద్ద లేదు. ఆ రాజులతోఁబాటు తరాజులుకూడఁ

చెడిపోయినవి. దాళా యెక్కువ. ఱాయి శిఖాఱాయి కాదు. తక్కెడకఱ్ఱకు బెజ్జము వేసి తూఁచెడు త్రాడుపట్టుకొనుస్థలము నందలి బెజ్జము సరిగా నా దండమునకు నడుమ నుండదు. పళ్లికల త్రాళ్లు నొకవైపు పొట్టి, యొకవైపు పొడుగు. ఆ తరా జెంత మాఱిపోయినది. రాజునుజూచి నేర్చికొన్నది. ఆ తరాజును జేతఁబూనినవాఁడు మఱియు నఖండుఁడు. వాఁ డింతధర చెప్పును. తగ్గఁడు. ఇష్టమువచ్చినచోఁ గొనుము, లేనిచోఁ బొమ్మనును. మీఁదుమిక్కిలి నిన్ను గొట్టుటకుఁ బ్రయత్నించును. నిన్ను లెక్క సేయఁడు. వానికి సొమ్ముమ్మకము కావలయును గదా! మఱి యెట్లన్నచో వాని కమ్మనక్కఱ లేదు. సొమ్మంతయు పుచ్చిపోవును. పురుగులుపట్టును. తీసికొనిపోయి యేటిలోఁ బోయును. వస్తువు సమృద్ధిగా లభించినపుడు ధర తగ్గుట సహజము. వాఁడు ధర తగ్గనీయఁడు. ఎంత సమృద్ధిగా నున్నను ప్రియమైనధరనే నిలఁబెట్టును. సరకునుఁ దగులఁ బెట్టును గాని, ధరనుఁ జల్లారనీయఁడు. ఇదియంతయు హాంగ రాజునీతి. హాంగరాజు దేశములోఁ బంటలు లేవు. వర్తకము వారిప్రధానవృత్తి. ఆ వృత్తిని నిలఁబెట్టుకొనుటకు వాఁ డీపనినిఁ జేయును. ధరలుపడిపోయినచో ధనము రాదు. హాంగరాజు నకుఁ గావలసినది ధనము కాని, యాహారపదార్థములు కావు. వానినన్నిటినిఁ బరదేశములనుండి కొనవలయును. అందుచేత వానికిఁ బ్రధానమయినది ధనము. ఆ నీతిని మాంధాతృదేశ ములోఁ బ్రవేశపెట్టెను. ఈ దేశప్రజలు ధనమునుజూచి వ్యామోహపడిరి. తరా జీరీతిగాఁ దారుమాఱయ్యెను. మఱియుఁ దరాజున కింకొకవిద్య తెలిసినది. ఏ సరకును స్వేచ్ఛ

మైనది రాదు. అంతయుఁ గళితిత్వే. ధనము। పోగుపడుటకు సరకు మాఱు వేసములు వేయ మొదలుపెట్టినది. నూనె నూనె కాదు. నేయి నేయి కాదు.

రెండవవాఁడు సిద్ధాంతాభిమాని. రాజభక్తునకు భార్యయు, బిడ్డయునైన నున్నారు. వీనికి వారుకూడ లేరు. వీనికి సిద్ధాంతమే యున్నది. సిద్ధాంతమన్నది యొక క్రొత్త యాగమము. ఆగమము కాదు ఆదేశము. ఈ సిద్ధాంతవాదులకుఁ బూర్వమున్న దేదియుఁ బనికిరాదు. అంతయుఁ గ్రొత్తది కావలయును. హాంగరాజు తన దేశమునుండి క్రొత్తక్రొత్త సిద్ధాంతములను బంపించును. మాంధాత దేశములో నొక్కొక్క సిద్ధాంతమునకు వేలమందియనుయాయులు. వీరందఱు హాంగరాజు పాలనయే మాంధాతపాలనకంటె సువ్యవస్థితముగా నున్నదని చెప్పువారే. మొదటి తెగవారైన రాజభక్తులు రాజు విష్ణ్వంశ సంభూతుఁడని ప్రాతసిద్ధాంతముపట్టుకొని ప్రాకులాడువారు. వీరు పూర్వపరిస్థితులేవియుఁ బనికిరావని గందరగోళముచేయువారు. వీరిద్దఱికి మూలసూత్రములందుఁ బొసఁగదు. హాంగరాజునీతి యెట్టిదనఁగా నీ పొసఁగని రెండు తెగలు తనరాజనీతికి దోహదముగా మలచికొనుట. రాజభక్తుల కుద్యోగములిచ్చి, యీ దేశములోని ప్రాతవిశ్వాసములమీఁదఁ దనయధికారము భద్రముచేసికొనును. ఈ సిద్ధాంతవాదులను జెచ్చఁగొట్టి దేశమునందలి ప్రజాసమైక్యమును విశ్లథపఱచును. ఇట్టి ద్విధా నీతి వెలయించి హాంగరాజు అన్నోదకములకు లోపములేని దేశమునందు నన్నోదకములకుఁ గఱవు తెచ్చెను.

ఈ దేశప్రజలు స్వభావముచే సాధువులు. వారికి ధనము పోయినను గౌరవముపోయినను దలవంచికొనియే పోవుదురు. క్రౌర్యమును సహించలేరు. అందుచేతఁ గ్రూరులయిన హాంగ రాజాధికారులనుఁ గొందఱ నుపాంశువధ జేసిరి. హాంగరాజున కొక ప్రధానసూత్రము కలదు. తదనుయాయులనొక్కని సంహ రించినచో దేశప్రజలలో వందమందిని సంహరించును. దేశము భీతావహమయిపోయి తన కంకెకువచ్చునని వానియూహ.

ఇది యిట్లుండఁగాఁ బ్రజల కుపాంశువధవలన లాభము లేదని తెలిసినది. దానివలనఁ బ్రజానష్టమే కాని క్రూరులకు బుద్ధివచ్చునట్లులేదు. మఱియొక శాంతమార్గమున హాంగరా జీయుల నెదిరించనారంభించిరి. వారితో జోక్యము పెట్టికొనరు. వారిశాసనముల నుల్లంఘింతురు. వారు కొట్టినచో దెబ్బలు తిందురు. వారు చంపినచోఁ జత్తురు. చెఱసాలలో వేసినచో నందే యుందురు హాంగరాజునకుఁ జెఱసాలలు చాలలేదు. ఇంత యైనను హాంగరాజు లొంగెడివాఁడుకాదు. ఏ శశిని వెనుకఁ బెట్టుకొని తా నీ రాజ్యముపై నధికారముచేయుచున్నాఁడో, యా శశికిఁగూడ నీ దమననీతి యంగీకారముగాలేదు. శశి పూర్తిగా నెదిరించినచోఁ దన కీ దేశమునం దేమియు లాభము లేదు. శశి తనవాఁడు. తనమతస్థుఁడు. మాంధాతృరాజ్యవ్యవస్థా వ్యతిరేకి. తనస్థితిననుసరించువాఁడు, కాని శశికిఁగూడఁ దన రాజ్యము తాను చేసికొనవలెననిపించును. ఈ రాజ్యము వివ స్వంతునిది. తనది కాదు. అట్టిస్థితిలోఁ దాను హాంగరాజునే యనుసరించెను. ఇన్నాళ్లు హాంగరాజునీతివలన దేశములో నొక మార్పువచ్చెను. ఎట్లైనను హాంగరా జీ దేశమునుండి

తొలఁగిపోయినచోఁ జాలునని జనముల కనిపించెను. శశియు వివస్వంతుఁడు నిద్దఱు నన్నదమ్ములు. ఇద్దఱును మాంధాత కొడుకులే. ఇద్దఱును గలిసియే రాజ్యముచేసికొనవచ్చును. హాంగరాజు పెట్టిన యీ పేచీ మఱియొకవిధముగాఁ దీర్మాన మగునట్లులేదు. అందుచేఁ బ్రజాభిప్రాయ మారీతిగా ద్వేధా విభక్తమయినది. ఇద్దఱును గలిసి రాజ్యముచేయుట యెట్లు? పాలనాశాఖలలోఁ గొన్నింటిమీఁద నన్నగారు, మఱికొన్నింటి మీఁదఁ దమ్ముఁడు నధికారులుగా నుండవచ్చును. ఇట్లుండగా వివస్వంతునిస్వభావ మొక విలక్షణమయినదైనది. అతఁడు చాల విరాగి. తమ్మునికే రాజ్యముతీసికొనిమ్మని యతని యుపేక్షాభావము. కాని మహారాణి దాని కంగీకరించదు. అతఁడు పరమతమును స్వీకరించెను. అతనికి రాజ్యాధికారమున కర్హతలేదని యామె యభ్యంతరపెట్టినది. ప్రజలలోఁగూడఁ జాలవఱ భావమే కలదు. పెద్దపెద్ద యధికారులు మొత్తము మీఁద హాంగరాజీయులయినను వారిలోఁ గొందఱు దేశాభి మానులు కలరు. మాంధాతయందుఁ బ్రబలవిశ్వాసముకల వారు కలరు. వారిలో నుద్యోగవాంఛయు దేశాభిమానమును రెండును గలవు. రెండును సమపాళముగానున్నను నుద్యోగ వాంఛ కొంచెె మెక్కువగా నుండును. దేశాభిమానమును పైకిరానీయదు. రానీయకపోయినను లోపల దాని వేడి యుద్యోగ వాంఛకంటె నెక్కువది. వారుకూడ శశి రాజగుట కిష్టపడలేదు. వివస్వంతుఁడు వారిమాట కాదనలేదు. అచ్చముగా వైరా గ్యముకలవాఁడు యోగియేయగును. యోగులై సన్యాసులైన వారియందే సంసారాభిమానము మిక్కిలిగాఁ గనిపించుచుం

డఁగా, సంసారములోనుండి వైరాగ్యముకలవారి వైరాగ్య మెంత? విపస్వంతునకు రాజ్యముమీఁదవాంఛ కలదు. ఆవాంఛ యెట్టిది? అప్రతిహతముగా నిష్కంటకముగా నప్రతిబంధకముగా రాజ్యము తనకు లభించినచో నా రాజ్యము తాను బాలించుటకు తన కభ్యంతరమేమియు లేదు. దానికడ్డంకులు వేయియున్నపుడు నా కా రాజ్య మక్కఱలేదనిపించును. ఇది వైరాగ్యమనుటకు వీలులేదు, కాదనుటకు వీలులేదు. ఈ వైరాగ్యములో నెక్కుడుపాలు ప్రయత్నమునందుగల కష్టమును బడలేకపోవుటయు, శ్రమాసహిష్ణుతయు. ఇది వైరాగ్యమా? దీనియందు వైరాగ్యాంశము కలదు. పారమార్థికదృష్టితోఁ జూచినచో వీరు కొంత మంచిమార్గములోనున్నట్లే. వీరికిఁ బరమార్థము లభించునా? ఇటు లౌకికము ఫలించదు. పరమార్థము లభించుటకుఁ జాల దవ్వున్నది. ఒకవిధముగాఁజూచినచో వీరు రెంటికిం జెడిన రేవడలు.

హంగరాజునకు నిజముగా నొక నియమితమయిననీతి యని లేదు. ఎప్పటి కెయ్యది ప్రస్తుత మప్పటి కా మాటలాడువాఁ డతఁడు. ఆపనిచేయువాఁ డతఁడు. ఈ దేశము తన చేతిలోనుండి జాఱిపోవుచున్నది. తాను రాజ్యముచేయవలయునని వాంఛించినవాఁడు కాదు. ఆ దేశముయొక్క వర్తకము తన చేతిలోనుంచికొనఁదలఁచినవాఁడు. అట్టిసందర్భములోఁ దనకు ప్రియమయిన మేనల్లుఁడు తన కెదురుతిరుగఁబోవుచుండఁగా వానినివదలి తాను జేయునది యేమియు లేదు. అన్నదమ్ము లిద్దఱు కలిసి రాజ్యముచేసికొనుట యతని కిష్టములేదు. ఎప్పుడయిన నన్నగారిమాటయే సాగును. రాజ్యములోనున్న మహా

ధికారులు, మంత్రులు విపస్వంతునిపత్తు మవలంబింతురు గాని, శశిపత్తు మవలంబింపరు. ఈ యాపత్తి యెప్పుడో సంభవిం చును. ఈ విషయమును దాను మున్నెప్పుడో విచారించియే యట్టిపెట్టెను. దానికిఁ దగినయెత్తులు వేసి, సర్వము సిద్ధముగా నుంచెను. అతఁ డంతచేసినను బ్రజల కా సంగతి యేమియుఁ దెలియదు. ఆవులించినచోఁ బ్రేవులులెక్కఁబెట్టెడు వల్లభ మంత్రికే తెలియలేదు. మహానీతియొక్కలక్షణ మెట్టిదో కాళి దాసు చెప్పెను. 'ఫలానుమేయాః ప్రారంభాః' అని. ప్రారంభ ములనగాఁ బ్రయత్నములు, ఫలానుమేయములు. ప్రయత్న సమయమునం దవి యెందుకు చేయుచున్నాఁడో తెలియదు. ఫలముపుట్టినపుడు ఓహో! యిది యిందుకా చేసినాడని తెలి యును. ఇది మహానీతియొక్కలక్షణము. ఈ నీతి సత్పురుషులు ప్రయోగింతురు. అసత్పురుషులు ప్రయోగింతురు. నీతియొక్క నీతిత్వమునకు భంగమేమున్నది? భేదము ఫలితములో నున్నది. ఫలిత మసత్తు కావచ్చు, సత్తుకావచ్చు. నీతినైపుణ్యము నీతి నైపుణ్యమే.

మాంధాతృరాజ్యమున రాజధాని గుడపురము. గుడ పురము మాంధాతలనాటినుండి యున్నది. హంగరాజురాజ్యము నకు గుడపురమునకుఁ జాల దవ్వుకలదు. ఈ నడిమి దేశమంతయు గుడపురరాజ్యమే. ఇట్లుండఁగా హంగరాజు తనరాజ్యమునకు సమీపములో నొక మహానగరము వృద్ధిపొందింపించెను. పూర్వ మది యొక చిన్నగ్రామము. ఆ యూరిపేరు గుడూచి. ఇప్పుడు గుడూచి పెద్ద నగరమయ్యెను. ఈ రాజ్యమునుండి హంగరాజదేశమునకుఁబోవు సరకులన్నింటికి నది పెద్ద వర్తక

స్థలమయ్యెను. ఈ గుడూచీనగరములో గుడపురవాసు లెంత మంది కలరో హాంగరాజరాజ్యపౌరు లంతమంది కలరు. పేరు మాంధాతృరాజ్యమయినను సర్వాధికారము సర్వాచారములు సర్వమర్యాదలు హాంగరాజప్రజాసంబంధములుగా నచటనుండు ను. గుడూచీనగరము తత్పరిసరములు సర్వమునుహాంగరాజమత స్థులచేతనే నిండియున్నది. అనగా నచట నా మతస్థులసంఖ్య బహుళమన్నమాట. ఒకదృష్టితోఁజూచినచో రాజ్యమునందలి ప్రాధాన్యము గుడూచీనగరమునకున్నది గాని, గుడపురమునకు లేదు. ఒకసారి హాంగరాజు రాజధాని నా నగరమునకే మార్ప వలయునని ప్రయత్నించెను. దానికి వల్లభమంత్రి యంగీకరించ లేదు. మహారాణి యంగీకరించలేదు.

దేశమునందలిపరిస్థితి పూర్వము చెప్పినట్లు తనకనుకూల రేకము కాగా, శశికిఁగూడ స్వాతంత్ర్యాభిలాష కలుగఁగా, హాంగరాజు తా నిన్నాళ్లు దాఁచియుంచినపామును బుట్టలో నుండి బయటికిఁ దీసెను. ఆ పా మిది: దేశము రెండుభాగ ములు చేయవలయును వివస్వద్రాజ్యము, శశిరాజ్యమని రెండు భాగములు. వివస్వద్రాజ్యమునకు గుడపురము రాజధాని. శశి రాజ్యమునకు గుడూచీనగరము. శశి వేఱే రాజు. అతనిమతము వేఱు. అతనిమతస్థులబాహుళ్యము గుడూచీనగరమునం దున్నది. రెండును రెండుదేశములగును. ఒకరిపొత్తొకరికి లేదు. ఈ రెండురాజ్యములు కలిసియున్నచో మతవిశ్వాసములు, నాచారములు భిన్నమగుటచే నంతఃకలహములే యెక్కువగా నుండును-అని హాంగరాజువాదన. అంతఃకలహములన్నమాట యతనివాదనలోని ప్రధానాంశము. మాంధాతృప్రజలు విగ్రహా

రాధకులు. శశిమతస్థు లేకేశ్వరోపాసకులు. శశిమతస్థులు విగ్రహారాధనకుఁ బరమవిరోధులు. ఱాతియందు దేవుఁడు లేఁడని యట్టిదైవతమును బూజించువారు పరమనాగరకులని, వారు తుచ్ఛులని శశిమతస్థుల విశ్వాసము. మాంధాతృప్రజలలోఁ గూడఁ గొందఱు వారివాదనలను విని వారిమాటలే నిజమనుకొని బయలుదేరిన స్వమతద్వేషు లున్నారు. హంగరాజుయొక్కనీతి తడిగుడ్డతో గొంతుకోయుటవంటిది. అతనికి మానవస్వభావములోనున్న వ్యామోహ మెన్నివిధములుగా నడచునో యన్నివిధములు కరతలామలకముగాఁ దెలియును. పట్టితెలియుటయేకాదు. అన్నింటి నాచరణలోఁబెట్టును. మానవుఁడనిన వెంటనే యాలోచనాశీలుఁడని యర్థముకావచ్చును. కాని లక్షమంది ప్రజలలో నొక్కఁడు నిజమయిన యాలోచనాశీలుఁడగుట దుర్లభము. ఉన్నది కాదన్నచో నదియగునని చెప్పటకుఁ బ్రయత్నించువాఁ డుండఁడు. నిజమే, బాగుగా లేదనియే యందఱునందురు. ఉన్నదానియొక్కస్థితికిసప్రతిపత్తికముగానిరూపించుటకుఁబ్రయత్నమెవ్వరుచేయరు. ఆప్రయత్నము చేసినవారికే శాస్త్రకర్తలని పేరువచ్చినది. వారేశాస్త్రకర్తలు. ఆ ప్రతిపత్తులు శాస్త్రకర్తలనుండి తెలిసికొనవలసినదే కాని సామాన్యప్రజలు తాము తారుగనేర్వరు. దేవాలయములలో ఱాళ్లు దైవతములని మాంధాతృప్రజలు పూజింతురు. భగవంతుని నింతకంటె నవమానపఱచుట వేఱేయుండదని శశిమతస్థులవాదన. భగవంతుఁడు సర్వవ్యాపి. సర్వాంతర్యామి. ఐనచో ఱాళ్లలోమాత్రమెందుకుండఁగూడదు? వారు చెప్పెడి భగవంతున కాకారమున్నదా? అతనికి ముక్కు మొగము కాలుసేతు లున్నవా?

అతఁ డెక్కడ నుండును. వాని కవయవములున్నచో వాఁడును మనవంటివాఁడే. మనది భౌతికశరీరము వానిది తైజసశరీర మంచము. శరీరమున్నంతనే విడిపోవుస్వభావముకలది. వాఁడును నిత్యుఁడుకాఁడు. అతఁడు వట్టి భావరూపుఁ డన్నచో భావమున కింత మహాత్తెట్లువచ్చును? అతఁడెక్కడనుండును? ఎక్కడనో యొకచోట నుండును. అక్కడనే యుండుటేల? ఒక్కచోటని వానికి నియమమేమి? ఈ ప్రశ్నలకేమియు సమాధానములు దొరకవు. నిజముగా మాటాడినచోఁ గొందఱు కొన్నిటిని విశ్వసించుటతక్క గత్యంతరము లేదు. మతముయొక్క మూల స్థాన మీ విశ్వాసముమీఁద నున్నది. వాఁ డది విశ్వసించును. ఎందుకు విశ్వసించుననగా, నెవ్వఁడును జెప్పలేఁడు. వాని బుద్ధి లక్షణమట్టిది. ఆ బుద్ధిలక్షణమట్లెందుకున్నదని ప్రశ్న. దీనికిఁ బది హేతువులు చెప్పవచ్చును. వానిశరీరములోఁ బ్రవహించురక్తము నందలి గుణములు వానిబుద్ధి నట్లు మలఁచెనని చెప్పవచ్చును. వానిరక్తమనఁగా వాని తలిదండ్రులరక్తము. మఱియు వాఁడు భుజించునాహారము జీర్ణమై రక్తముగా మాఱును. ఆ యాహారమునందలిగుణములు వానిరక్తమునందలి గుణములుగాఁ బర్యవసించును. వాని పెంపకము, వాని చదువు వాని బుద్ధిని గొంత మార్చును. మఱియు వానికిఁగల యాశలు కోర్కెలు నభిమానములు నివియన్నియు వాని రక్తగుణములచేతఁ భావింపఁబడి మఱల వానినిఁ భావించును. ఈ రెండు నిచ్చి పుచ్చుకొనునట్టివి. కనుక విశ్వాసమునకు స్థితిలేదు. ఆ విశ్వాసమునకు స్థితికలిపించవలయుననగా నాహార వ్యవహారములయందు, నాచారములయందు నియతత్వము నేర్పాటుచేయవలయును.

మతమనగా నిది. అట్టి నియమమువలన నా విశ్వాసము చెదరదు. ఆ నియమమునకు నా విశ్వాసమునకు, నా ధర్మమునకు నిత్యానుషంగికత్వము. ఆ నియమములు చెదరినచో విశ్వాసము చెదరిపోవును. ఆ విశ్వాస మెందుకు చెదరవలయును? దేశకాలములనుబట్టి చెదరును. శరీరపోషణయు జీవికయు వీనియన్నింటికిఁ బునాదులు. ఈ జీవికావిధానము సంఘవ్యవస్థ నేర్పఱచును. సంఘవ్యవస్థ మాఱినపుడు జీవిక మాఱును. జీవనవిధానము మాఱినచో సంఘవ్యవస్థ మాఱును. అప్పుడు విశ్వాసము దెబ్బతినును. దానితో మతాభిప్రాయములు దెబ్బతినును. ఒకజాతి పరమేశ్వరుఁడు సర్వవ్యాపియని రాతిలోఁ, జెట్టులో నుండునని విశ్వసించునపుడు మఱియొకజాతి విశ్వసించనపుడు కారణసామగ్రి యిదియే యని చెప్పవలయును.

ఇది యిట్లుండగా, వీనినన్నింటిని నెవని విశ్వాసము వానిదని లోకమూరకుండదే! వానిది తప్పు, తనది యొప్పనుకొనునే. ఈ గుణ మెచ్చటిది? ఇది పైనిజెప్పిన యాహారపదార్థాదుల వలనఁ గలిగెడు గుణముకంటె భిన్నముగా నున్నదే! అది యహంకారము; ఇది సర్వమానవజాతియందు సర్వసమానలక్షణముగాఁ గనిపించుచున్నది. పితరులనెత్తురు గాని, యాహారజనితగుణముగాని పెంపకముగాని చదువుకాని యీ యహంకారమునకు హేతువులుగాఁ గన్పించుటలేదు. ఈ యహంకారము మూలభూతమయిన వస్తువు. ఈ వస్తువు తక్కిన గుణములయందు నిష్టానిష్టములయందు నభివ్యాప్తమయి జీవలోకము నాడించుచున్నది. ఆ వస్తుస్వరూపవివక్షతో మన

కిచ్చుటఁ బ్రసక్తిలేదు. కాని యీ యహంకారము సర్వజీవ కోటిని భావించుచున్నది. ఇదియే సర్వసమర్థమందమా! దాని నైశిత్యము సర్వాతిశాయి యందమా! ఇట్లు బహుగుణములు నుండఁగా నధిష్ఠానరూపమై యహంకారముండఁగా వివేకమను నది యొకటి కొందఱుజీవులయందు భాసించుచున్నది. ఈ వివేక మునకు జాతి, మత వివక్షలేదు. ఈ వివేకమతాదిభావములచేత వికార్యమాణమగుచున్నది. వివేకమనఁగా సూక్ష్మ సూక్ష్మ విషయ పరిశీలనము. ఈ పరిశీలనాసమయమందు వాని వివే కము వాని మతాదిభావములయందలి విశ్వాసములచేతఁ గుంటుపడినట్లు కనిపించవచ్చును. అది వివేకమునందలి నైశి త్యము లేకపోవుటకాదు వివేకమే చమత్కారమయినది. గుణ ములకు నహంకారమునకుఁ గ్రామాదులకు హేతునిరూపణచేయ వచ్చునుగాని, వివేకమునకు హేతునిరూపణచేయుట కష్టము. వాని పూర్వజన్మసంస్కార మట్టిది యనుటయే దానికి హేతు వుగాఁ గన్పించుచున్నది. ఇట్లనుటతోడనే జన్మపరంపరాసిద్ధాం తము నంగీకరింపవలసివచ్చును. దానినంగీకరింపనిజాతి వివే కమున కేమి హేతుకల్పనచేయుచు? గుణములయందలి నైశిత్య మనుకొనవలయును. పెంపకములోని తీర్పనుకొనవలయును. అవియన్నియుఁ బొసఁగవు.

ఇది యిట్లుండఁగా వివేకము చిత్రచిత్రములుగా భాసించును. విగ్రహారాధనము తప్పని శశిమతస్థుఁ డొకఁడు ప్రచారముచేయుచుండెను. మీ దేవునిగుడిలో ఆయి దేవుఁడా? నే నా జాతిమీఁద నుమ్మివేయుదును. మీ దేవుఁ డేమి చేయఁగలఁడని ప్రచారకుఁడు చెప్పుచుండెను. వినుచున్న

వారందఱు నిజమేయనుకొనిరి. అప్పుడా శ్రోతలలో నొక్కఁడు తా నిట్లనెను. "సరే. మీ దేవుఁడున్నాఁడు. వాఁ డెక్కడ నున్నాఁడో తెలియదు. వాఁడు ఱాయి కాదు; ఱప్ప కాదు. కాని దేవుఁడే కదా! సర్వసమర్థుఁడు. సర్వజ్ఞాని. సర్వశక్తిమంతుఁడు. నేను మీ యీ దేవుని బండబూతులు తిట్టెదను. వాఁ డేమిచేయఁగలఁ"డని ప్రశ్నించెను. ప్రచారకుఁ డేమి చెప్పఁ గలఁడు. నీవు నరకలోకములకుఁ బోదువని చెప్పెను అప్పుడీ శ్రోత మా దేవాలయములో నున్న ఱాయివలెనున్న మా దేవునిమీఁద నుమ్మి వేసినచో నీవును నరకలోకమునకుఁ బోదు వనెను. ఆ మతము యథార్థమో యీ మతము యథార్థమో శ్రోతలలో నీ వివేకి వేసిన ప్రశ్నకు సమాధానము లేదు. ప్రచారకుఁడు మూర్ఖుఁడా? ఈ శ్రోత నవివేకియా? ఇతని వివేకము తత్కాలవాదనయందు భాసించినది. ఇంతకును విగ్రహారాధనము తప్పని చెప్పుట యెంత మొండిగానున్నదో విగ్రహారాధనము సమంజసమని చెప్పుట యంత మొండిగానుండదు. విగ్రహారాధనము సమంజసముయినదని లక్ష హేతువులు చూపవచ్చును. వా రీ హేతువులకు సమాధానము చెప్పలేరు. కాని వారి విశ్వాసము వారు మానరు. అందుచేత విశ్వాసము ప్రబలమైన దగుచున్నది. విశ్వాసము విశ్వాసముగా మాత్రమే యున్నచో నెవ్వరికిని బాధలేదు. ఆ విశ్వాసము వెనుక నహంకార మున్నది. క్రౌర్యమున్నది. లోభమున్నది. దురాశ యున్నది. అందుచేత వచ్చిన నష్టము.

ఈరీతిగా రెండురాజ్యములు చేయుటకు హంగరాజు పూర్వమే నిశ్చయించుకొనెను. దాని నీనాఁడు బయటఁ

బెట్టెను. ఈ సిద్ధాంతము శశికి మిగుల ననుకూలముగానుండెను. పూర్వ మతఁడు రాజగుట వట్టి యాశ. అస్తి నాస్తి విచికిత్స ఇప్పుడః నిశ్చయమైనది ఈ రెండు రాజ్యముల నిర్మాణముమీఁద సిద్ధాంత రాద్ధాంతములు జరుగుచుండెను. రాణిగారి కేమియు నిష్టము లేదు. వివస్వంతుఁ డెట్లైననుసరే ప్రస్తుత క్లిష్టపరిస్థితులు తొలఁగిపోయినఁ జాలునని యంగీకారమే నెఱపుచుండెను. దేశములోని మహోద్యోగులు శశిమతస్థు లీ సిద్ధాంతమున కనుకూలురు. మాంధాతృమతస్థులు వ్యతిరేకులు. వల్లభమంత్రి దీని కనుకూలుఁడో యననుకూలుఁడో తెలియదు. ఆయన తనయుద్దేశ మెవ్వరితోడను జెప్పఁడు.

ఈ రెండురాజ్యముల సిద్ధాంతము వచ్చినప్పటినుండి దాని యపరిహార్యత వల్లభమంత్రికి గట్టిగాఁ దెలిసినది. గుడూచీనగరము దాని ప్రాశస్త్యము మనస్సునకుఁ బొడగట్టెను. హంగరాజు రాజ్యము గుడూచీనగర రాజ్యము నొక్కటియైపోవును. మాంధాతృరాజ్యము బలహీనమైపోవును. ఈ రాజ్యమునందలి వర్తకమంతయు గుడూచీనగరమునందున్నది. పెఱరాజ్యములతోడి రాకపోకలు, వస్తువులయొక్క సరఫరా గుడూచీనగరముద్వారా జరుగవలయును. వల్లభమంత్రి యిది యంతయుఁ బర్యాలోచించెను. వివస్వంతుఁడు రాజ్యవిభాగమునకు నభిముఖుఁడుగా నుండెను.

హంగరాజు తన పథకము ఫలించినదని మాంధాతృరాజ్యము నాశనమయిపోయినదని నిశ్చయించెను. ఇప్పుడేమున్నది? అంగీకరించినమఱునాఁడున్నది.

౪

ఆ సభకు మధ్యవర్తులుగాఁ బరరాజ్యాధిపతులను మఱిద్ద ఱను బిలువవలయునని హంగరాజు పట్టుపట్టెను. వల్లభమంత్రి దాని కంగీకరించలేదు "ఇది యిద్దఱన్నదమ్ములరాజ్యవిభాగమే కాని యిద్దఱు రాజులనడుమఁగల వివాదవిషయము కాదు. మేనమామవు నీ వున్నావు. నీ యిష్టమువచ్చినట్లు పంచిపె ట్టుము. నీవు సర్వాధికారివి. నిన్ను గాదనువాఁ డెవ్వఁడు? నీవు విభాగము చేసినతరువాత విపస్వంతుఁడు నన్ను మంత్రిగా నున్నకొనినచో నే నుందును. శశికి నీవే యనాదినుండి మంత్రివి. నన్ను మంత్రిగా శశి స్వీకరించుననుట లేనేలేదు. మఱియు విపస్వంతుఁడు తన తమ్మునియం దధికానురాగము కలవాఁడు. అతనికి హృదయాంతరములో నీ విభాగ మెంత యిష్టములేదో వ్యవహారము అచ్చుకెక్కి పదిమందినోళ్లలోఁ బడుట యంత యిష్టములేదు. కనుక నీ వెట్లుచెప్పిన నతఁ డట్టు లంగీకరించును. మఱి యెవ్వరో వచ్చి తీర్పుచెప్పవలసిన యగ త్యము నాకుఁ గనిపించుటలేదు. అంతగా మధ్యవర్తి కావలసి నచో గౌరీపతిశాస్త్రిగా రున్నారు. ఆయన యుభయపక్షము లకు గావలసినవాఁడే కదా!" అని వల్లభమంత్రి యనఁగా హంగరా జిట్లనెను "గౌరీపతిశాస్త్రి మీమతస్థుఁడు. మీ మత మునకుఁ బునాదివంటివాఁడు. మీ శాస్త్రములన్నియుఁ జది వినవాఁడు. ఆయనకు విపస్వంతుని యందున్న యనురాగము శశియం దుండదు". అంత గౌరీపతిశాస్త్రి యిట్లనెను "మీ

రన్నది నిజమే. మీ మతములో సర్వమతములు తెలిసినట్టి వానిని గొప్పపండితుని నొకనిఁ బిలువుఁడు. సరిపోవును.” హాంగరాజు దీని కంగీకరింపకతప్పకవచ్చెను. ఆ పండితుఁ డెవ్వ రని ప్రశ్నవచ్చెను. పలుమంది పేళ్లు వచ్చినతరువాత వల్లభ మంత్రి ‘అసదబలుఁడు’ అన్న పండితుని నిర్ణయించెను. ఈ యసదబలునివిషయము చాలఁ జమత్కారమైనది. ఇతనిని వల్లభమంత్రి తనవాఁ డనుకొనును. హాంగరాజుకూడఁ దన వాఁడే యనుకొనును. రాజ్యవిభాగమున కతఁ డనుకూలుఁడు కాడు. కాని తీవ్ర హాంగమతాభిమాని. వల్లభమంత్రి యిట్లను కొనెను. అసదబలుఁడు రాజ్యవిభాగమునం దన్యాయము జరుగనీయఁడు వివస్వంతుఁడు పెద్దవాఁడుకనుక వానిపక్షమున నే మాటాడును. ఆతని నెన్నుకొనుటలో నే నన్యాయముచేసి నట్లును గనిపించదు. కాని యతఁడు తీవ్ర హాంగమతాభిమాని అతడు మతమునకు రాజకీయములకు సంబంధముపెట్టఁడు. వివస్వద్రాజ్యమున నతనిని గొప్పపదవిలో నుంచవచ్చును. శశి రాజ్యమున నతని కంత గొప్పపదవి రాదు. అందుచే వివస్వ ద్రాజ్యమున కనుకూలుఁడుగానే యుండును”. హాంగరా జిట్లను కొనెను “అసదబలుఁడు మా మతమునందుఁ దీవ్రాభినివేశము కలవాఁడు. మత రాజకీయములు రెంటిలో జీవునకు రాజకీ యములందుఁగంటె మతమునం దావేశ మెక్కువకాలము మాఱుచున్నది. మతావేశముకంటె రాజకీయావేశమే యెక్కువ కల మనుష్యులు పుట్టుచున్నారు. కాని యసదబలుఁడు వెను కటితరమువాఁడు. అతనియందు మతావేశమే యెక్కువ. అతఁ డెట్లును వివస్వంతుని వదలిరాఁడు. ఐనను శశి కన్యాయము

చేయఁడు. అతఁడు వివస్వద్రాజ్యములో నుండుట మాకు మేలు. ఆరాజ్యములోని యానుపానులు మా కతనివలనఁ దెలిసికొనుటకు వీలుండును. అతఁడు మాకు గూఢచారిగాఁ బనిచేయును. అతఁ డీ రాజ్యములో నొక మహోన్నతాధికారిగా నున్నన్నినాళ్లు మారాజ్యమునకు వానివలన నాపత్తువచ్చుననియుండదు." హాంగరా జంగీకరించెను.

సభ కూడెను. రాజకుమారు లిద్దఱు; మంత్రు లిద్దఱు; పండితు లిద్దఱు. శశియు హాంగరా జొకదెసఁ గూర్చుండిరి. వివస్వంతుఁడు వల్లభమంత్రి గౌరీపతిశాస్త్రి అసదబలుఁడు రెండవదెస గూర్చుండిరి. న్యాయమునకు నసదబలుఁడు శశిదెసఁ గూర్చుండవలయును. కనిపించుటకువివస్వంతునివైపే మొగ్గుగాఁ గనిపించుచుండెను. తొట్టదొలుత విభక్తరాజ్య మెవ్వరి కెంత రావలయును? దాని యెల్లలు నిరూపింపఁబడవలసియుండెను. శశి రాజ్యములోని పడమటిభాగమంతయుఁ దనదనెను. వల్లభ మంత్రి యిట్లనెను: "రాజకుమార! ఈ రాజ్యముయొక్క-సంపదయంతయుఁ బంటలన్నియుఁ బడమటిరాజ్యభాగము మీఁదనే యాధారపడి యున్నవి. నదు లా ప్రాంతమునందే ప్రవహించుచున్నవి తూర్పుదెస మహానది యొక్కటియే ప్రవహించుచున్నది. ఏ నాలుగేండ్లకో యైదేండ్లకో పెద్ద వఱదలు వచ్చి దేశమును ముంచుటకుఁ బనికివచ్చును గాని యా నది పంటలకుఁ బనికిరాదు. సస్యసమృద్ధిగలభాగము నీవు తీసికొన్నచో మీ యన్నగా రేమగును? పంటలు పరిశ్రమలు సర్వము నీ దెస నున్నవి."

శశి: దానికి నే నేమిచేయుదును? హాంగరాజు రాజ్యఁ

మున కాభాగము దగ్గఱ. ఆయనవరామరిక లేక నారాజ్యము నిర్వహింపఁబడదు. అందుచే నారాజ్య మాయనరాజ్యము నకు దగ్గఱగా నుండవలయును. మీరు మహామంత్రులు. ఆయన పెద్దవాఁడు. నేను చిన్నవాఁడను. నన్న న్యాయముచేసి యెండు నేల నా కంటఁగట్టినచో నే నేమి కావలయును?

గౌరీపతిశాస్త్రి: తూర్పు పడమరలు గాకుండ దక్షిణోత్తరములు విభాగము చేసికొనవచ్చును.

అనదబలుఁడు: అట్లు చేసికొనుట యసలు న్యాయము కాదు. ఎందుచేతననఁగా సర్వనదులు నుత్తరదిశలోనున్న మహా పర్వతములలో సముద్భవించిదక్షిణాభిముఖముగాఁ బ్రవహించు చున్నవి. ఒక్క మహానదితప్పఁ దక్కినవన్నియు బడమటిరాష్ట్ర మందే బ్రవహించుచున్నవి. ఉత్తరార్ధము దీసికొన్నవాఁడు దక్షిణార్ధమునకు నీరే రాకుండ జేయవచ్చును కావునఁ దూర్పు పడమరలుగానే రాజ్యము విభాగింపఁబడవలయును. పడమటి సగములో జెఱిసగము తూర్పుసగములో జెఱిసగముగా జేసి కొనుట మంచిది.

హంగరాజు: అది బాగుగానుండదు. పడమట శశి చెక్క. దానికిఁ దూర్పున వివస్వంతుని చెక్క. దానికిఁ దూర్పున మఱల శశిచెక్క. ఇంకను దూర్పున వివస్వంతుని చెక్క. ప్రతివాని రెండురాజ్యభాగములనడుమ నితరుని రాజ్యభాగ ముండును. అనేక పాలనావిషయములలో బహు పదార్థములయందుఁ బాలులోనే రాజ్యమునకైన నిబ్బందియే. అట్లున్నచో రాజ్యపాలనము సరిగాఁ గొనసాగదు.

గౌరీపతిశాస్త్రి: అన్నదమ్ములే కదా! సర్దికొనిపోవ

చ్చును. సౌహార్దముమీఁద వ్యవహారము సుఖముగా నడచును. సౌహార్దమును మించినది సౌభ్రాత్రము.

శశి : సౌభ్రాత్రము, సౌహార్దము చెడిపోయిననేగదా యిట్టి విభాగమేర్పడుట".

వివస్వంతుఁడు (నవ్వుచు) : ఆ రెండును జెడిపోవుట కెవరయ్యా కారణము ?

శశి (కోపముతో) : పైకి నవ్వినచో సరిపోయినది. నా మతమన్నచో మీ కేమియును బడదు. అమ్మ మీ వైపు. నన్నొక్కనిఁజేసి నీవు సన్నన్యాయమును జేయఁదలఁచి కొన్నావు. వంశపరంపరయా రాజ్యము విభక్తముకాఁగూడ దని నీ వాదన. ఒకరాజునకు నలువురు కొడుకులుపుట్టినచోఁ బెద్దవాఁడు రాజై తక్కిన ముగ్వు రడిగికొని తినవలయునా? రాజ్యమును నలుగురు పంచుకొనవలయును.

వివస్వంతుఁడు : ఆ నలుగురిలో నొక్కొక్కనికి మఱల నలువురు నలువురు కొడుకులు. వారును బంచుకొన వలయును. అప్పు డొక రాజ్యము పదునాఱు రాజ్యములు. ఇంకొక తఱమునాటికి నఱువదినాలుగు రాజ్యములు. వారు రాజులు కారు, పాళెగాండ్రగుదురు. ఇంతలో నెవఁడో వీ రండఱిని వధించి తాను చక్రవర్తియగును."

హంగరాజు : ఇప్పటి ప్రశ్న యదికాదు. శశి మీ మతమునుండి మాఱిపోయెను. కనుక నాయనకు రాజ్యము సగభాగ మిమ్మనుచున్నాఁడు.

గౌరీపతిశాస్త్రి : మతము మాఱినచో రాజ్యభాగమే లేదు. అన్యమతమును వివస్వంతుఁడే స్వీకరించె ననుకొందము.

ఆయనకు రాజ్యము రాదు. శశి స్వీకరించనిచో శశికి వచ్చెడిది. ఎవనికి రాజ్యార్హత యున్నదో వాఁడే మతాంతరుఁడైనచో రాజ్యార్హత లేనపుడు రాజ్యార్హత లేనివాఁడు మతాంతరమును స్వీకరించినచో నెట్లువచ్చును?

హంగరాజు గౌరీపతిశాస్త్రివంకఁ గన్నులుఱిమి చూచెను.

శశి : ఈ వాదనలన్నియు నిదివఱకే యైనవి. రాజ్యము విభక్తమగుటకు నిశ్చయింపఁబడినది. ఆ ప్రాతవిత్రవ్వి యేమి ప్రయోజనము?

హంగరాజు : రాజ్యము విభక్తమగుటకు వేఱే కారణమున్నది. పూర్వమెప్పుడో ఈదేశమున నందఱు మాంధాతృమతస్థులు. అప్పటి రాజ్యవిభాగాంశము మతప్రాతిపదికమీఁద నుండెడిది. ఇప్పుడు ప్రజలలో సగానికిసగము పరమతస్థులు. మాంధాతృమతానుయాయియైన రాజుపాలనలో మతాంతరులకు న్యాయము జరుగదు. ఆ మతాంతరుల మతమునకుఁ జెందినవాఁడు శశి. ఈ రాజ్యములోఁ బశ్చిమభాగమున నా మతాంతరులసంఖ్య యెక్కువ యున్నది. అందుచే నాభాగము శశిపాలనలో నుండవలయును. రాజ్యవిభాగకారణ మిది.

గౌరీపతిశాస్త్రి : అట్లైనచో శశియే రాజుకావలసిన యవసరము లేదు. ఆ ప్రజలు తమ కిష్టమైనవానిని రాజుచేసి కొనవచ్చును. ఇందలి ప్రధానవిషయ మేమనఁగా నీ మతాంతరులు తమరాజు మాంధాతృమతస్థుఁడు కావుట నంగీకరించరనుట. వా రా మాట యన్నారో లేదో తెలియదు. అన్నా

రనుటకు హంగరాజును, శశియుఁ బ్రమాణము. వీరి ప్రమాణ మంగీకరింపవచ్చునా?

హంగరాజు : ఇదివఱకు వందసార్లన్నారు. నోటితోఁ గాదు, కత్తులతో నన్నారు. మఱలఁ గావలసినచో నంకురు.

శశిమొగమునఁ జిఱునవ్వఁకురించెను. అసదబలుఁడు కన్నులలోఁ దైక్ష్ణ్యమును నెఱపెను వివస్వంతుఁడు తలవంచు కొని కూర్చుండెను. వల్లభమంత్రి వారిమాటలే వినుచున్నట్లు లేదు. గౌరీపతిశాస్త్రి యేమియో యనబోయి యూఱకుండెను. శశి గౌరీపతిశాస్త్రిని జూచి "యేదియో చెప్పఁబోవుచుంటివే, చెప్పు" మనెను.

గౌరీపతిశాస్త్రి : అయ్యా! రాజకుమారా! నీవు చేసెడి పని ప్రపంచకమునకుఁ జేటు తెచ్చునటువంటిది. పండువంటి కాపురముమీఁద నిప్పులుబోయుటవంటిది. నే నిప్పుడు రాజ్య విభాగకర్తలలో నొకఁడుగాఁ జెప్పుటలేదు. సృష్ట్యాదినుండి యే పరమేశ్వరధర్మము బ్రాహ్మణునియందు నిష్ఠమై యున్నదో యా బ్రాహ్మణభావము నావేశించి చెప్పుచున్నాను. మీ రన్న విషయమును బరామర్శించి చూపించెదను. మీ మతస్థులు కత్తులతో తమకు వేఱే రాజ్యము కావలయునని చెప్పినమాట నిజమే. ఎన్నిసార్లు చెప్పిరో యన్నిసార్లు మొదట మీ కత్తులు తరువాత మాంధాతృమతస్థులకత్తులు. అటునిటు పలుమంది చచ్చిరి. చివఱికి లెక్కజూచినచో నెక్కువమంది మృతులు మీమతస్థులు. ఇక్కడ నష్టే జరుగును. ఈ రెండుమతములవా రీ దేశమునఁ జెఱిసగము కాదు. మీ మతస్థులు నాల్గవవంతుగూడ లేరు. మీకు సజ

ముగాఁ జూచినచో నాల్గవవంతురాజ్యము వచ్చును. చెఱి సగము ప్రసక్తియే లేదు. మఱలఁ గత్తులతో మాకు రాజ్యము కావలయునని వెలయింపఁజేయుదురు. మీ మతస్థులసంఖ్య మఱలఁ దగ్గిపోవుటయేగాని దానివలన నధిక ప్రయోజన మేమియు లేదు.

హంగరాజు: నిజమే శాస్త్రిగారూ! మేము పడమటి భాగ మడుగుచున్నాము. పడమటిభాగము రాజ్యములో సగములేదు. నాల్గవవంతే యున్నది. ప్రాగ్భాగమే మూఁడు వంతులు.

అనదబలుఁడు: హంగరాజా! దేశ విస్తారకమాత్రమే యోజించినచో నీవు చెప్పునది నిజమే. కాని సంపద్విషయ మును విచారించినచోఁ బరిశ్రమల కనువైన ప్రదేశమని విచా రించినచో సస్యవంతమైన భూభాగమని విచారించినచోఁ బడ మటిదేశము రాజ్యములో మూఁడువంతులు. దానిని శశికిఁ గట్టఁబెట్టినచో విపన్నరాజ్య మేమగును?

హంగరాజు: అది యేమయ్యా! మీ రున్నారు, వల్లభ మంత్రి యున్నాఁడు. ఇప్పుడు మీ రిద్దఱు మహామేధావులు. నా రాజ్యము నేను జూచుకొనెడివాఁడను కాని, శశియొక్క రాజ్యములోఁ గూర్చుండునా? అతఁడు చిన్నవాఁడు. ఇచ్చె డిది కలిగియున్నప్పుడు తమ్మునకు నిస్సహాయునకు మంచి చెక్క నిచ్చి మిగిలినభాగమే తాను బాగు చేసికొనవలయును. చేసికొనెడివాని నేర్పులోనున్నది గాని నేల పండనన్నదా? పరిశ్రమలు పెరుగనన్నవా?

శశి: నా కదియంతయుఁ దెలియదు. మీరు చెప్పిన

ప్రకారమే రాజ్యవిస్తీర్ణతలోఁ బడమటిచెక్క నాల్గవభాగము. అది నా కిచ్చివేయుఁడు. నేను గష్టములేకుండ నా రాజ్యము నేను చేసికొందును. మీకు బోలెడంత రాజ్యమున్నది. మీరు వేయివిధములుగా దానిని వృద్ధిచేసికొనవచ్చును.

వివస్వంతుఁడు తా నింతసేపూరకుండి తల పంకించి యిట్లనెను: "మహామంత్రీ! అట్లే కానిమ్ము. సరిగా నాల్గవ భాగము కొలిచి పడమటి చెక్క వారి కిప్పించుఁడు. నేను సెలవుతీసికొందును" అని హఠాత్తుగా వెడలిపోయెను. హంగరాజును శశియు నెమ్మదిగా లేచి బయలుదేరిరి.

ఇంటికిఁ జేరువఱకు వారిద్దఱు నొకరితో నొకరు మాటాడ లేదు. అప్పుడు శశి యిట్లనెను: "బావయ్యా! నా భాగము నా కిత్తునన్నాఁడు. తీసికోయని వెళ్లిపోయినచో నెట్లు కుదురును? ఎల్లలు నిర్ణయించుకోవలయును కొలఁతలు కొలిపించు కోవలయును. అది చాలఁ బనియున్నది. ఆ మాట యన్నాఁడు, లేచిపోయినాఁడు. వారితో నీ వ్యవహారము కుదురదు. మనమే నిర్ణయించి మననిర్ణయమును వారితోఁ జెప్పవలయును. వారు జోక్యము కలిగించుకోనపుడు మన కేమి? మనము నిర్ణయింతము. ఎందు కొప్పుకొనరో చూతము. హంగరాజా! నీ వేమైన సరి హద్దులు నిర్ణయించితివా?"

హంగరాజు : పడమటిభాగముననున్న సస్యవంతమైన నేలనానుకొని తూర్పున దేశముపొడుగునను నెడారివంటి చీలిక యున్నది. ఆ చీలికకుఁ దూర్పున నంటుకొనియే పెద్ద యేఱున్నది. ఆ యేటిపేరు అదృశ్యవాహిని. అందులో జల ముండును. ఉండదు. ఎప్పుడో వఱదలు వచ్చునఁట. వచ్చినప్పు

డా యెడారియంతయు నిండునట. ఆ నఱదలువచ్చుట నే నెఱుఁగను. అదియంతయు నిసుకనది. ఈ రెండు దేశము లొక్కటి కానేకావు. ప్రకృతిసిద్ధమైన యీ విభాగ మనాదినుండియున్నది. మాంధాతరాజులు పడమటిదేశమును బలవంతముగా నరికట్టుకొనిరి. పడమటిభాగము పూర్వము హూంగరాజ్యములోనిది. అదియే సరిహద్దు. దానికిఁగొలత లక్కఱలేదు. సరిహద్దునిర్ణయ మక్కఱలేదు.

శశి : పోయి వారికిఁ జెప్పినవత్తమా?

హూంగరాజు : వారి కిదివఱకే తెలియును.

శశి : ఐనచో మనము మనదేశమునకుఁ బోయి మన రాజ్యము మనము పాలించుకొందము.

హూంగరాజు : అట్లు సాగదు. ఇన్నాళ్లును ప్రజలు వివస్వంతునిపాలనలో నున్నామనుకొనుచున్నారు. మనము వెనళ్లిచో మనకుఁ బన్నులీయరు. మనమాట వినరు.

శశి : ఆయనకిచ్చెడిపన్నులు మనకిత్తురు. వారికి వచ్చిన నష్టమేమి ?

హూంగరాజు : వచ్చిన నష్టమేమియనికాదు ప్రశ్న. వచ్చిన లాభమేమియని. మానవునిమనస్సు చిత్రమైనది. ఒక పనిచేయుటకుముందు నే నిట్లుచేయుదునని నిశ్చయించుకొనవలయును. ఒకనిని రాజనుకొనకముందు వాఁడు నా రాజని నిర్ణయముచేసికొనవలయును. సర్వసృష్టియు నిట్టినిర్ణయముమీఁద సాఁగుచున్నది. ఈ నిర్ణయము మానవునియొక్కదుర్బలత్వము. వాఁడు రాజనుకొనినచో రాజు; కాదనుకొనినచోఁగాదు. వాఁడు రాజై యొరిగించెడిది లేదు; వీఁడు రాజుకాక యొరిగించనిది లేదు.

రాజనింతనే వీనిమనస్సునకు వాఁడొక ప్రభువు వానికి వీఁడు భక్తుఁడు. దానిపేరు రాజభక్తి. ఆ రాజు బలహీనుఁడు, బుద్ధిహీనుఁడు, అప్రయోజకుఁడు, అవిద్యావంతుఁడు. ఈ ప్రజలలో నున్న వివేకులు బలవంతులు వానిని రాజుగా నంగీకరింతురు. వాఁడుకొట్టినఁ బడుదురు; తిట్టినఁ బడుదురు. ఆ రాజనినచోఁ బ్రాణములర్పింతురు. ఆ రాజుకొడుకే రాజుకావలయునని యాశింతురు. అంతదూర మెందుకు? ఈమె తల్లియని, యితఁడు తండ్రియని, వీఁడు స్నేహితుఁడని, వీఁడు విరోధియని మనస్సులలో ననుకొనుటతప్పు వేఱేమున్నది. తల్లితండ్రులవిషయములో వారివలనఁ దాను శరీరధారియగుటయను పెద్ద హేతువున్నది. తక్కినచోట్ల నేమియున్నది? మఱియు రాజు రాజుగా నెంచుటలో హేతువేమియుఁ గనఁబడదు. ఈ హేతువు మనస్సులోననే యున్నది. మానవుఁ డలవాటుగా నొకానొక విషయమును భావించుచుండును. దానిని విశ్వసించును. దానికొఱకు బ్రదుకును. దానికొఱకెన్నియైనఁ గష్టముల ననుభవించును. అది తనధర్మ మనుకొనును. దానికోసము ప్రాణములధారపోయును. ఇది యొకవ్యాధి. ఈ వ్యాధి మానవునకు జన్మతోనున్నది. ఇది వానిమనోగతమైన పెద్ద లోపము. ఇది మానవస్వభావములోని ప్రథమలక్షణము. భూమిమీఁద మానవుఁడున్నన్నినాళ్లు దీనికి నిష్కృతిలేదు. సర్వవిజ్ఞానము దీనిమీఁద నాధారపడియున్నది. మానవజాతియొక్క సర్వధర్మములు దీనిమీఁద నిర్మింపఁబడినవి. ఋషులు రాజులు కవులు శాస్త్రవేత్తలు మహాశిల్పులు మానవకోటిలోని సర్వవిజ్ఞానవంతులు నీ మానవునియొక్క మనస్సులోఁగల యీ దోషమును గుణముగా స్వీకరించి

దానిపైనఁ తమ మతములను నిర్మించిరి. కావ్యములు వ్రాసిరి. శాస్త్రములు ప్రసంచించిరి. గుళ్లు గోపురములు కట్టిరి. అది యంతయు నెందులకు? ఇన్నాళ్లును ప్రజలు విపర్యంతుఁడే రాజను కొనుచుండిరి. అతనిచేత రాజ్యములో నీ భాగము నీకర్పించి నట్లు కాగితముమీఁద వ్రాయించుకొన్నచో నది యందఱకు దెలిసినచో నపుడు నోరెత్తకుండ నిన్ను రాజుగా నంగీకరింతురు. కాగితముమీఁద నతఁడు తనముద్రవేయుటతో వారివిశ్వాసము మాఱును వారిమనసులలోని నిశ్చయము నీవైపునకుఁ దిరుగును. అనఁగా నతఁడంగీకరించినచోఁ బ్రజలంగీకరింతురు. ఇది యొక చిత్రము. అతనియొక్క సంతకముతో నింతమంది ప్రజల మనస్సులలో నొక్కసారి మార్పెట్లుకలుగును? ఈ జనమందరు నొక్కటియా కాదు, కోట్లమంది. రాజవిషయమున వీ రింత మంది లేరు. అందఱు నొక్కటియే. మానవునిమనస్సు కొంత తన వ్యక్తిది కొంత తన సంసారముది. కొంత తన యూరిది. కొంత తన మతముది. కొంత దేశముది. దేశమునకుసంబంధించిన యీ మనస్సంతయు గోటిమందిది యొక్కటియే.

శశి : నీవు చెప్పిన తరువాత నా కీ విషయము తెలియుచున్నది. ఇంత వ్యర్థమైన మానవమనస్సు నాధారముచేసికొని నేను రాజ్యమును సంపాదించుట యెందులకు? ఇది యొకవిధముగా మానవులను మోసముచేయుచున్నట్లు కనఁబడుచున్నది. వారి నెందుకు మోసపుచ్చవలయును?

హాంగరాజు : నీవు నీ మతమును వృద్ధిపొందించుట కొరకు దీనిని జేయుచున్నావు.

శశి : ఆ మతముకూడ మూఢమైన మానవమనో దౌర్బల్యముమీఁదనే యాధారపడియున్నది గదా!

హంగరాజు : ఓయీ ! మానవుఁడున్నాఁడు. వాని మనస్సున్నది. దానిని మన మిప్పుడు మూఢమనుచున్నాము. మనస్సెంకొకరీతిగా నుండదు. దానిలక్షణ మది. మనుష్యుఁడు బ్రదుకవలయును. రాజు రాజ్యముచేయవలయును పైగా నొక మతమును విశ్వసించినచో దానివలన మోక్షమువచ్చును. ఈ మనస్సేకదా మోక్షము తెచ్చుచున్నది. కనుక మనస్సు మూఢము కాదు. దానికి విశ్వాసము ప్రథమగుణము. లౌకికములైనవానియందలి విశ్వాసము మూఢమైనదని చెప్పినను భగవంతునియందలి విశ్వాసము మూఢమని చెప్పుటకు వీలు లేదు. లౌకికవిషయములందలి విశ్వాసములుకూడ మూఢమని చెప్పుటకు వీలులేదు. సర్వమానవులు సుఖముగా నుండవలయునన్నచో రాజ్యముండవలయును. రాజ్యమున్నచో రాజుండవలయును. రాజు కానిచో రాజస్థానీయు లుండురు. ఆ విశ్వాసము మూలభూతమైన మూఢత్వము కాని జగద్గమన క్రియయందు దాని మూఢత్వము వివేకముగానే భాసించును. భగవదనుగ్రహసంపాదనమునందు దాని మూఢత్వము వివేకముగానే పర్యవసించును. దాని నీవిధముగాఁ జెప్పవచ్చును. మానవుఁడు మూఢుఁడై తన మూఢతయే యాధారముగా వివేకము సంపాదించునని. అందుచేత మన మతముకొఱకు నీ రాజ్యసంపాదన నీవు చేయవలయును.

శశి : మనమతస్థులుకూడ నీరాజ్యమున నిలుగులు పొందుటలేదుగదా? వారుసుఖముగానే యున్నారు కదా. మన

మతస్థులవలన వారిమతస్థులు బాధపొందుచున్నారు కాని మన మతస్థుల కా బాధ లేదుకదా?

హంగరాజు : ఇందాక గౌరీపతిశాస్త్రి చెప్పినది విన లేదా? తొలినాళ్ల మనవి పదికత్తులు. మలినాళ్ల వారివి వంద కత్తులు, మన మతము నిలువఁబడవలయునన్నచో వారి కత్తు లాగివోవలయును. ఈ దేశమంతయు మనమతమునే యవలం బించవలయును.

శశి : అట్లైనచోఁ గలసియున్నచో దాని కెక్కువ వీలున్నదా? విభక్తులమైనచో వీలున్నదా?

హంగరాజు : అదిగాదయ్యా! ఈరాజ్యమునఁ బ్రధాన మతము మాంధాతమతము. రాజానుమతో ధర్మాః రా జే మతము నంగీకరించిన బ్రజ లా మతము నంగీకరింతురు. మన మతమునకుఁ ద్రాఁడు బొంగరము లేకుండనున్నది. ఈ దేశ మున కీ మతము. ఈ రాజు తన్మతస్థుఁడు అని యున్నచో నా మతమునకు వచ్చెడి దీప్తి వేఱు. శశీ! నీ వెంత మా మతమును బుచ్చుకొన్నను నీ యన్నగారిమీఁద నభిమానము పోదు.

శశి : నా కా యభిమానమేమియును లేదు. నాకు నా మతమే ప్రధానము.

హంగరాజు : ఆసంగతి నాకుఁ దెలియును నీవు భగవ దవతారమవు. ఒకమత మొక దేశములోఁ బుట్టినదనుకొమ్ము. వందయేండ్లు వేలయేండ్లు గడచెడిసరికి నా దేశములో నా ప్రజ లకుఁ దన్మతము ప్రాతవడి నిరాదరణహేతువగును. ఆ మతము నందుఁ దీవ్రవాదు లుండరు. ఏ మతమైన నిలువవలయుననఁగాఁ బరమతస్థుల నా మతములోనికిఁ ద్రిప్పుచుండవలయును.

క్రొత్తలో వారికి మతావేశ మెక్కువ యుండును. వారివలన నా మతము నిలుచుచుండును. అట్టివారిలో నెవనియందో యొకనియందు భగవంతుఁ డావేశించును. వానివలనఁ దన మతమునకు వ్యాప్తిఁ దెచ్చును. మనమతమునందు హంగరాజ్యములోఁ దీవ్రవాదులు లేరు. ఉండుటకు వీలులేదు. ఈరాజ్యములోఁ దీవ్రవాదు లున్నారు. ఎందుకనఁగా నీ దేశమునందుఁ దొలుత మనమతము పుట్టలేదు. ఇచట మతము క్రొత్తగా సంపాదించిన మేర. ఇచటఁ బరమతస్థు లెక్కువమంది. ఇతర మతములతో సన్నికర్షకలిగినపుడు కాని స్వమతములోనియాన్నత్యము భాసించదు స్వమతమునందలి విశ్వాసము కాని యావేశము కాని వృద్ధిపొందదు. నీకుఁ గొంత యాస్తియున్నది. అది పితృపితామహార్జితము. నీవు మఱికొంతయాస్తి సంపాదించితివి. అది స్వార్జితము. దానియందున్న మమకారము, శ్రద్ధలోభము పూర్వార్జితమైనదానియందుండదు. అట్లే మనమతమునకు నీ దేశమునందున్నంత తీవ్రత హంగదేశములో లేదు. పరదేశమునందుఁ గ్రొత్తమతము వ్యాపింపఁజేయుటకు నెప్పుడు నీ వెనులుబాటున్నది. ఆ దేశమునందు నా దేశస్థులు స్వమతమునందు నిద్రాళువులై యుందురు. పరమత మాక్రమించుటకుఁ బ్రారంభించినంతనే సులభముగా వశంవదులగుదురు. ఈ దేశస్థులే పరదేశమునం దున్నచోఁ బరదేశమునందున్నవారి మతాభిమానము సహజముగాఁ దీవ్రరూపము తాల్చును. అందుచేత మనమతము నీ దేశములో నిలఁబెట్టవలయును.

శశి : మనము వేఱే రాజ్య మేర్పఱచికొన్నంతనే దాని క్రొత్తఁదనము పోయినది కదా!

హాంగరాజు : ఓయీ ! మనము వేఱే రాజ్యమేర్పఱచి కొనుట సుఖముగాఁ గూర్చుండుటకుఁ గాదు. నిత్యము మనకు వివస్వద్రాజ్యముతో వైరమే. ఆరాజ్యమును మనము పూర్తిగా నాక్రమించుకొనువఱకు మనకు నిద్రాహారములు కూడవు. మానవు లధికసంఖ్యాకులు మూఢులు. వివేకరహితులు. ఆలోచనావిహీనులు. వారియందు మతోద్రేక మెక్కించి వివస్వద్రాజ్యమునకు నీరాజ్యమునకు నిత్యవిరోధము పాటింపవలయును. ఎడతెగని యుద్ధము జరుగుచున్నట్లే నడువవలయును. అప్పుడు మనమతము మేల్కొనియుండును. నిద్రపోదు. నీ రాజ్యము మనమతముయొక్క నిత్యజాగ్రదవస్థారూపముగా నిర్మించుచున్నాను.

శశి : ఐనచో వెంటనే పోయి వివస్వంతునిచేతఁ గాగితము వ్రాయించికొందము.

హాంగరాజు : అంత తొందఱపడఁగూడదు. భావము చమత్కారమయినది. ఆ భావము తోచినంతటన మిక్కిలి క్రొత్తగా నుండును. వెంటనే యది మనసులో జీర్ణించదు. కాలము గడచినకొలఁది దాని క్రొత్తఁదనము మనసునకుఁ బోవును. మానవుఁ డప్పుడు దానిననుసరించి నడచుట కభిముఖుఁడగును. మన మొక నెలనాళ్లు గడువిత్తము. అప్పటి కీ భావము వారిమనస్సులలో జీర్ణించును. మనపని సులభమగును. ఈలోపుగా నన్నియు సిద్ధపఱచియుంతును.

ఈ దేశము వర్తకమంతయు హాంగరాజు నీతి చాకచక్యమువలన గుడూచీనగరము నాశ్రయించెను. ఈ వర్తకమసావాదితో స్త్ర్యబ్రహ్మగా నున్నది. ఇక్కడఁ బండినపంటలు సమీప దేశమునకుఁ బోవుటకుఁగూడ గుడూచీనగరమునకుఁ బోయి యచ్చటి పెద్దవర్తకులద్వారా గాని విడుదలకాకుండ నున్నది. ఇందులో వెసులుబాటు లేకపోయినను నలవాటుచేయఁ బడినది. ఒక మహారాజకీయవేత్త యొక దాని నలవాటుచేయును. అల్పులయిన రాజకీయవేత్తలు స్వల్పవిషయములం దెంత చాకచక్యము నెఱపినను మహావిషయములందు స్వాతంత్ర్యము నెఱపలేరు. రాజ్యాంగమునందు సంస్కరణలు సేయు రాజ్యాంగవేత్తలు రెండురకములవారు. మొదటివారిసంఖ్య బహు స్వల్పము రెండవవారిసంఖ్య యధికము. మొదటిరకము వారు కొన్ని వేలయేండ్లకో కొన్ని వందలయేండ్లకో యొకఁ డుద్భవించును. రెండవరకమువారు తరతరమునం దుదయించుచునే యుందురు. వారే మంత్రులు. వారే రాజ్యాంగనిర్వాహణము చేయువారు. వీరి కేదైన నొక కార్యము చేయవలయునన్నచోఁ బూర్వ మెవ్వరైనఁ జేసిరా యన్న ప్రశ్నపుట్టును దానిని జూచి వీరు చేయుదురు. దానియోఁగాములు లాభనష్టములు వారు విచారించరు. వారన్నిటినిఁ బ్రయోగదృష్ట్యాచూతురు. మే మీ ప్రయోగమును చేయుచున్నాము. ప్రయోగకాలమునందుఁ బ్రజలు కొందఱు నష్టపడవలయును. దానిలోని కష్టసుఖములు తెలిసికోవలయును. అప్పుడుకదా యీ పథక మాచరణయోగ్య

మగునో కాదో తెలియును అని వారివాదన. పిల్లికిఁ జెలగాట మెలుకకుఁ బ్రాణసంకటమన్నట్లు పెద్దజీతములుతీసికొనుచు సుఖములనుభవించుచు రాజ్యాంగమున కధిపతులై కూర్చుండి యీ ప్రయత్నములను నెఱపుదురు. దానివలనబాధపడునది ప్రజలలోఁ బేదవారు. ఒకానొక మహాపదక మెత్తినపుడు దానిలోని సూక్ష్మసూక్ష్మాంశములన్నియుఁ దఱచి మథించి నిర్ణయించఁగల నేర్పుగలవాఁడే సంస్కరణలు ప్రవేశపెట్టవలయును. తక్కినవాఁడుచేసినపనులు పులినిజూచి నక్క వాతపెట్టికొన్నట్లు. కాని యిక్కడ నొక్కటియే భేదము. పులినిజూచి నక్క వాత పెట్టుకొన్నట్లుకాదు పులినిజూపించి తక్కినమృగములకువాతలు పెట్టినట్లు. మఱియు నీ రెండవరకపు సంస్కర్తలయొక్క మనోలక్షణము స్వాతంత్రమైనదికాదు. పరులననుసరించునది. ఒక మహాపురుషుఁడొక దేశములో నొక గొప్ప సంస్కరణమును దెచ్చెను. దానియందుఁ గొన్నిలాభములు గోచరించినవి. దానినిజూచి యీ రెండవరకపు సంస్కర్తలు తమ దేశమునందుఁ బ్రవేశపెట్టెదరు. వీరు వివేకవంతులే. ఆ వివేకమంతయు నాప్రవేశపెట్టఁబడిన సంస్కరణము సర్వాంగరమణీయముగాఁ బ్రవేశపెట్టుటయందే యుండును గాని, సంస్కరణముయొక్క మూలహేతువుగాని దానిస్వరూపలక్షణపరిజ్ఞానముగాని సంపూర్ణముగాఁ దెలిసికొనుటలోనుండదు. పదకము పదకముగా నాచరణలోఁ బెట్టుటలో వారికి సామర్థ్యముండును. కొన్ని చిన్నిచిన్ని మార్పులుచేయుటకూడఁ జేతనగును. కాని పదకమునే నిర్మించుట వారికిఁ జేతకానిపని. వారివివేకము రెండవజాతిది. మొదటిరకమువారు మహావివేకులైనను గాకపోయినను గొప్ప

సాహసముకలవారు. వారే దేశములను మార్చుచుందురు. పూర్వసంప్రదాయములను బెల్లగించి క్రొత్తసంప్రదాయముల నేర్పఱతురు. ప్రాతయులవాట్లు తొలగించి క్రొత్తయులవాట్లు ప్రవేశపెట్టుదురు. వారు ప్రజాభిప్రాయమును లెక్కచేయరు. వారు ప్రజాభిప్రాయమును సృష్టింతురు. ఒకదేశము కొన్నాళ్లు పరాధీనమైయుండి స్వాతంత్ర్యమును సంపాదించినప్పుడు రెండవ జాతి రాజ్యాంగవేత్తలవలన నేమియుఁ బ్రయోజనములేదు. స్వాతంత్ర్యమునచ్చినను బరాధీనమైనజాతియొక్క భావపరాధీనత భావపరాధీనతగానే యుండును. మున్ను గెలిచిన జాతియొక్క మహాసంస్కర్త లీ దేశమునఁ బ్రజలకనిష్టముగాఁ జొప్పించిన యులవాట్లు సంప్రదాయములు ప్రజల కలవాటై పోవును దానియందు సహజముగా నభిమానమేర్పడును. ఆ యభిమానమును బ్రజలు తొలగించికొలేనట్లే, యీ రెండవ జాతి రాజ్యాంగవేత్తలయిన సంస్కర్తలును తొలగించుకొలేరు.

ఈ రెండు తెగల రాజ్యాంగవేత్తలలో హాంగరాజు మొకటి తెగవాఁడు. రాజ్యము విభక్తమైన తరువాత హాంగరాజు చేసినమార్పులుతొలఁగఁబెట్టుటకు హాంగరాజంతటి సాహసుఁడు స్వతంత్రుఁడు కావలయును. హాంగరాజు చేసినమార్పు బహుముఖముగా నున్నది. విద్యాపద్ధతిలో సంఘవ్యవస్థాభావములలో మతాభిప్రాయములలో రాజనీతిలో యుద్ధనీతిలో మానవుని దైనందిన నీతిప్రవర్తనలో జీవితలక్ష్యములలో నన్నింటిలోన నతఁడు మార్పుతెచ్చెను. అతఁడు వీనినన్నింటిని స్వతంత్రముగా నాలోచించి చేసినవికాదు. తన దేశములోనున్నవానిని దెచ్చి యీ దేశమునందుఁ బ్రవేశపెట్టెను. ఈ దేశమువారికిఁ

దొలుత నవి వెగటయినవి. అప్పటివా రెదురుతిరిగిరి. వారియందు హంగరాజు దమననీతిని బ్రయోగించెను. తక్కినజనుల కవి యన్నియు నలవాటైపోయినవి. నేఁ డవియన్నియు వీరికి తమ స్వంతములుగాఁ గనిపించుచున్నవి. స్వాతంత్ర్యమువచ్చిన తర్వాత దేశములో మఱల మార్పుతేవలసినవారు రాజ్యాంగ వేత్తలు, సంస్కర్తలునైన రాజ్యాంగదక్షులు. వారుకూడ హంగరాజువన్నిన నీతివలలోజిక్కికొన్న పిట్టలే. తొలుతహంగరాజీ నీతిఁ బ్రవేశపెట్టినపుడు వాఁ డీ సంస్కరణముల లోతు పాతుల విచారింపవలసినపనిలేదు. అతనికిఁ గావలసినది సాహసము, దమననీతి. అవి రెండును వానియొద్ద సమృద్ధిగా నున్నవి. అతఁడు తెచ్చినమార్పును దొలగించి మరల జాతీయములైన సంస్కారములు బ్రవేశపెట్టుటకు నేటి రాజ్యాంగదక్షులకుఁ గావలసిన సాహసము లేదు. పరమ జాతీయాభిమానము లేదు. తొలుత సంప్రదాయములందే వారికి విశ్వాసములేదు. మూడవది: వీరు దమననీతి ప్రయోగించరాదు. ఇతరుఁడు వచ్చి పర రాజ్యము నాక్రమించి పరరాజ్యమున దమననీతి ప్రయోగించి నట్లు స్వరాజ్యమున స్వరాజకీయదక్షుఁడు దమననీతిఁ బ్రయోగించలేరు. నూత్నమైనమార్పు తీసికొనిరావలయునన్నను దెచ్చి పెట్టినమార్పును దొలగించవలయునన్నను సాహసమును దమన నీతియు సమృద్ధిగాఁ గలవాఁడే చేయగలఁడు.

రేపు రాజ్యము విభక్తముకాఁబోవుచున్నది. అట్టి సంస్కర్త యట్టి రాజ్యాంగదక్షుఁడు నంత సాహసుఁడు వల్లభ మంత్రి యగునాయని ప్రశ్న. వేఁట రెండు రకములు కనిపించిన ప్రతిమృగమును జంపునది. యొక వేఁట. అడివిపందినే

వేటాడును, లేదా పెద్దపులినే వేటాడును. ఈ వేట కష్టమయినది. తక్కినవానినన్నింటిని బరిహరింపవలయును. వానిని బరిహరించు వేళఁ దాను వేటాడఁదలచుకొన్న మృగము తనచేతి కగ్గమైనను దానిని వధించరానిస్థితి సంభవించవచ్చును. పరుఁడువచ్చి పరదేశము నాక్రమించినప్పుడు పరరాజు చేసెడిపనులు మొదటి వేటవంటిది. స్వరాజ్యము చక్కఁబఱచుకొనునప్పటి పనులు రెండవవేటవంటిది.

పారతంత్ర్యముపోయి స్వాతంత్ర్యము వచ్చినవేళఁ గలిగిన రాజ్యాంగవేత్తల క్రియాకలాపము మిక్కిలి క్లిష్టమైనది. దానికి వట్టి రాజ్యాంగవేత్త పనికిరాఁడు. రాజ్యాంగవేత్తృత్వము సాహసము, మహాధీశాలిత. పరమ స్వతంత్రమైన యూహ దమననీతి దమననీతికానట్లు వెలయింపఁజేయుట, ప్రజలకుఁ దలలోని నాలుకవలెఁబ్రవర్తింపఁగలుగుట. తత్పూర్వ పరరాజనీతియందలి వైముఖ్యము మొదలగు బహుగుణముల సమాహారము వానికిఁ గావలయును. ఇన్నిగుణములకు కూడిక పరమేశ్వరానుగ్రహముచేత నెవనియందో యవతారమెత్తిన వానియం దుండును గాని తక్కినవారియం దుండదు.

ఇప్పుడు వర్తకమంతయు గుడూచీనగరమునుండి మరలించవలయును ఇది యొక క్లిష్టకార్యము. రాజ్యము విభక్తమైనతరువాతఁ జేయుటలో నాక్షేపముండదు. అపుడు చేయుటకుఁ గాలము మించిపోవును. ఇపుడు చేసినచోఁ గ్రొత్త సమస్యలు బయలుదేరును. అవి మోసెత్తకుండ రహస్యముగాఁ జేయఁగలుగవలయును. వల్లభమంత్రి యడుగుఁదీసి యడుగు

వేసినచో నతఁడీపని చేసినాఁడని హాంగరాజునకుఁ దెలియును. మఱి యెట్లు చేయును ?

గుడనగరమున ముప్పదినలుబదిమంది కోటీశ్వరులుకలరు. వారిలో నిద్దరు మహా ధనవంతులు. వా రిద్దఱు దేశాభిమానులు. వల్లభమంత్రికిఁ రెండుచేతులవంటివారు. హాంగరాజు దేశ మును బూర్తిగాఁ గబళించలేకపోవుటకు వారి ధనసాహాయ్యమే యడ్డమువచ్చెను. తక్కిన వర్తకులందఱు వారు పోయినత్రోవనే పోవుదురు.

ఒకనాటి యర్ధరాత్రమున హాంగరాజుయొక్క చారుల కనుమొఱఁగి వారిరువురు వల్లభమంత్రియింటికి వచ్చిరి. వల్లభ మంత్రియు గౌరీపతిశాస్త్రియు వారిద్దఱును గూర్చుండిరి.

వల్లభమంత్రి : రాజ్యము విభక్తముకాకతప్పదు. యువ రాజు మాటయిచ్చెను. విభాగమున కంగీకరించనిచో దేశమున నల్లరు లెక్కువగుటయేకాని శాంతి యుండదు.

మొదటిశ్రేష్ఠి : చెఱిసగముగాఁ దీసికొందురా?

వల్లభమంత్రి : కాదు, దేశములోనున్న పడమటిభాగ మంతయు వారిది.

రెండవశ్రేష్ఠి: సస్యసమృద్ధిగలదేశ మది. వర్తకమంతయు నచ్చటనే యున్నది. మిగిలినదేశము పంచికొని యేమి లాభము, పంచికొనక యేమిలాభము?

వల్లభమంత్రి : మీ వర్తకులందఱు వారిదేశములో ననే యుండిపోదురో, మన దేశమునకు వత్తురో?

మొదటిశ్రేష్ఠి : ఇల్లువాకిళ్లు, పిల్లలు, సంసారములు, బంధు వులు సర్వ మిచ్చటనుండి మే మందఱ మె ట్లచ్చటనుందుము?

వల్లభమంత్రి: ధనమూల మిదంజగత్. మీ సంపద యంతయు నచ్చట నున్నదికదా! అచ్చటనే యిండ్లు కట్టుకొన వచ్చును. దారపుత్రాదులను దీసికొనిపోవచ్చును.

రెండవశ్రేష్ఠి: అయ్యా! పిల్లలను మేకలను దరలించుకొనిపోవచ్చునుగాని యిచటి మట్టిగడ్డలను బెల్లగించికొని పోలేముకదా! దారపుత్రాదులకంటె మట్టిగడ్డలే మా కెక్కువ ప్రియము.

వల్లభమంత్రి: మఱి యంతటి వర్తకము నిచటికి మరలించికొనుట యెట్లు?

ఒకటవశ్రేష్ఠి: విభాగముచేయునది యెవ్వడు?

వల్లభమంత్రి: మీ రెవ్వడు చేయుమన్నచో నవ్వ డంగీకరించెదను. ముందు మీ రటో యిటో తేల్చుకొన వలయును.

రెండవశ్రేష్ఠి: మే మిటే మహామంత్రీ! ఆ దేశప్రజల దౌరుద్ధత్యముక్రింద మేము బ్రదుకలేకున్నాము. హూంగరాజు యొక్క నీతి తక్కిన వృత్తుల నెంత యాదరించినను మా వర్తక జాతి నాదరించలేదు. దేశములో మావర్తకులు సంప్రదాయము లందుగాని, మతాభిప్రాయములందుగాని మాఱలేదు. మన దైవతములనే మేము కొలుచుచున్నాము. దేశసంపద మా యధీనము. మాయం దెవ్వడును మార్పుండదు. మాకు గుడూచీనగరముకంటె గుడనగరమే ప్రేమపాత్రము.

వల్లభమంత్రి: అంతటి వర్తకమును దరలించికొని వచ్చుట యెట్లన్నదే ప్రశ్న.

ఒకటవశ్రేష్ఠి : మాకు నెలనాళ్లు గడువీయుఁడు. ఈ లోపుగా మేము చేసికొనవలసినది చేసికొందుము.

వల్లభమంత్రి : నేను మీకు గడువిచ్చుటకాదు. మీ రెప్పుడు చేయుమన్నచో నప్పుడే చేసెదరు.

ఒకటవశ్రేష్ఠి : ఈనాడు మొదలు ముప్పదిదినములు మాకుఁ జాలును.

వల్లభమంత్రి : మీ రేమిచేసెదరో నాకుఁ దెలియదు. కాని యిది పరమరహస్యముగా నుంచవలయును. అందఱు వర్తకులకుఁ దెలియవలయును. రహస్యము వర్తకులను దాటి పోరాదు. వర్తకులలోనే రహస్యమును బయలుఁబెట్టువా రుండ వచ్చును. వా రెవ్వరో తెలిసికొని వారి నీ రహస్యమునుండి బహిష్కరించవలయును.

రెండవశ్రేష్ఠి(నవ్వుచు)-అంతనీతికి మేము వల్లభమంత్రు లము కాము.

వల్లభమంత్రి : నాకంటె నెక్కువవారే యగుదురు.

అంతట వారు రహస్యముగా వెడలిపోయిరి.

తరువాత రెండుమూనాళ్లకు వివస్వంతుఁడు వల్లభ మంత్రికడకు వచ్చెను. మంత్రి తనతో నేమో చెప్పునని యాతని యభిప్రాయము. మంత్రి యేమియు మాటాడలేదు. రాజ్యవిభా గమునకుఁ దా నంగీకరించెనని మంత్రికిఁ గోపము. శశి మహాంత రుఁడయినను దనతోనేకగర్భవాసుఁడు. అతనిమీఁదిప్రేమ వివ స్వంతునకుఁ బోలేదు. అతఁడు చిన్నవాఁ డగుటవలనఁ దండ్రి పోయినందువలనఁ దమ్మునియం దెక్కువప్రేమ. లోకములో నన్నలకుఁ దమ్ములయందుఁ బ్రేమయుండును. తండ్రులకుఁ

గొడుకులయందుఁ బ్రేమయుండును. పెద్దవాండ్రకుఁ జిన్న వాండ్రయందుఁ బ్రేమయుండును. ఈ పిన్నవాండ్రకు నా పెద్ద వారియందుఁ దగినంత ప్రేమ యుండదు. వారు పెద్దవారగనుక దమసంగతి తామే చూచుకొనఁగలరని, తమ్ముఁ బాగుచేయుట వారివిధియని యీ పిన్నవాండ్ర యభిప్రాయము. లోకము నందు సర్వదా యిట్లుకాదు. ఈ ప్రేమలు దీనికి వ్యతిరేకముగాఁ గూడ నుండును. కాని యిట్టిప్రేమ లోకసామాన్యమయినది. మఱియు వివస్వంతుఁ డుదారుఁడు. శాంతముగా జీవితము నడపి కోవలయు ననువాఁడు. తాను శశితో వివాదముపెంచినచోఁ దనతండ్రి మరియాద తగ్గిపోవుననుకొనెడివాఁడు. ఇది వివస్వంతునిలోని లోపము కొన్ని మరియాదలు సామాన్యసంసారము లలోఁ బాటింపఁదగినవి వానిని రాజకుటుంబములలోఁ బాటింప రాదు. ఈ మరియాదలు భిన్నస్థలములయందు భిన్నములుగా నుండును. ఒకచోటిది మరియొకచోటఁ బాటించినచోఁ జేటు కలుగుటయేతప్ప మఱియొక లాభములేదు.

రాజ్యవిభాగమునకుఁ దా నంగీకరించిన మఱునాఁడు వివస్వంతుఁడు హంగరాజుతోఁ గలిసికొనెను. ప్రసంగవశమున నదులన్నియుఁ బడమటిదేశభాగములోననే యున్నవి. నీరుప్రవహించని పెద్దనది యొక్కఁడు మాత్రమే తూర్పుదేశముగుండా ప్రవహించుచున్నది. దానివలన నేమిప్రయోజనమని వివస్వంతుఁ డనఁగా హంగరాజు "ఏ నాలుగైదేండ్లకో వఱదలువచ్చును గదా! ఆనకట్టకట్టుకొని చెఱువులు త్రవ్వించుకొని కాలువలు సిద్ధముచేసికొన్నచో నాలుగేండ్లకొకసారియైనను బండించుకొనవచ్చు"నని యనెను. ఈ మాట వెక్కిరింపుమాట. సామా

న్యముగాఁ బ్రవహించునీళ్లకుఁ గట్టలుకట్టికొందురు కాని, వఱద నీటికిఁ గట్టలు కట్టించుకోరు. అట్లు కట్టలుకట్టినచో దేశము నాశమగుటకుఁ బ్రవహించు వఱదనీరే చాలును కట్టలుకట్టి మఱలించిననీటితో మఱియుఁ గొంత దేశము నాశమగును. హంగ రాజునకు వివస్వంతుఁ డవివేకియని యభిప్రాయము. అవివేకి కానిచో నీ విభాగమున కంగీకరింపఁడుకదా! వివస్వంతుఁడు నది కడ్డము కట్టవలయునని,దానితో దేశము మఱియు నాశనము కావలయునని హంగరాజు నూహ. హంగరాజు తన్ను వెక్కిరించుచున్నాఁడని వివస్వంతునికిఁ దెలియును. ఆ వెక్కిరింపుమాటను వివస్వంతుఁడు వల్లభమంత్రితోఁ జెప్పెను. వల్లభమంత్రి "కట్ట కట్టుటకు,కాలువలు త్రవ్వించుటకు ధన మెచ్చటనుండివచ్చు"నని యడిగెను. వివస్వంతుఁడు మాటాడలేదు. మంత్రి యిట్లనెను: "రాజ్యపు ధనాగారములు కలవు. హంగరాజ్యపు ధనాగారములు కలవు. దేశమునెల్లెడఁ బ్రతినగరమునందు నీ మహాధనాగారములయొక్క శాఖలు కలవు. కాని దేశములోనున్న ధనవంతులందఱు రాచఱికపు ధనాగారములందుఁగంటె హంగరాజ్యపు ధనాగారములయందే తమ విత్తములు భద్రముచేసికొన్నారు. మీరు మహాధనవంతులను గలిసి రాజ్యము విభక్తమగుచున్నదని చెప్పి వారు భద్రముచేసికొనిన ధనమును రాచఱికపు ధనాగారములకు మార్పించుఁడు. పెద్దమొత్తములుగా ధనికులు నలుగు రట్లు చేసినంతనే తక్కినవారుకూడఁ దమ ధనములను రాచఱికపు ధనాగారములకు మార్తురు. ఆ ధనముతో నానకట్ట కట్టవచ్చును. కాలువలు త్రవ్వించవచ్చును." వివస్వం

తేఁడు మాటాడకుండఁ దలవంచికొనికూర్చుండియిట్లనుకొనెను: “మంత్రి తనతోఁ బరాచికమాడుచున్నాఁడా? అతనియంగీకారములేకుండఁ దాను విభాగమున కంగీకరించినందువలన మంత్రికూడఁ దనచేడ్పాటునకే దోహదముచేయుచున్నాఁడా? వారందఱు ధనములను మార్చికొందురా?” మంత్రి మఱల నిట్లనెను: “హంగరాజు ధనాగారములు మనదేశధనముతో నూగుచున్నవి. వాని దేశమునందలి వర్తకము మనధనముతో వృద్ధినొందుచున్నది. తరువాతఁ దద్ధనాగారములనుండి ధనమును గ్రహించుట కష్టము. విభాగముముందు జరుగవలయునుగనుక నది చెడిపోవునేమోయని యిప్పుడడిగినచో మనదేశమునందలి ధనికులధనము తలతాకట్టుపెట్టియైనను జెల్లించును. భవిష్యత్తులో నీధనమంతయు నతఁ డెగఁగొట్టినను జేసెడిదేమియులేదు. ఈదేశమునందతని ధనాగారశాఖలు తీసివేసినను దీసివేయవచ్చును. ఈమాట పదిమంది ధనికులకుఁ దమరు రహస్యముగాఁ జెప్పినచో వారు జాగ్రత్తపడుదురు.”

వివస్వంతునకు మంత్రి సుముఖముగానే మాటాడుచున్నాఁడని తెలిసెను. కాని నది కానకట్టకట్టి కాలువలుత్రవ్వించుట యంతటి వివేకహీనమైనపని మఱియొకఁడు లేదు. ఆ పనిని సాగించుటకె యీ పనిని జేయుమనుటయేమి? అంతయుఁగలిసి సర్వనాశమగుటకా? వివస్వంతుఁ డిట్లనెను: ఈ యానకట్ట కట్టుట, యీ కాలువలు త్రవ్వించుట నిష్ప్రయోజనమయిన పని కదా! ఈపనిచేసినచో మనరాజ్యమునందుఁ బూర్వమునందుఁ గంటె నెక్కువ యెద్దడివచ్చును. హంగరాజునకు నీ నేలయందలి యెద్దడి యిష్టము. నే నవి వేకినని యతనియుద్దేశ్యము. నే నీపని

చేసినచోఁ దాను సంతోషించవలయునని హంగరాజు నాతో నట్లు చెప్పెను."

వల్లభమంత్రి : మీరు హంగరాజున కవివేకులు. అతని కవివేకులుగానే యుండిపోండు. మీ తమ్ముఁడయిన శశిని సంతోషపెట్టితిరి కదా! అతని మేనమామ నేల సంతోషపెట్ట రాదు? ఇందులోఁ బక్షపాత మెందుకు?

వివస్వంతుఁడు : మహామంత్రీ! మీరే యాలోచిం చుఁడు. దేశము క్లిష్టమయిన స్థితిలోనికి వచ్చినది. ఎటో యొక యట్లు వారినిఁ బెడఁద్రోసి మనయిల్లు మనము చక్కబెట్టుకొన వలయునే కాని, వారితోఁ గలసియుండుట తలక్రిందఁగొఱివిపెట్టు కొన నెంచుట. నా ప్రాణము విసిగినది. యాదవకులమునందు ముసలమువలె శశియొకఁడు పుట్టినాఁడు. అతఁడు తమ్ముడని చెప్పికొనుటకూడ సిగ్గుచేటు.

వల్లభమంత్రి : నేనును గాలువలు త్రవ్వించుమని, యానకట్ట కట్టించుమని నిజముగానే చెప్పుచున్నాను. నాలు గేండ్ల కొకసారి వరదవచ్చుచున్నది. ఆ నీళ్లు గంగలోఁ బడి పోవుచున్నవి. దేశమునందుఁ జాల చెఱువు లున్నవి. ఆ చెఱు వులలోనికిఁ గాలువలుతీయించుఁడు. చెఱువులు నిండునుగదా! నదివరద మఱియుఁ బొంగివచ్చినపుడు నీరు వదలెదము.

వివస్వంతుఁడు : నది పొంగి గ్రామములను దుడిచి వేయును.

వల్లభమంత్రి : రెండువైపులఁ గరకట్టలుపోయింతము.

వివస్వంతుఁడు : ఈ పని తమరి కంగీకారమేనా?

వల్లభమంత్రి : మన దేశములోనున్న మహాస్థపతు లను బిలిపించి వారితో మాటాడుఁడు. కాలువలు చెఱువుల లోనికిఁ బ్రవహించినట్లు కనిపించుచు దేశమంతయు బల్లపుసాగు చేయుటకు వీలుగాఁ గాలువలు నిర్మించవలయునని చెప్పవల యును. దీనిలో నా యంగీకారము లేదు. నేను దీనికి వ్యతిరే కిని. ఈ పని మీయిష్టముమీఁదనే సాగుచున్నది.

వివస్వంతుఁడు : తమకువ్యతిరేకమయిన పనిని నేనుఁ జేయను.

వల్లభమంత్రి : నేను వ్యతిరేకి ననఁగా దీనిలో నేను జోక్యము కలిగించుకొనను. ఈ పదకమన్నచో నా కిష్టము లేనట్లే ప్రవర్తింతును. మీరు హంగరాజుమాటమీఁదనే యీ పని చేయుచున్నట్లు ప్రవర్తించవలయును. సస్యవంతమైన నేల వారికి వెళ్లినది కనుక, గ్రుడ్డిలో మెల్లగాఁ దమ దేశమును దాము వృద్ధిపొందించుకొనుటకుఁ బ్రయత్నించుటలోఁ దప్పు లేదు కదా?

వివస్వంతుఁడు : ఆనకట్ట యెచ్చటఁ గట్టవలయును? కాలువ లెట్లు త్రవ్వవలయును? ఇదియంతయుఁ బెద్దపని. మన విభాగము కాకపూర్వ మింతపని సాగునా? విభాగ మెన్నా ళ్లలో జరుగును?

వల్లభమంత్రి : అది నాకేమి తెలియును ? మీ చేతిలో నున్నపని. ఈ పనియంతయుఁ బూర్తియైన తర్వాతనే విభాగ ములు జరిపించుఁడు.

వివస్వంతుఁడు : పదకము లన్నియుఁ దీర్చుటకే పది నెలలు పట్టవచ్చును. ఆనకట్టకట్టుటకు రెండేండ్లయినఁ గావల

యును. కాలువలు త్రవ్వుటకుఁ గొన్ని నెలలు కావలయును. ఇది యింతలోఁ దేలెడిపని కాదు.

వల్లభమంత్రి : పదకములన్నియుఁ బాలీకయేఁడ్ల క్రింద సిద్ధమైయున్నవి. ఆనకట్ట యెచ్చటఁ గట్టవలయును? కాలువ లెన్ని త్రవ్వవలయును? ఏయే ముఖముగాఁ ద్రవ్వవలయును? సర్వమును సిద్ధముగా నున్నది. ఈ పదకమంతయు మహారాజు మాంధాతగారు పూర్వమే వేసెను. ఆనకట్ట కట్టుటకుఁ గావలసిన రాళ్లు సున్నము సర్వమును సిద్ధముచేయఁబడియున్నవి. వృద్ధస్థపతి గంగాధరముగా రున్నారు. ఆయన యుద్యోగవిరమణముచేసి విశ్రాంతి తీసికొనుచున్నారు. ఉత్తరదేశమున శ్రీసరస్సను నొక గ్రామమున్నది. ఆయన యాగ్రామములో నుండును. ఆయనను బిలిపించినచో నింతటి పనియు నాలుగయిదు నెలలలో సిద్ధమగును. అంతవఱకు విభాగము నాపుదలచేయవచ్చును. ఇపు డాపుదలచేయుటయు సులభమే. ఎందుకనఁగా హంగరాజు మనగోయి మనము త్రవ్వకొనుచున్నా మనుకొనును. ఆగినకొలంది రెండురాజ్యములు తా నొక్కసారి కబళించవచ్చు ననుకొనును.

వివస్వంతుఁడు : నాయనగారీ పదకమును నిర్మించిరని హంగరాజునకుఁ దెలియదా?

వల్లభమంత్రి : ఇది రాజరహస్యము. తెలియును, దెలియదు. తెలియునుగాని యిది నిష్ప్రయోజనమని సర్వజనుల యభిప్రాయము. అందుకనియే మీ తండ్రిగారు దీనిని విరమించిరి.

వివస్వంతుఁడు : ఆ విరమించినపనిని మన మిప్పుడు ప్రారంభించి చేయుటలో నేమి వివేకమున్నది?

వల్లభమంత్రి : ఆయన తరువాత విరమించెను. తొలుత నెందు కారంభించెను? ఎందుకో యారంభించెను. ఎందు కారంభించెనో కనుగొందము. ఎందు కారంభించెనో తెలిసినచో నప్పుడది యవివేకము కాదుగదా! అది రాజరహస్యమై యుండవలయును. ఆ రహస్య మేదియో తెలిసికొనుటకుఁ బ్రయత్నింతము. ఆ రహస్యము నేఁడు తెలియవచ్చును; నాల్గు నెలలకుఁ దెలియవచ్చును. మన మీపని ముందఱఁ జేసిపెట్టికొని యట్టిపెట్టుకొనినచో రహస్యము తెలిసినంతటనే యీ సర్వమహాకార్యము నుపయోగములోనికిఁ దీసికొని రావచ్చును. అన్నిటి కన్నఁ బ్రధానమైనది పది పదేనుదినములలో హంగరాజుధనాగారములలోనున్న రాజ్యధనమంతయు మన ధనాగారములలోనికి రావలయును. ఈకార్యము చక్కగా నెఱవేరుటకు నిద్దఱు సాహుకారు లున్నారు". అని వల్లభమంత్రి వారిపేర్లు వివస్వంతునకుఁ జెప్పెను. వివస్వంతుఁ డిట్లనుకొనెను. "ఆ రహస్యము వల్లభునకుఁ దెలియును. తనతోఁ జెప్పుటలే" దని.

వివస్వంతుఁడు వెళ్లుచుండఁగా వల్లభుఁ డిట్లనెను. "ఈ పదకమునకు నాకు నేమియు సంబంధము లేదు. నేను దీనికి వ్యతిరేకము; తెలిసినదా?"

# ప్రథమాధ్యాయము

గుడనగరమున నానాఁడు తెల్లవాఱువఱకు ప్రతి శృంగాటకమునందు సర్వములయిన అచ్చచోట్లయందుఁ బెద్ద పెద్ద యక్షరములతో గాగితము లంటింపఁబడెను. హీరా నృత్యము. జనము దంతధావనముచేయువారు సగములో వదలి గోడలమీఁదికాగితములు చూచి వచ్చిరి. ఏదో తొందఱ పనిమీఁదఁ దెల్లవాఱకముందు లేచి నడచిపోవుచున్నవా రాగి యా కాగితమువంక చూచుచుండిరి. ఆనాటికి నాల్గవనాఁడు హీరానృత్యము. ముందు ప్రయాణములు పెట్టుకొన్నవారు తా మానాటికి గ్రామములో నుందుమా? యుండమా? యని లెక్క వేసికొనుచుండిరి. కొందరు రైలందునో యందదో యని పరుగెత్తువారుకూడ నా కాగితములవంకఁజూచి పరామర్శించి కొనకుండఁ బోవుటయే లేదు. కొందఱు నిర్వ్యాపారులు గుములుకూడి యా కాగితము లంటించినచోటఁ జూచుచు నిలఁబడిరి. వారినిఁజూచి మరికొందఱు నిర్వ్యాపారులు చేరుచుండిరి. హీరానృత్యము హీరానృత్యము ఇంక నాల్గుదినములలో నున్నది, నాల్గుదినములలో నున్నది, యనుచు కొందఱు బాలురు కేకలు వేయుచు వీథులవెంటఁ బరువెత్త నారంభించిరి. కొంత ప్రొద్దెక్కినతరువాత నెవరో యొకాయన యన్నాఁడు: “ఆ నృత్యమునాఁడే రాజ్యవిభాగము జరుగఁబోవుచున్నది. వివస్వంతుఁడును శశియు — నీయన గుడనగరములో నాయన గుడూచీనగరములో నానాఁడే పట్టాభిషేకముచేసికొందురు.

ఆనాఁడు హీరానృత్యము మన పట్టణములో జరుగుట మనకు గొప్ప యుత్సవదినమయినది."

ఆ దినమంతయు నెచ్చట విన్నను హీరానృత్యమును గూర్చియే.

"శశికి నన్నగారిమీఁద ప్రేమ లేదందురు. హీరా నృత్యము ఆనాఁడు శశి తన రాజధానిలో నేర్పాటుచేసికొన వచ్చును. కాని మనయూరిలో నామె నృత్యముచేయుట కంగీకరించినాఁడు."

"ఆయన యంగీకరించుట యేమున్నది. హీరా స్వతంత్రు రాలయిన నాట్యకర్త్రి. ఆమె హంగరాజమతస్థురాలు కాదు. వెనుక మన నగరములో నాట్యముచేసినపుడు చూడలేదా? అన్నియు మనపాటలే పాడెను. సభాసదులకోరికపై హంగ భాషలోని కీర్తనలు పాడెను గాని, యామెకు మన భాష యన్నచో మన మతమన్నచో మిక్కిలి యిష్టము."

"సంగీత విద్వాంసు లందఱంతే. వారికి మతములపిచ్చ లేదు. వారందఱు కృష్ణభక్తులు. హంగరాజదేశీయుఁడైన యొక మహా సంగీతవిద్వాంసు డన్నాఁడట, కృష్ణుఁడు లేనిచో సంగీత మేమున్నదని. హంగరాజు తన మతమును మన దేశములో వ్యాపింపఁజేసెను. కాని సంగీతవిద్వాంసులందఱు హంగరాజ దేశీయులైనను హంగరాజమతస్థులైనను మన దేవతలనే కొలుచు చున్నారు."

"అన్ని విద్యలు పరమేశ్వరార్పితములయినప్పుడే వాని శోభ. విద్యలలోని పరమార్థము తెలిసినవారికే యీ రహ స్యము తెలియును. హంగదేశీయులలో ననేకసంగీతవిద్వాంసులు

మన దేశములోనికి వచ్చి యిచట నివాసము కల్పించికొని మన సంగీతవిద్వాంసులవద్ద ననేకవిషయములను దెలిసికొని సంగీతమునకుఁ బ్రధానమయినది భక్తియని తెలిసికొని మనస్సులలో మన దేవతల నారాధించుచుండిరి. బయటికి వారి యాచారములు మతము వారివే. మనసులోని విశ్వాసము మాత్రము మనది."

"మన దేశీయులలో నల్ప మేధావంతులు హుంగరాజ మతము గొప్పదని దాని ననుసరించుచున్నారు. మనసులలో నా మతమునం దభిలాష కలిగియున్నారు. కాని వారియాత్మలు నీ మతమే నీదిరా యని చెప్పుచున్నవి."

"మన మతమునకు వారి మతమునకు భేద మిది మన మతములోనున్న మహా మేధావు లెప్పుడును గదలరు. అల్పులు పెఱమతముల వెంటఁ బోవుదురు. వారి మతములోనున్న యల్పులు వారిమతమును వదలిపెట్టరు. అధికులు వారి మతమును వదలిపెట్టి మన మతమును విశ్వసింతురు."

"హీరా నాట్యకత్తె. కాని పెద్ద సంగీతవిద్వాంసురాలు కాదు. ఆమెవిషయములో నీ సిద్ధాంతములన్నియుఁ బట్టవు."

"ఏది యెట్లైననేమి, మరల హీరానాట్యము చూడ వచ్చును. అది వట్టి నాట్యము కాదు, దేవతా నాట్యము."

"అది నాట్యము కాదయ్యా! అది మనస్సులోఁ బోసిన యమృతధార యనుకో. ఇప్పటికిఁ దలఁచుకొన్నచో వేయి మెఱపులు కన్నులముందాడినట్లున్నది. ఇంతకును దౌర్భాగ్యము. నే నానాఁడూరిలోనుండునట్లు లేదు. అదో యిదోయైనచో మూనివేయుదును. కాని మా యల్లునితమ్మునివివాహము,

నేను వెళ్ళకపోయినచో వంద నిష్ఠురములు. తెలియును గదా మా యల్లుని పోడిమి. ఇదివఱకే నే నాయనకుఁ దోటకూర కాడలోని పురుగును. కిడుపుఁజించుకొన్నచోఁ గాళ్ళమీఁదఁ బడును. బిడ్డకోస మెటువంటి గడ్డియైనఁ దినవలయును. ఒకొక్కనిమొగానఁ బరమేశ్వరుఁ డొకొక్క విధమున వ్రాయును.”

“ఇది యంతయుఁ గర్మ. సుఖములు దుఃఖములు కలసియే వచ్చుచుండును. ఒక వ్యక్తియొక్క జాతక మొకరీతిగా నుండును. ఒక వర్ణముయొక్క జాతక మదొక్కరీతిగా నుండును. ఒక గ్రామముయొక్క జాతకము మఱొక్కరీతిగా నుండును. ఒక దేశముయొక్క జాతక మదియొకరీతిగా నుండును. ఒక రాజ్యముయొక్క జాతక మదియొకరీతిగా నుండును. ఎవఁడు చెప్పఁగలఁడు. ఈ విషయము చూడుము. మనదంతయు నొక దేశము కద. యాదవకులమునందు ముసలము వలె శశి పుట్టినాఁడు. ఇతఁ డా మతమును స్వీకరించినాఁడు. అవిభక్తరాజ్యము విభక్తరాజ్యమయినది. ఏ మతమయిన నేమి, అన్నదమ్ములుగదా యనుకొందము. ఏకగర్భవాసులు గనుక వివస్వంతుఁడును శశియు బ్రతికియున్నన్నినాళ్లు గ్రుడ్డిలో మెల్లఁగాఁ బోవుననియే యనుకొందము. వీరిబిడ్డలు వారిబిడ్డలు ఏకగర్భవాసులు కారుగదా! కౌరవపాండవులవలె నగుదురు. మఱి రెండుమూఁడు తరములు పోయినతరువాత నేమగును? వారెవరో వీరెవరో! ఆ దేశములో మన పుణ్యక్షేత్రములు చాల నున్నవి. నీవు చరిత్ర యెఱిగినవాఁడవే కదా. క్రైస్తవు లందరు యూరోపుదేశములో నుండిరి. వారి ప్రవక్తయైన

యేసుక్రీస్తు చిన్న ఏషియాలోఁ బుట్టెను. ఆ దేశము మహామ్మదీయులపాలనలో నున్నది. మూఁడు శతాబ్దులక్రింద నెన్ని మతయుద్ధములు! మన దేశమున నిది యొక జాతకము. ఇది యొక నడక. ఇది యెట్లు నడచునో చూడవలయును."

"నీతో మాటాడినచో నిదియొక గ్రంథము త్రవ్వెదవు. సారస్వతమును గుఱించియైనను సరే, నాట్యమును గుఱించి యైనను సరే, సంగీతమును గుఱించియైనను సరే. దేనినిగుఱించి మాటాడుకొనుచున్నను నీవు కర్మవేదాంతము మతముల లోనికి దింపెదవు. మీ తమ్ముఁడు నీకుఁదగినవాఁడు. అతఁడు ప్రతిదానిని రాజకీయములలోనికిదించును."

"సరేగాని యీ రాజ్యము విభక్తమగురోజున నీమె తన నాట్యమును ప్రదర్శించుచున్న దేమి?"

"ఆనాఁడు మనమందఱము నుత్సాహముగా నుందుము గనుక ధన మెక్కువ వచ్చునని"

"ఆనాఁడు నాటకమందిరము పట్టునాయని? పట్టణము పట్టణమంతయు నక్కడనే యుండును. ఒడ్డువిఱిగిపోవును"

"సామాన్యముగా నామె నాట్యము తెల్లవాఱు వఱకు నుండును. ఆమె మొదలుపెట్టుటయే నడిరాత్రి మొదలు పెట్టును. పట్టణములో దొంగలు యథేచ్ఛముగా సంచరించ వచ్చును. పూర్వము రెండుసార్లట్లే జరిగినది కదా!"

"అదేమిటయ్యా! ఆమె నాట్యమారంభించకమునుపు దాని తమ్ముఁ డెవ్వఁడో సంగీతము పాడుచుండును. వాఁడు గంటన్నర తోమును. సభలో నందఱు నొకటే యల్లరిచేయు

చుందురు. వానిని దిగిపొమ్మందురు. ఈలలు వేయుదురు. వెనుకటిసారి యొకటి రెండు చెప్పులుకూడ విసరిరి. వాఁడు కదలఁడే, కొందఱి యుపన్యాసములవలె!"

"నాట్యములో నిదొక నేర్పయ్యా. అందఱు నామె కొఱకు నెదురుచూచుచు నెదురుచూచుచు నుందురు. వీరి యభిలాష మితిమీఱిపోవును. అప్పు డామె యొక్కసారి రంగముమీఁది కవతరించినంతనే యందఱిప్రాణములు శాంత పడును. ఆమెచేసిన ప్రతి యభినయము దప్పికొనియున్న వీరి ప్రాణములకు నమృతాయమానమగును. విద్యలోపల నైపుణ్యము వేఱు. ప్రదర్శించుటలోని నైపుణ్యము వేఱు. దీనిని రచనాశిల్ప మందురు. ఒక్కొకప్పుడీ రెండవ నైపుణ్యము సమృద్ధిగానుండి మొదటినైపుణ్యము లేకపోయినను నష్టము లేదు. పద్యము మధురముగా వ్రాయు కవిలో భావ మున్నదో లేదో యెవనికిఁ గావలయును? నూటికిఁ దొంబది తొమ్మిదిమంది యెద లోతులేనివారే. వారికిఁ బైమెఱుపులే కావలయును. దానికి మన హీరా నిధి."

"అది యేమయ్యా! రంగమున కవతరించుటలోననేయొక ప్రక్కగా నేదో వంగి కన్నుమీటుచు నొక విచిత్రమయిన నవ్వు నవ్వుచు సభలోనున్న ప్రతివానినిఁ దాను ప్రేమించు చున్నట్లు ప్రవేశించునేమి? ఒక కీర్తన పూర్తిచేసి మరలఁ దెర వెనుకకుఁ బోవును. ఆ పోవునపుడు రకరకముల యొయ్యార ములతోఁ బోవును. సభకంతకును గలిపి యొక ముద్దు విసరును. ఆ విసరుటలో దానికన్ని లేమయ్యా! సభలోనున్న యన్ని

వేలమందికిఁ దగినంత ప్రేమ కామవాంఛ నిండియుండును. అరే! యందఱును బంచుకొనినను మిగులునట్లుండును నే!జన్మతోఁ బుట్టవలయును."

"ఆ కీర్తన లేమి కీర్తనలు! మనభాషలోని కీర్తనలవలె నుండవు. కీర్తనప్రాణమంతయుఁ బల్లవిలో నుండునట్లుండును. కీర్తనలోని చరణములన్నియుఁ జిన్నవి. చరణములోనియర్థము చేతఁ బల్లవిలోనిమాటలలోని యర్థమునకుఁ జక్కిలిగిలిపెట్టి నట్లుండును. పైగా పల్లవిలోని చివఱి రెండుమాటలో యొక మాటయో విచిత్రములైన యర్థములిచ్చును. ఆమె యొక విచిత్రమయిన భంగిమతో నొకలయలోసాచి ముడిచి యుచ్చరించును. దానితో వీరికిఁ గంగారెత్తిపోవును. సభలోనున్న ప్రతివానికామభావన యంతయుఁ ద్రవ్వి బయటకు దీసినట్లుండును. సృష్టిలోనున్న నూటికిఁ దొంబదిమంది యనధిగత వాంఛులే కదయ్యా! వారి వాంఛాపరిపూర్తికి హీరానాట్యముల వంటివే సాధనములు."

ఆ కీర్తనలలోని భావములు సభ్యములాయసభ్యములా? రెండును గావు. దీని పొలిమేరయు దాని పొలిమేరయు గలిసిన చోట నుండును.

ఈ రమ్యతయంతయు నా భాషలో నున్నది. ఆ భాష యనఁగా నా జాతియొక్కమనుగడయొక్క, యా జాతియొక్క వాంఛలయొక్క, యా జాతియొక్కలక్షణములయొక్క యా విశ్వకృతిస్వరూపము.

హీరానాట్యముయొక్క పట్టాభిషేకదినమునందలి యేర్పాటులోని ప్రాధాన్య మిది కాదు. ఆ ప్రాధాన్య మిది.

హాంగ రాజమతము దేశమునందు మూలమూలల వ్యాపించి యున్నది. దాని వ్యాప్తి బహువిధములుగాఁ జిత్రవిచిత్రము లుగా నున్నది. దేశములో నా మతములోఁ జేరినవారిసంఖ్య మిక్కిలి తక్కువ. కాని యీ మతముయొక్క యభివ్యాప్తి చాల విలక్షణముగా నున్నది. గుణనగర దేశవాసు లందఱు మాంధాతృమతస్థులు ఈ మాంధాతృమతములోఁ బ్రార్థనలు లేవు ఏదోకర్మమును వారు చేయుటయే. ఆ ధర్మముయొక్క స్వరూపము తత్త్వాపుర్వులచేత నిర్ణీతమైయున్నది. అది కాల స్వరూపమైన మహిమ. ఈ సృష్టి కాలాధీనముగా సాగుచున్నది. మనుజులు మేలుకొందురు. నిదురపోదురు. మేల్కొనియున్న ప్పుడు స్వకర్మమునందు వ్యగ్రులైయుందురు. నిదురపోవునప్పు డెవ్వరుచేసెడిది యేమియును లేదు. పవలు మేల్కొనియుందురు. అది క్రియాకాలము. స్థూలముగాఁ జూచిననైనను మానవుని ప్రవృత్తి కాలాధీనమని తెలియుచున్నది. సూర్యుఁడున్నంతసేపు పనిచేయుట, లేనపుడు నిద్రపోవుట. సూర్యచంద్రులిద్దఱును గ్రహ ములు. వారిచేతఁ గాలము నిర్మింపఁబడుచున్నది. సూర్య చంద్రులవంటి యితర గ్రహము లున్నవి. ఆ గ్రహము లింత స్థూలముగాఁ గన్పింపవు. ఈ సూర్యచంద్రులిద్దఱు జాగ్రన్ని ద్రలను బాలించుచున్నట్లు తక్కిన గ్రహములు తక్కిన ప్రవృ త్తులను బాలించుచుండును. ఈ సూర్యచంద్రుల కుదయాస్తమ యములు కలవు. ఆ వేళల కొక ప్రాముఖ్యమ్ము. అట్లే సర్వే తర గ్రహముల యుదయాస్తమయములు తజ్జ్యోతిః ప్రమాణ ములు జీవకోటులయొక్క క్రియాకలాపములను బాలించుచుం డును. ఈ మహావిషయము మాంధాతృమతనిర్మాతలైన

ప్రాచ్యులు సృష్టిరహస్యముగా భావించి పరిశోధనచేసి నిర్ణయించి మాంధాతృదేశస్థజీవరాశికిఁ గొన్ని కర్మకాండలు నిర్మించిరి. తదనుకూలమైన ప్రవృత్తిని శాసించిరి. హంగరాజ మతమున కీ దృష్టి లేదు. వా రేకేశ్వరోపాసకులు. ఆ యీశ్వరునిఁ గొన్ని వేళలయందుఁ బ్రార్థనచేయుటతో వారికి సరిపోవును. అందులో సౌలభ్యమున్నది. నీ బ్రదుకు నీవు బ్రదుకుచుండవచ్చును. నీ కామాదిప్రవృత్తులందు నీవు విహరించుచుండవచ్చును. దినమున కొకసారియో రెండుసార్లో యా యీశ్వరునిఁ బ్రార్థించుచుండవచ్చును. మాంధాతృమతములో నట్టిది కుదరదు. సర్వవేళలయందు బహుకర్మలు నియమితములయియుండుటచేత జీవునకు స్వాతంత్ర్యమే లేదు. ఇన్ని శృంఖలలయందుఁ గిట్టబడి మానవుఁడు బ్రదుకుట తనకు దుఃఖకరముగాఁ దోఁచును. రహస్యము తెలియని జీవుఁడు వీనినుండి విడుదలయే వాంఛించును. అట్టి విడుదలను హంగరాజమతము కరతలామలకముగా గోచరింపఁజేసెను.

అందుచేత సర్వజనులకు బాహ్యాభిమానము హంగరాజ మతమునందు నెలకొనియుండెను. ఆంతరమైన యభిమానము స్వమతమునందుఁ గలదు. ఈ యాంతరమయిన స్వమతాభిమానమెందుకున్నదనఁగా వారు మాంధాతృదేశజీవులు. తజ్జీవగతలక్షణమై తద్రక్తగతగుణమై తత్సంప్రదాయ ప్రతిష్ఠాపితమై సంఘబలనియతమై వృద్ధపరంపరానిభృతాజ్ఞానిబద్ధమై యా మతము మాంధాతృదేశగతప్రాణులయందు వదలిపోలేకుండ నున్నది. కాని బాహిరములైన సర్వపరిస్థితులు సర్వప్రవృత్తి మార్గములు హంగరాజమతానుకూలమై వెలసినవి.

జీవునియొక్క ప్రవృత్తి విచిత్రముగా నుండును. అది యంశలంశలుగా విభజింపఁబడియుండును ఏకాంశమునందుఁ బరమతసంబంధి బహుభావములయొక్క ప్రాచుర్యముద్ర కలిగి నపుడు జీవితమంతయు వానిచేతనే పరిపాలింపబడుచున్నట్లు కనిపించును. తన్ముద్రాముద్రితములైన మనోలక్షణములు కూడ నా ముద్రలయొక్క గాఢతా ప్రభేదములవలన భిన్నములుగా గోచరించును.

ఒకానొకఁడు మాంధాతృమతమును బరిత్యజించలేము. సర్వాచారములను హంగరాజమతానుకూలముగఁ జేయును. ఇంటిల్లిపాతిక యట్లే చేయుచు ఆ మతమును స్వీకరించలేదనుట యొక్కటియే మిగిలినది. చావు పుట్టుకలు, పెండ్లి పేరంటములు సర్వమునందు హంగరాజమతాచారములు, విశ్వాసములే ప్రాముఖ్యము వహించియుండును. ఆ మతమును మాత్రము స్వీకరించలేదు. ఎందుకు స్వీకరించలేదో తెలియదు. ఇది యొక ముద్రాలక్షణము. ఇట్టి లక్షణములుకల యా కుటుంబమువారికి బంధుమిత్రులు వారితోఁ బెట్టికొన్న సంబంధబాంధవ్యములు విచారించినచో నీ ముద్రాలక్షణములయొక్క భిన్నత్వము తెలియఁగలదు. కొందఱు బంధువులు వారితో సంబంధబాంధవ్యములు తెగఁద్రెంచికొనిరి. ఈ రెంటికి వారు రారు. వారి యిండ్లకు వీరు పోరు. మార్గములోఁ గనిపించినను నొకరొక రిని బలుకరించుకొనరు. ఇంకొకరకము బంధువులు రాక పోకలు సేయరు కాని, కనిపించినప్పుడు బంధువులవలెనే మాటాడుచుందురు. కొంద ఱూఱకే వత్తురు. భోజనభాజనాదులు చేయరు, మరికొంద ఱల్పాహారములు మొదలయినవి

చేయుదురు. భోజనములు చేయరు. కొందఱు భోజనములు చేయుదురు. వారికి వారికినిచ్చిపుచ్చుకొనుటలు లేవు. దీనితాత్పర్యమేమనఁగా దేశమంతయుఁ గొద్దియో గొప్పయో హూంగరాజ మతచిహ్నములు లేకుండలేదన్నమాట ఇంత హూంగరాజ మతముద్రితముగుటకుఁ బ్రధానకారణ మేమిటని ప్రశ్న. ఆ దేశములోఁ బ్రధానమయిన విద్య హూంగరాజభాషలో నేర్పఁబడుచున్నది భాష యనునది యొక పెద్ద వల. పల్లెవాఁడు సముద్రములో నొక వలను విసరివేయును. వలలు త్రాళ్లతోఁ జేనుదురు కదా! దానికి నడుమ నడుమ సందులుండును. వల వేయుటలో నొక లక్షణమున్నది. ఒక వందగజములమేఱ పోగలవలను బల్లెవాఁడు విసరివేయును. విసరివేసినపుడు మింటిలో వందగజములమేఱ కఱ్ఱవలె వల కనిపించును. అది విసనకఱ్ఱవలె విచ్చికొనినంతనే వందగజములపొడుగు తగ్గిపోవును. ముడుచుకొని నీళ్లలో వ్రాలినపు డేబదిగజముల మేఱనే వ్రాలును. వలచివళ్ళయందున్న బరువులచేత నీళ్లలోకి దిగినను నట్టడుగునకుఁ బోదు. అడుగుచేప లిందులోనికి రావు. వలలోఁ దగుల్కొని యీ వలబెజ్జములలోనుండి తప్పించికొనిపోవుటకు మించిన ప్రమాణముగల చేపలే యందులోఁ దగుల్కొనును. ఆ పెద్దచేపలనడుమఁ దగుల్కొని బెజ్జములు దగ్గఱలేక వదలించుకొనలేక పల్లెవాఁడు వలలాగినపుడు చిన్నచేపలుకూడ వానితోఁ గలసివచ్చును. ఒక దేశములోఁ బరదేశము వేసిన తన భాషయన్న వలలోఁబడిన మానవులస్వరూప మీ చేపలవలె నుండును.

భాష వట్టి వలగాని వలను విసరుట యెట్టిదనఁగా నా

భాష వచ్చినవారికే యుద్యోగము లిత్తుమనుట. అందుచేతఁ బెద్దచేప లుద్యోగులు. మొఖాసాదారులు. మహాధనవంతులు. మంత్రులు. రాజ్యాంగగతపరిపాలనలోని బహుశాఖలలోనున్న యున్నతపదవీస్థితులు. వీరిలో నిజమునకు మహాధనవంతులను జేర్చనక్కఱలేదు. కాని వారియంతటవారు వచ్చి వలలోఁ జేరుదురు. వారికి ధనమున్నది. పెట్టుబడులున్నవి. వ్యాపార మున్నది. అవి చక్కఁగా సాగవలయునన్నచో వానియందు లాభములు సమకూడవలయునన్నచో, నా మంత్రులమీఁద నా యుద్యోగులమీఁద నాధారపడియున్నది. తమ పనులఁ దొందఱగాఁ జేయించికొనుటకుఁ దమ వ్యాపారములయం దధికఫలము కలిగించుకొనుటకు వీ రా మంత్రులమీఁదఁ బెద్ద యుద్యోగులమీఁద నాధారపడియున్నారు. వారి మెప్పు దలమీఁద నాధారపడియున్నారు. దాన వారి వేషభాషాదుల నవలంబింతురు. క్రమముగా నది యలవాటగును.

భాషయనఁగాఁ బ్రధానముగా రెండు విధములు. ఒకొక్కభాష యొకొక్కజాతికి సంబంధించినది. ఒక జాతి యనఁగా నిహపరములు రెండును భావించిన జాతియే నాగరక జాతి గదా! ఆధునికకాలమునందుఁ బ్రగతిశీలమై తాము పరమ నాగరకమైనస్థితిని బొందితిమని చెప్పు నాగరకజాతి యెట్టి దయినను, ననాదినుండి వచ్చుచున్న నాగరకజాతులు మాత్రము నిహపరములను రెంటిని జోడించి జాతినిర్మాణము చేసికొన్న వే. అందుచేత సర్వ పూర్వనాగరకజాతులయొక్క భాషల యందును రెండురకములైన శబ్దజాలము లుండును. ఒకరక మయినది యా జాతియొక్క పారలౌకికవిశ్వాసములయం

దున్న భిన్నాంశముల నర్థముగాఁ గల శబ్దజాలము. రెండవది యిహలోకసంబంధమయినది. చెప్పినపుడు విడివిడిగాఁ జెప్ప వచ్చును గాని, నిజముగా విచారించినచో నీ రెండువిధములైన శబ్దములు పెనఁగొనియుండును. కొన్ని శబ్దము లుభయథా ప్రయోగార్థములై యుండును ఈ శబ్దజాలములో ననేక విధములుండును. కొన్ని సంఘజీవనమునుగూర్చి చెప్పును. కొన్ని నీతి నియమాదులనుగూర్చి చెప్పును. కొన్ని మాన వుని యైహికసుఖాదులను జెప్పును. కొన్ని పారలౌకికసుఖా దులను జెప్పును. ఇహలౌకిక పారలౌకిక సుఖాదులను జెప్పు మాట లుభయథా ప్రయోగార్థములుగా నుండును. కొన్ని శబ్దములు మనఃప్రవృత్తిని గూర్చి చెప్పును. ఇట్టి గూఢార్థ సన్ని వేశములుగల కొన్ని శబ్దము లేజాతిభాష కాజాతిభాషకు విడివిడిగా నుండును. ఆ జాతియొక్క నిర్మాణకాలమునందలి తత్పూర్వ మేధావుల నిశ్చితాభిప్రాయానుబంధులుగా నుండును. ప్రతి జాతిసారస్వతము సారస్వతరమ్యతకలిగిన సర్వగ్రంథములయందును నిట్టి శబ్దసముదాయముయొక్క బాహుళ్యము కలిగియుండును. భాష వేఱు, సారస్వతము వేఱు కదా! భాషయనఁగా నట్టి శబ్దములు, నర్థములు. సారస్వత మనఁగా నా జాతియొక్క విశ్వాసములను తదుచిత రమ్య భాషలో నా విశ్వాసములయొక్క గాఢత్వము రమ్యముగా భాసింపజేయునర్థములతోఁ జెప్పునది.

ఇంత నిగూఢమయిన వలను హంగరాజు మాంధాతృ దేశముమీఁద వేసెను. ఆ వలలోఁ జిక్కుకొనుట కూడ నొక సుఖమనిపించునట్లు వేసెను. వాఁడు వలలాగినపుడు పెద్దపెద్ద

చేపలు నీరువదలి గిలగిలకొట్టుకొనును. ఆ గిలగిలకొట్టుకొనుట కూడ నొక విశేషముగా భాసింపఁజొచ్చెను. ఎప్పుడు నీళ్లలోనే యున్న యీ చేపకు గాలి, వెలుతురులు కనిపింపఁజొచ్చెను. నీవు పోయి యీ చేపతో నోసి మత్స్యరాజమా! నీవు నీ స్వస్థానమువదలి గిలగిలకొట్టుకొనుచున్నావని చెప్పుము. ఆ చేప ఇట్లు బదులు చెప్పును "ఓరి పిచ్చివాఁడా! నేను నీళ్లలోఁ గూడ నిట్లే కొట్టుకొనుచుంటిని. నేను నీళ్లలోనుండఁగా జూచెడిశక్తి లేదు గనుక నే నిచటఁ గొట్టుకొనుచున్నానని నీ వనుకొనుచుంటివి. నా కిప్పుడొక క్రొత్త యనుభూతి కలుగుచున్నది. గాలి వెలుతురులు నే నెఱుఁగను. ఇప్పుడు నేను వాని ననుభవించుచున్నా"ననును. నీవు నిరుత్తరుఁడవగుదువు. మొగమోటము లేనివాఁడు, అధిక ధిషణారమణీయుఁడునయినవాఁడు మఱియొకఁడా చేపతో నిట్లనవచ్చును. "కాని యో మత్స్యావతారమా! ఒక భేదమున్నది చూడుము. ఆ గాలి వెలుతురులు లేని నీళ్లలో నీ వెక్కువకాలము జీవింతువు. ఈ బయటఁ బది నిముసములు బ్రదుకుట దుర్ఘటము." కాని యీ చేప యిట్లనును. "ఇంత స్వేచ్ఛతో సమృద్ధియైన గాలి వెలుతురులతో నిమేషజీవనమే చాలు"నని. ఇట్లనుటలో నొక చమత్కారమున్నది. నిజముగా నిమేషజీవనము తనకుఁ జాలునని కాదు. ఇది జీవకోటియొక్క మాయామయమైన భావకల్పనము. జీవుఁడు తనకుఁ జావులేదనియే యనుకొనుచు జీవించుచుండును. ఇంతకంటె నింకొకవిధముగాఁ జెప్పుట యుక్తము. వాడు నిమేషసుఖభావుఁడు. వాఁ డనంతసుఖమును వాంఛించఁడు. వాంఛించును

గాని దానికొఱకుఁ బ్రయత్నించఁడు. తన్నిమేషసుఖానుభవ పరమార్థ మనోలక్షణము కలవాఁడు.

దీనివలన భాష యనఁగా వట్టి భాష కాదు యని యను నర్థము తేలినదిగదా. ఈ భాషలో రెండుమూడు ప్రధాన విషయములున్నవి తదితర ప్రధానవిషయములు భాష యని పించవు గాని, యవియు భాషవంటివే. సంగీతము, సాహిత్యము, శిల్పము, నాట్యము—నీ నాల్గును భాషారాశిలోనివి. సాహిత్య మునకు భాష యెంత ప్రధానమో సంగీతమున కంత ప్రధానము కాదు. కాని యది భాషతోఁ గలసియేయుండును. భాషా ప్రాధాన్యము నాట్యములో మఱికొంత తక్కువగానున్నను దానిలోఁగూడ నేకొంచెమో భాష యుండనే యున్నది. నాల్గవదియైన శిల్పము మాత్రము భాషావిరహితమైనదిగానే గానిపించును. కాని సాహిత్యముయొక్క పరమార్థము దాని యందున్నంత సాహిత్యమునందే లేదు. ఇందులోని రహస్యము కొంచెము వివరణము కావలసిన విషయము. శిల్ప మనఁగాఁ గుంచెలతో వేయు బొమ్మలు. ఉళ్ళతోఁ జెక్కెడి విగ్రహ ములు. ఒకానొక కవి యెప్పుడైనను స్వజాతిమతసంప్రదాయ బాహుళ్యప్రతిబింబము కాని వస్తువును దీసికొని కావ్యమును వ్రాయవచ్చునుగాని, శిల్పిమాత్రము వ్రాసిన ప్రతి బొమ్మయుఁ జేసిన ప్రతి విగ్రహము స్వజాతిమతాది సంప్రదాయములలోని పరమార్థభూతములైన విషయములకే రూపములిచ్చుచుం డును. భాషయన్నట్టివల వేసినాఁడనఁగా దాని పరిణామ మిట్టిది.

**గుడనగరములోని మహాధనవంతులు గొప్ప వర్తకులు.**

వేరిమీఁద దేశముయొక్క సంపద యాధారపడియున్నదో, వేరి యధికార్యములవలన రాచఱికమున పండని బహుప్రజాక్షేమ విషయము లనంతములు నిర్మింపఁబడి కొనసాగింపబడుచుండునో, యుద్యోగాదులు లేకుండ రాజ్యము లెవరు పాలించుచుందురో, మహోద్యోగులు మంత్రులునుగూడఁ దమ యుద్యోగములను నిలఁబెట్టికొనుటకు వేరిస్థితిమీఁద నాధారపడి యుందురో అట్టి ధనవంతులు, నట్టి మహావర్తకులు నీ వలలో నిస్సంశయముగా దగుల్కొనియుందురు. ఇది పరిహరింపఁబడరాని యన్యోన్యాశ్రయదోషము.

ఇట్టి మహావర్తకులు గుజరగరములోఁ బాతికమంది కలరు వారిలో నైదారుగురు మఱియు ముఖ్యులు. కారణము వలలో బలముగాఁ దగుల్కొనియున్నవారగుట. అందుచేత మఱియు ధనవంతులనుట. వారందఱు హీరానాట్యమునకు వశంవదులు. హీరాకుదాసులవంటివారు. ఒకఁడొక్కఁడొక్క విధమయిన దాసుఁడు.

గిరిధరుఁడని పెద్ద వర్తకుఁ డున్నాఁడు ఆయన కఱువది యేండ్లు నిండఁబోవుచున్నవి. అతఁడు తన ముప్పదియైదవ యేట నొకానొక స్త్రీని ప్రేమించెను. అప్పటి కతఁ డింత ధనవంతుఁడుకాడు. ఇప్పుడు రాష్ట్రములోనున్న నలుగురైదుగురు మహావర్తకులలో నతఁ డొకఁడు. ఆ యువతికిని నతనిభార్యకును బడలేదు. ఎప్పుడును బడదు. పడకపోవుటలో నాశ్చర్యమేమి యున్నది. ఈ యిద్దఱితో నతనిజీవితము నడివయస్సులో నడిమింటిసూర్యుని యాతపమందు మలమలమాడినది. ఆ యుంచికొన్న స్త్రీ దైవవశమున నైదేండ్లితనితోనున్న యనంతరమున

మరణించినది. ఆమెకు సంతానములేదు. తల్లిదండ్రులు లేరు. తోఁబుట్టువులు లేరు. ఒక పెద్దన్నగారుండెడివారు. ఆ యన్నగారును వారిబాల్యమునందే చనిపోయిరి. ఆనాటికి వారికి రెండేండ్లకుమారుఁడు కలఁడు. గిరిధరున కామెతోడి పరిచయముకలనాటి కా పిల్లవానికి నాలుగేండ్లు. ఆమె చనిపోయినాటికిఁ బదియేండ్లు. గిరిధరున కామెమీఁదగల ప్రేమ యంతయు నీ పదియేండ్ల పుత్రవానిపై మరలినది. అతఁడు మాంధాత్రుమతస్థుఁడే కాని, చిన్నప్పటినుండి యదుపాజ్ఞలలోఁ బెరుగక పోవుటచేత, గిరిధరునియాశ్రయమువలనఁ దన మేనత్తకు వచ్చుచున్న ధనమును యథేచ్ఛముగా వ్యయపెట్టు టకు వీలుగుటచేత వాఁ డాగమ్మకాకివలెఁ బెరిగెను. తన ప్రియురాలు మరణించుటతోడనే గిరిధరునకు వాని యాగమ్మ కాకితనమును ప్రియమైనది. వానిపేరు రంగీలా. అసలు పేరేమో తెలియదు. ఈ పేరే వానిపేరయ్యెను. అతనికిఁ బదియేండ్లు వచ్చువఱకు వాఁడు హంగరాజమతస్థుల సంగీతము, నాట్యము, వాద్యములలోఁ గొంత పరిచయముకల వాఁడై యుండెను. వాద్యములలో మంచి చొరవకలవాఁడని నలువురును జెప్పుకొనఁజొచ్చిరి. గిరిధరుఁ డతని యా విద్యను బ్రోత్సహించి వాని కెప్పుడు కావలసిన నప్పుడు ధనమొసంగు చుండెను. ఈలోపుగా గిరిధరుఁడు లక్షాధికారి కోటీశ్వరుఁడు కాఁజొచ్చెను. గిరిధరుని మామయనియే పిలుచును. రంగీలా వేషభాషాదులన్నియు హంగరాజమతస్థులవి. వానిహృదయము మాంధాత్రుమతముది. వాఁ డాత్మలో గిరిధరునకు బానిస. పైకి గిరిధరునిమీఁద నధికారముకలవానివలెఁ గనిపిం

చును. ఆ రంగీలా కిప్పుడు పాతిక ముప్పదియేండ్ల వయస్సు. వాఁ డిప్పుడు హంగరాజీయసంప్రదాయగానసభలోఁ బెద్ద వాద్యగాఁడు. గొప్ప గానసభ జరిగిన. గొప్ప నాట్యము జరిగిన వానివాద్యము లేకుండ జరుగదు. ఒక్కసభలో నతఁడు వాయించినచో రెండుమూఁడువందల రూపాయిలకుఁ దక్కువ పుచ్చుకొనఁడు. నాట్యములకు నతఁడు సామాన్యముగ వాద్యము నంగీకరించఁడు. అది యతనికి మర్యాదానష్టము. కాని హీరానాట్యమునకు రెండుసార్లును వాయించెను. రంగీలా వివాహముచేసికొనలేదు అతఁడు యథేచ్ఛాప్రవృత్తిగా మసలుచుం డెను. అతనికంటె సుబారాఖర్చువాఁడు సృష్టిలో నుండఁడు. ఆనాఁడు మూఁడువందలు వచ్చును. మఱునాటికిఁ జేతిలో మూఁడుచిల్లిగవ్వ లుండవు అతని కొక ప్రేయసి గలదు ఆమె కొకసారి మూఁడు వేలరూపాయిలు కావలసివచ్చెను రంగీలా యీయవలయును. రంగీలాకు గిరిధరుఁ డీయవలయును. గిరిధరుఁ డంతమొత్తము రంగీలా కెప్పుడు నొసఁగలేదు. రంగీలా గిరి ధరునితో హీరానాట్యమునుగూర్చి ప్రశంసించెను. ఆమె యెంత నాట్యకర్త్రె కాకపోయినచో నేను వాద్యము వాయించుట కంగీకరింతున నెను గిరిధరునకు నచ్చెను. తొలిసారి హీరా నాట్యమును గిరిధరుఁడు చూచెను. రూపలావణ్యాదులచేత హీరా రంగీలామేనత్తవలెఁ గనిపించెను. గిరిధరుఁడు వశంవదుఁ డయ్యెను. కాని గిరిధరునకు గడచిన యెనిమిదేండ్లనుండి యుబ్బసము పట్టుకొనెను. ఏ యౌషధమును బనిచేయలేదు. ఔషధములకొఱకు వేలకొలది వ్యయమగుచున్నది. వేలతో బాటు శరీరములోని జవసత్త్వములును వ్యయమగుచునే

యున్నవి. కాని వృద్ధిపొందుచున్నది కామవాంఛ. హీరా గిరిధరునివద్దకుఁ దన యౌవననష్టము లేకుండ నధిక ధనసమార్జనోపాయము చూచినది. మొదటి రెండేండ్లు గిరిధరునినుండి యెంత సంపాదించినను సంపాదించెను. అతఁడు క్రమముగాఁ గోటీశ్వరుఁడగుటలో నతని మనోలక్షణ మున్నది. ఆ మనోలక్షణములోఁ గొంతమేరకయిన వెనుక ముందులు చూచికొనులక్షణ మున్నదన్నమాట. తన వ్యర్థమైన కామన తాను హీరాకిచ్చుచున్నడబ్బునకు సంబంధము కనిపించలేదు. వెనుకకు మరలినాఁడు. ధనమిచ్చుట తగ్గిపోయినది. అనుభవించు శక్తి తొలుతనుండియు లేదు. కాని మనస్సులో హీరామీఁద నున్న వాంఛకు మాత్రము కొఱత లేదు. హీరానాట్యమున్నచో నతఁడు నిస్సందేహముగా నచట కూడిపడును. అతనినుండి తొల్లిఁటివలె ధనప్రాప్తిలేకున్నను హీరాయును నతనియందుఁ బ్రేమాభినయముచేయుట మానదు. ఈ గిరిధరుఁడు చిత్రమయిన పురుషుఁడు. ఇతఁడు వల్లభమంత్రికిఁ బరమాప్తుఁడు. వల్లభమంత్రి కనుసైగజేసినచో లక్షలు కురిపించును. ఎక్కడయే రహస్యవార్తయైనను రాజకీయమయినచో వల్లభమంత్రికిఁ జేర్చును. రంగీలా మామవద్దకుఁ బోయినప్పుడు హంగరాజ సంప్రదాయగానవిద్వాంసులయు నాట్యకర్త్రులయుఁ గథలు వందలు వేలు గిరిధరునితోఁ జెప్పుచుండును.

రెండవ మహావర్తకుఁడు వీరేశ్వరుఁడు. ఇతనితండ్రి పెద్ద వ్యాపారి. కొడుకునకుఁ జిన్నప్పుడు సంగీతము నేర్పించెను. తండ్రి వీరేశ్వరునిపదునెనిమిదవయేటనే చనిపోయెను. వర్తకము వ్యాపారమంతయు వీరేశ్వరునినెత్తిమీఁదనే పడెను. వీరేశ్వ

రుఁడు సంగీతమును మఱచిపోలేదు. దానికై పైసా వ్యయ పెట్టఁడు. లోభియని యొకఁడు సృష్టిలో నున్నచో వానికంటె మించినలోభి యుండఁడు. అతనికి వల్లభమంత్రియన్నచో మహాభయము. తాను స్వంతముగాఁ బోయి వల్లభమంత్రి నెన్నఁడు దర్శించఁడు. వల్లభమంత్రి వార్తపంపినచో రెండుజాముల వేళ మాసినయంగరఖాయుఁ జిఱిగినధోవతి ధరించి పదిదినములనుండి యారోగ్యము సరిగాలేనివానివలెఁ బోయి మంత్రిని దర్శించును. ఆయన లక్షయో రెండులక్షలో యడుగును. ఇతఁడు లేవనును. తనచేతఁ గాదనును. తన్ను రక్షింపుమనును. వల్లభుఁడు నీవద్దలేని వో వలదులే యనును. మఱునాఁడు వీరేశ్వరుఁడు రెండులక్షలును వల్లభమంత్రికిఁ బంపించును. ఆ పంపించునప్పుడు వీరేశ్వరుని జూడవలయును. తనను పేయిఁ తిట్టుకొనును. వల్లభమంత్రిని రాక్షసుఁడనును. యముఁడనును. ఎన్నిసార్లన్నను నీ రెండుమాటలే.

ఈయనకు సంగీతముమీఁద నభిమానము కలదని యందఱకుఁ దెలియును. పెద్ద సంగీతసభలు జరిగినపుడు వానివద్దకు వచ్చి ప్రవేశపత్రము లమ్ముదురు. అతఁడు రెండుపత్రములు నిశ్చయముగాఁ గొనును. అది మూఁడు నాల్గుదినముల తతంగము. గంటసేపు స్వస్తి చెప్పించికొని సాయంతన మొక వేళకు రమ్మనును. ఆ వేళ కతఁ డుండఁడు. మంచముమీఁదనుండి నిద్ర లేచు వేళకుఁ బట్టుకొందురు. అతఁ డెప్పుడును గొన్నివందలు తలక్రిందబెట్టుకొని నిద్రవోవును. ఒక వందరూకలు వారి మొగమునఁ బారవేసి యా రెండుపత్రములు కొనును. అతని ధనముయొక్క విడుదలమార్గము లివి రెండే. మూఁడవది

నాలుకకఱచికొని చచ్చినను, లేదు. అవి లక్షలు, నివి వందలు. ఈ రెండువవిడుదలలోఁ బ్రవేశపత్రము లమ్మటకు వచ్చిన వారిలోఁ దక్కువకష్టముతో వందరూకలు పుచ్చుకొనివెళ్ళిన వారొక్కరే—హీరానాట్యము నేర్పాటుచేసినవారు. ఇతఁడు గిరిధరునివంటికోటీశ్వరుఁడు. హీరానాట్యము జరిగినచో వీరేశ్వరుఁ డచ్చట నుండెనన్నమాటే.

ఇట్టివారు మఱి ముగ్గు రున్నారు. హీరానాట్యమునకు సంబంధించినంతవట్టుకు వారు ముప్వురుకూడ గిరిధర వీరేశ్వరుల వంటివారే. తక్కిన లక్షాధికారులమాట లెక్కయే లేదు. వల్లభమంత్రికి లక్షలు కావలసినచో నీ యెనుగురికి వార్త పంపించును వేలు కావలసినచో దక్కినవారివద్ద కెవరెవరినో పంపించును. ఈ సంగతియంతయు హాంగరాజునకుఁ దెలియును. ఎవరెవ్వరు వల్లభమంత్రియొక్క జాతీయభావసాహాయ్యకులో యెవ్వరెవ్వరు వారిలో హీరాయొక్క క్రీఁగంటిదాసులో హాంగ రాజునకుఁ దెలియును.

# ద్వితీయాధ్యాయము

గూఢాచీనగరమునకుఁ గుబేరదిశయందున్న గుడనగరమునకు వాయవ్యదిశయందున మహాపర్వతములు కలవు. ఆ మహాపర్వతములు గుడనగరమునకుఁగూడ నుత్తరమందు వ్యాపించియున్నవి కాని, వానితోడి యవసరము లేదు. ఆవాయవ్యదిశయందున్న మహాపర్వతములలోనుండి నాల్గయిదు నదులు బయలు దేరును. అవియన్నియు నొక నదిగా రూపుగట్టును. ఆ

మహానది గుమాచీనగరమునకుఁ బ్రక్కనే ప్రాగ్దిశగాఁ బ్రవహించుచుండును. ఆ మహానది కనేకములయిన యానకట్టలు గలవు. తీగమల్లుకొనినట్లల్లుకొనిన కాల్వల పెంపుచేత గుమాచీనగరము చుట్టునఁ గొన్నివందల మైళ్ళ దేశము బహుసస్యదాయియై యుండెను. గుడనగరము చుట్టున నదులే లేవు. ఇది యంతయు మెట్ట దేశము. ప్రత్తి పండును, జనపనార పండును. రాగులు పండును. ఇచ్చటనున్న రైతులందఱు పేదవారు. ఈ రాజ్యమునకుఁ బ్రధానమయిన యాదాయము గుమాచీనగర ప్రాంతసస్యక్షేత్రములనుండియే రావలయును. కాని యనాదినుండియు నీ రాజ్యమునకు గుడనగరమే రాజధాని. దేశమున కంతకు నిది నడిమిస్థలమని పూర్వు లేర్పాటుచేసికొనిరో యేమో! లేక యా మహానది కానకట్టులుకట్టి కాల్వలు త్రవ్వించని పూర్వకాలమున రెండు దేశములపంట లొకేవిధమున నుండెనో యేమో! శశి వివస్వంతులతండ్రి మాంధాతృరాజు గుడనగరపరిసరములఁ గూడ ఫలవంతములఁ జేయుటకుఁ జాల ప్రయత్నములుచేసెను. వట్టి రాజ్యదృష్టితోఁ జేసెనో, రాజకీయదృష్టితోఁ జేసెనో తెలియదు. గుడనగరప్రదేశమునందు రెండుమూఁడు పెద్ద సెలయేళ్లు కలవు. అవి యెప్పుడును బ్రవహించవు. వట్టి యిసుకతిన్నెలుగా నుండును. ఏ పదేండ్లకో యెప్పుడో వఱదలుగా వచ్చును. ఉన్న సస్యముల బీడ్వాఱచిపోవును. ఈ వఱదల నరికట్టుటకు మాంధాత మిక్కిలి ప్రయత్నములఁ జేసెను. ప్రయత్నములయొక్క గాఢత్వము వఱదలు వచ్చినతరువాత రెండుమూడేండ్లుండెడిది. ఇంతలోఁ బరిసిపోయె

డిది. మఱలఁ బదేండ్లకో పండ్రెండేండ్లకో వఱదలువచ్చినఁగాని మఱల నా భావము కలిగెడిదికాదు.

ఇట్లుండఁగా నౌకప్పుడు మాంధాత యీ యిసుక యేఱులకు గాలువలలక్షణము పట్టించుటకుఁ బ్రయత్నించెను. అన్ని యేఱ్లకు రెండువైపులఁ గట్టలుపోయించెను ఒకటి రెండు వంతెనలుకూడఁ గట్టించెను. జలమూపుటకుఁ దూములకుఁ దలుపులఁ బెట్టించెను. అట్టిప్రయత్న మొకటి వచ్చిన యొక పెద్ద వఱదకు నిర్మూలమైపోయెను. శత్రువులు పరిహాసించుటకు దేశీయులు నిట్టూర్పులుపుచ్చుటకుమాత్ర మా ప్రయత్నములు హేతువులయ్యెను. నేఁడు వల్లభమంత్రి మఱల నా ప్రయత్నముల నారంభించెను. ఈ పని వల్లభమంత్రి కిష్టములేదని దేశమందఱు చెప్పుకొనఁజొచ్చిరి. సస్యవంతమైన ధరిత్రియంతయుఁ దమ్మునికిఁ గైవసముచేసిన విపన్వంతుని దురాశ యీ ప్రయత్నమునకు హేతువని చెప్పుకొనఁజొచ్చిరి అసలే పేదదేశము. ఈ వంతెనలతో నీ కరకట్టలతో నీ నీటి నిలువమేరలతో నీ తలుపులతో వ్యర్థముగా నిర్మింపబడుచున్న యీ కాలువలతో దేశము మఱియు ఋణగ్రస్తమైపోవును. ధనాగారములోనున్న ధనము దీనితో నయ్యవార్లంగారి నట్టిల్లగునని చెప్పుకొనఁజొచ్చిరి. కాని యీ మహాకార్యము దినదినాభివృద్ధిగా సాగుచున్నది. ఇది యిట్లుండగా మరల వఱదలువచ్చునేమో చేసిన కార్యమంతయు వృథాయైపోవునని భయము విపన్వంతున కున్నది. వల్లభమంత్రికున్నదో లేదో తెలియదు. ఏ వంతెనవద్దను నీటినిలువప్రదేశములకుఁ దలుపులు పెట్టనేలేదు. ఒక్కవేళ వఱదలు వచ్చినను నిలువప్రదేశములు

చెడిపోకుండఁ బ్రవాహము నిలువప్రదేశములకుఁ దొలఁగిపోవు నట్లు పెద్దపెద్ద కట్టలువేయుంచిరి. వఱదలు వచ్చినచో వంతెన దెబ్బతినవచ్చును. నిలువప్రదేశములు చెడిపోవు. మఱియు వంతెన కెగువభాగమున నీరు నిలిచితీరవలయును. వంతెన క్రిందఁ గొన్ని యడుగులమేర గోతులుతీసి యా గోతులన్నియుఁ గరిగించిన యినుముతో ఱాళ్ళతోఁ బూరించి పైన గజమెత్తున గోడగా నేర్పాటుచేయఁబడెను. ఆ మట్టమునకు నీరు నిలువవలయును. తక్కిన నీరు పైనుంచిపోవచ్చును.

ఈ యేళ్ళలో నొక్కఁడన్నింటికంటెఁ బెద్ద యేఱు. ఆ యేటికిఁ గుడివైపుననంతయు మైలు మైలున్నరవఱకు నిసుక ప్రదేశమే. అదికూడ నేటికడుపుప్రదేశమే యని చెప్పవలెనుం దువు. కాని యథార్థమున కా యేటిగర్భము ముప్పది యడుగులకు మించిలేదు. ఏటికుడివైపున మైలు రెండు మైళ్ళవఱకు నిసుకదిబ్బయేయైనను వఱదలువచ్చి తీసినతరువాత రెండు మూడేండ్లు దానిపైన నొండు పేరి యిసుకయు నొండును గలిపి యొక రెండడుగులమేఱ దిబ్బగట్టును. దానిమీఁద రెండు మూడేండ్లువ్యవసాయముచేయుదురు.ఏవియోకొన్ని పండింతురు.

వఱదయెద్దడి కుడివైపున నున్నంత యెడమవైపున నుండదు కాని, యొకొక్కప్పుడు వఱదలు రెండువైపులను సమానము గనే జూచును.

అది యాఱువందలమైళ్లు పొడవుగల యేఱు. విశ్వేశ్వరయ్య తొఁడు నీ యాఱువందలమైళ్ళపొడవున నెడమవైపునఁ బెద్ద కట్టపోయించెను. ఇంతపనియు నాలుమాసములలో జరిగెను. ఎడమవైపునఁ గాలువలు త్రవ్వించెను. పొలములు విభాగిం

చెను. ఇంకఁ గాలువలకు నీరు రావలయును. తూములలోనుండి నీరు పెట్టుకొనవలయును. బోదెలకు మళ్ళించుకొనవలయును. పొలములలోనికి గట్టు తొలఁగఁదీయవలయును.

ఇదికాక నదియొక్క కుడివైపున నాలుగైదేఱులు కలవు. అవి యంత పెద్దవికావు. కొన్ని రెండువందలమైళ్లుపొడవుండును. కొన్ని వందయే యుండును. ఇవి దేశములో నడుమనడుమనున్న కొన్ని పెద్దపర్వతములనుండి ప్రవహించును. వివస్వంతుఁడు వానినిగూడఁ గాలువలుగా సిద్ధముచేసెను. ఈ పెద్ద యేటిలో నుండి పెద్దపెద్ద కాలువలు త్రవ్వి వానికిఁ గలిపెను.

ఈ పదకమంతయుఁ జూచుచున్న జనమునకు నవ్వురాక తప్పదు. నవ్వుకలిగించు నొక పనియందు నాశయున్నచో నవ్వురాదు. ఇది ఫలించునాయన్న విచారము కలుగును. ఫలించెడివ్యవహారము కాదని నూటికి నూఱుపాళ్ళు తెలిసి నను నాపయిన కొసరున్నది. దాని పేరే యాశ. ఆ కొసరు ఈ నూఱుపాళ్ళకన్న నతిశయమయినది. దేశీయులమనఃప్రవృత్తులన్నియు నట్లుండెను. నవ్వెడివారు సమృద్ధిగాఁ గలరు. నవ్వెడివారు వేఱు. సంతోషించెడివారు వేఱు. ఏ పనియందుఁ దమకు లాభనష్టములు లేవో వా రితరులుచేసెడిపనిని జూచి నవ్వెదరు. హంగరాజమతస్థులంద ఱిందులోనివారే. ఇంతటి వ్యర్థమైన యీ మహాకార్యమును జూచి సంతోషించెడివాఁ డొక్కఁడే యున్నాఁడు. అతని పేరు హంగరాజు. శశిరాజ్యము శశికి విడివడినతోడనే మఱునాఁడు వివస్వంతుఁడు కాళ్ళు చాచ వలయును. బొక్కసములోనిధన మెక్కడిదక్కడ మ్రొక్కు బళ్ళకు దక్కుచున్నది. హంగరాజునకుఁ గొంచెము పరితాప

మును గలదు. ఇంతటిపనియుఁ దానయినచో నెంతయో కష్ట పడియుండవలయును. విశ్వేశ్వరయ్యఁడు మిక్కిలి సులభముగా జేయించికొనెను. ఈ వేయిచదరపుమైళ్ళమేర కొన్నిలక్షల గ్రామములున్నవి. ఆ గ్రామప్రజలందఱు నీ కాలువలుత్రవ్వట యీ వంతెనలుకట్టుట, ఈ యానకట్టలు నిర్మించుట తమసొంత పనులవలెఁ జేసిరి. ఇది "విశ్వేశ్వరయ్యనిమీఁది రాజభక్తియా? వల్లభమంత్రిమీఁద విశ్వాసమా? ప్రజలందఱ కొక్కవిషయము మాత్రము నిర్ధారితమయియున్నది. ఆనకట్టలు నిస్సందేహముగా నెక్కడికక్కడికి నీటిని నిలువచేయును. నీటినిలువప్రదేశములకు భంగములేదు. కాలువ లెందుకుఁ బ్రవహించవు? వఱదలుతీసిన తరువాత రెండేండ్లవఱకైన నిలువయున్న నీరు పంటల కక్కఱ వచ్చునుగదా! తక్కిన యెనిమిదేండ్లు పూర్వపుఁ బాటయే. ఆ రెండేండ్లు పండించుకొనవచ్చును. నదికిఁ గుడివైపువారు వఱదలుతీసినరెండేండ్లు నిసుకయొండుదిబ్బలమీఁద నెంతో కొంత పండించుకొనుచున్నారు. ఎడమవైపువారే చెడిపోవు చున్నారు. తమకుఁగూడ రెండేండ్లపంటకు లోపములేదు.

వేసిన పదకమంతయు బాగుగనేయున్నది. కాని చిన్న చిన్న యేళ్లు కాలువలుగాఁ ద్రవ్వి పెద్దయేటిని బెద్దపెద్ద కాలు వలతోఁ జిన్నయేళ్లతోఁ గలుపులు జరిగినది. ఇది యంతయు నేటికిఁ గుడివైపున జరిగినది. వఱద కుడివైపున విజృంభించును. ఈ కాలువలు నిలుచునాయని? ఈ కాలువలు నిలుచుటకు విచిత్రమయిన నిర్మాణకౌశలము శాస్త్రజ్ఞులు నెఱపిరి. పెద్ద యేటి యసలుకడుపులోనుండి కాలువలుతీయఁబడెను. ఆనకట్టల కెగువభాగములనుండి తీయఁబడెను. పెద్దయేఱు కాలువ

లోనికి మళ్లుచోట్లు ఆనకట్టలంత నిర్దుష్టముగా నిర్మింపఁబడెను. వఱదలు వచ్చినచో గాలువకట్టలు తెగిపోవచ్చును. మఱికొన్ని యూళ్ల మీఁదికి పోవచ్చును. ఏటినీరు కాలువలలోనికి మఱలు చోటు చెడదు. నీటి నిలువచోట్లు చెడవు. ఈ నిర్మాణములోని రహస్యము శాస్త్రజ్ఞులకే తెలియవలయును. తక్కినవారికి వ్యవసాయమంతయుఁ బరిహాసాస్పదముగా నిస్సందేహముగా నుండును. ఈ మధ్యాహ్నపరిపాంథాపరిదూషితాత్ములయిన ప్రజల యొక్క మూఢత్వమునుగూర్చి పరిహాసమెంతయున్నదో తాను నిరర్థకమనుచున్న పనియైనను దాని నింత సులభముగా వల్లభ మంత్రి చేయించుకొనుచుండెనన్న పరితాపము హంగరాజు నకుఁ బోలేదు. ఈ పనియంతయు వివస్వంతుఁడు చేయించు చుండెనని లోకము చెప్పికొనుచుండగా హంగరాజు వల్లభ మంత్రి చేయించుచుండెననియే చెప్పను. అతనిదృష్టికి వివ స్వంతుఁ డానఁడు. వివస్వంతుఁ డొక యవివేకి. కానిచో శశికి సుక్షేత్రము కట్టఁబెట్టి తా నూసరక్షేత్రము పంచుకొనునా?

శశికి నీ మహాకార్యమంతయుఁ దెలియును. అతనికి సంతోషములేదు. విచారములేదు. పరితాపములేదు. నూటికిఁ గోటి కెప్పుడయినఁ దన యన్నగా రవివేకియనును. గుడ నగరరాజ్యమును గూర్చిన విచార మతని కున్నట్లేలేదు. అతని మనస్సులో నొక్కటియే వాంఛ. ఎప్పటికో యొకప్పటికి గుడనగరరాజ్యము తనక్రిందికి వచ్చునని; రావలయునని; రాక తప్పదని. ఈ భావము వానికిఁ గలిగినదికాదు. ఇది హంగరాజ మతస్థులయొక్క చిరవాంఛ. వారి వాంఛాస్వరూపము మూర్తి

కట్టినరాజు తాను. ఆ హూంగరాజమతస్థులయొక్క వాంఛ యొక్క ప్రతిబింబమే యితనికోరిక.

హూంగరాజమతస్థులవాంఛ యింతియేకాదు. ఆ మతస్థులందఱు తరతరములుగా విడత్లువిడతలుగా హూంగరాజమత స్వీకారముచేసినవారు. మాంధాతృమతస్థులే కొందఱు తమ తరములో మాఱినవారు. కొందఱు తండ్రులతరములో మాఱినవారు. మఱికొందఱు తాతల ముత్తాతలతరములలో...నిట్లు. వారందఱి కొరకు పెనగొనినవాంఛ. సర్వ మాంధాతృదేశము హూంగరాజమతము చేయవలయునని. ఎప్పటికో యది నిస్సందేహముగ నట్లగునని. కొన్ని యేండ్లమీదనాల్గవవంతు తా మైరికదా! తక్కిన మూడువంతులు నగుటకు మఱికొన్ని యేండ్లు పట్టవచ్చును. ఇప్పుడు దానికి మఱియు నవకాశము వచ్చినది. తాము విడిపోయిన తరువాత గుడదేశము రుద్రభూమి. దానికిందగిన ట్లీ కాల్వలు, ప్రణాళికలు. తామమను శ్మానము బొమికమాత్రము మిగిలిన గుడదేశపుసంపత్తికి నీ ప్రణాళికలను పండ్లతో గీఱికొని యంటి యెండియున్న పలుచని మాంసపుబొఱకూడ లేనట్లుచేయుట.

ఒక్క యసదబలుడు మిగిలియున్నాడు. అతనికీ రాజ్య మెట్లుపోయిననేమి అనుకొనునో యనుకొనడో తెలియదు. ఇతడు పోయి శశిదేశములో నివసించడు. తానీ దేశములోననే యుండును. తన కొరకు మహాపదవిసంప్రాప్తించును. దాని కభ్యంతరమే లేదు.

హీరానాట్యము నాల్గురోజు లున్నదనగా గుడరాజ్యములోని కుల్యాప్రణాళికా విషయమంతయు బూత్రి

యైనది. నీటిచుక్కలేదు. బొమ్మలుచేయువాఁడు ప్రాణరహితములైన యా బొమ్మలను రంగులువేసి యెండలోఁ బెట్టును. అవి పిల్లలకు క్రీడార్థముపయోగించును. వాఁ డేమి శాలివాహనుఁడా ప్రాణప్రతిష్ఠచేసి విక్రమార్కునిపై యుద్ధమునకుఁ బోవుటకు? ఆ బొమ్మలుచేసినవాఁడును శాలివాహనుఁడును కాఁడు. వల్లభమంత్రియును కాఁడు అని యందఱకుఁదెలియును. వల్లభమంత్రి యా శాలివాహనుఁడనుకొనువారు ముప్వురు మాత్రమే కలరు. ఆ ముప్వురు వాయవ్యదిశలో మహానదిగా సమకూడిన నాల్గునదులలోఁ బ్రాగ్గిశానది ప్రవహించుచోట నొకచోట నాల్గునెలలనుండి నివసించుచున్నారు. ఆ ముప్వురును మహాశాస్త్రజ్ఞులు. వారిక్రింద నాల్గువందలమంది పని చేసెడివారున్నారు. వా రచ్చటనున్నారని యెవ్వరికిని దెలియదు.

అది మహాపర్వతములయొక్క యంతర్భాగము. నదుల పుట్టుకలను దెలిసికొనగోరువారు పోయిచూడఁదగిన స్థలము మాత్రమే యది. కాని యా నది యచ్చటఁ బుట్టలేదు. ఆ వెనుక నొక డెబ్బది యెనుబదిమైళ్ళ దూరములోఁ బుట్టినది. ఏఱులజన్మంబు వీరుల జన్మమ్ము తెలియరాదన్నట్లు పర్వతములలో జాలుగా నొక సెలయేఱు బయలుదేరును. పది పిల్ల సెలయేళ్లు దానితోఁ గలియును. అప్పటి కొక నదీరూప మేర్పడును. ఇటువంటివి నాల్గైదు కలిసి యొక పెద్ద యేఱగును. ఇట్టివి నాల్గైదు కలిసి కొండలు దిగిన తరువాత నొక పేరఁ బిలువఁబడుచుండును. ఈ ప్రాగ్గిశానది గుడూచీరాష్ట్రములోనున్న మహానది యెంత జలమును బంపించునో తక్కిన మూఁడునదులు కలిసి యంత పంపించును.

తక్కిన మూఁడునదులు నిత్యస్రవంతులు. ఈ నది వేసవికా భాగమంతయు నాషాఢము మొదలు మాఘమువఱకు మంచు గడ్డగా నుండిపోవును. ఆ మంచుగడ్డలయడుగుభాగమున నొక సన్నని ప్రవాహము జాల్వాఱుచుండును. ఆ ప్రవాహము పనివాండ్రతోఁ గలిసి యీ శాస్త్రజ్ఞు లున్నచోటికి వందమైళ్ళ దిగువనుగాని కనిపించదు. కాని ప్రవాహ మడుగున నుండు చునేయుండును. అది తాదృశమైన స్థలము. ఆషాఢ శ్రావణ భాద్రపదమాసములలో నచ్చటి కెవ్వరు పోనేపోలేరు. కార్తిక మాసమువచ్చినతరువాతఁ బ్రాణములకుఁదెగించి పోవచ్చును. బ్రదికినచో బ్రదుకవచ్చును. తత్పూర్వము బ్రదుకుటయే లేదు. ఈ శాస్త్రజ్ఞులలో నొకాయన యెనుబదియేండ్ల వాఁడు. ఆయనపేరు రుద్రభట్టు. ఈయన మాంధాతతండ్రితరము వాఁడు. ఆయన యాప్రదేశమును గనుఁగొనెను. అచ్చటినుండి గుడరాజ్యములోనికి నీరు ప్రవహింపఁజేయుటకు వీలున్నదని గ్రహించెను. చైత్రవైశాఖములలో నా నది నిండుగాఁ బ్రవహించుచుండును. తన్నదీప్రాక్తటము మహాపర్వతములతో నిండియున్నది. ఒకచోటఁ బర్వతము వెలికి గుండ్రముగాఁ దిరిగి నదీతటము పలుచఁబడి క్రింద నఘాతముగా నుండెను. ఒకసారి రుద్రభట్టు ప్రవహించుచున్న నదితూర్పుగట్టున లోతు చూచెను. అది నాలుగైదుతాళ్ళలోతు గలదు. అంత లోతున తాయియే స్పృశించుచున్నది. తటముపైన వంద గజములు వెడల్పున్నది. ఆయన యఘాతములోనికి దిగి యీ పలుచగానున్న మేరను బరిశోధనచేసెను. తటపర్వత

ప్రాంతముపైన వందగజములున్నను. తాడిన్నరక్రింద నేఁబది యిరువది గజములకన్న వెడల్పులేనట్లు కనిపించెను. తటము యొక్క పైభాగమునుండి సూటిగాఁ గ్రిందికిఁ గ్రాటిని వదలినచో రెండుమూడు స్థలములయందు నలుబది యేఁబది గజములు లోనికి గుహాగాఁ జొచ్చికొనిపోవుచున్నది. లోన నది నాల్గుతాళ్ళలోతున్నది. నదియొక్క నడిమిభాగమునఁ దాడిలోతుకన్న లేదు. ఆ ప్రదేశము గుండమయియుండ వలయును. వెలితట్టునఁ దటభాగము నలుబది యేఁబది గజ ములు తొలిచినచో గుండములోని జలము లోయలోనికిఁ బ్రవహించును. ఆ లోయలోనుండి ముప్పది నలుఁబదిమైళ్ళ దిగువభాగమునఁ జుట్టును బర్వతములు గల వందమైళ్ళ చదరము గల ప్రదేశమున్నది. ఆ నీరు ప్రవహించినచో నీ వంద మైళ్ళమేరఁ దటాకమేర్పడును. ఈ తటాక మేర్పడు ప్రదేశ మంతగా గడ్డకట్టదు. ఈ తటాకమునకు వివస్వంతుఁడు నిర్మించిన కాలువలకు నడుమ నెనుబదిమైళ్ళదూరమున్నది. ఆ తటాకములోనున్న జలము నీ కాలువలోనికిఁ బెట్టుటకుఁ గొండలలోనుండి మలకలుగాఁ దేవలయును. ఆ యెనుబదిమైళ్లు నూటపాతికమైళ్ళగును. ఇది యొక మహాకార్యము. అన్నింటి కంటెఁ బ్రధానమయినది యాప్రాకృతమునందలి గుహాభాగము నందు నేఁబదిగజములమేర యొక యేబదిగజముల కైవారము గలుగునట్లు తొలికొట్టవలయును. ఆ రంధ్రము నేర్పఱచుటకు వీలులేదు. అచట మనిషి నిలుచుండుటకు వీలులేదు. అచట మనిషి నిలువవలయునన్నచో మూడునాల్గువందల యడుగుల

లోతుకల యఖాతమును బూడ్పించవలయును. దేనితోఁ బూడ్పించుట? యెట్లుపూడ్చవలెను? ఈ యసాధ్యమయిన కార్యమును మాంధాత చేయవలయునని యాలోచించెను. ఆ యఖాతమును సగము పూడ్పించెను. తక్కినసగ మట్లేయుండెను. ఆ స్థలము మాంధాత యెంత రహస్యముగా నుంచెనో తెలియుచునేయున్నదికదా! ఒక్క రుద్రభట్టునకుఁ దప్ప నది తెలిసినవారిలో మిగిలినవారు లేరు. వల్లభమంత్రి యీ పనిని నిస్సంశయముగాఁ బూర్తిచేయవలెనని పట్టుపట్టెను. రుద్రభట్టు సాహాయ్యము తీసికొనెను. ఆ రెండువందల యడుగులు పూడ్పించుట మానివేసి పదిమంది నిలుచుటకు వీలయినంత యొక పెద్దయరుగు దానివద్ద నిర్మింపించెను. ఈ యొద్దునుండి యరుగుమీఁదికిఁ బోవుటకుఁ బదిగజముల వెడల్పు గోడ నిర్మింపించెను. ఇది చెప్పరానంత క్లిష్టమయిన కార్యమైనది. ఆ మువ్వురు శాస్త్రజ్ఞులు నీ నాల్గువందలమంది పనివాండ్రు మరల వెనుకకు దిరిగివత్తురనునమ్మకము లేదు. ఎంతమంది వత్తురో యెంతమంది రారో తెలియదు. పలుగులతో నా గుహా భాగములోనఁ బొడిచి యందులో మందుఁగ్రుక్కి దానిని మూసి దానిలోనుండి మందుఁగూరిచినగొట్టము వెలికిదీసికొని వచ్చి రెండువందలగజముల యివతల దానికి నిప్పుముట్టించిరి. వెలిగించిరి. మైలుదూరముపోయి నిలుచుండిరి. ఇందులో నెన్నియో యాపదలుండును. అది యెట్లుపగులునో, లోనికిఁ బగులునో, ప్రక్కకుఁ బగులునో, కట్టిన యరుగంతయు నిర్మూలమగునేమో! గట్టుట యసాధ్యమగునేమో! తలుపుల పైభాగమంతయు విఱిగిపడునేమో! విఱిగిపడినచో మఱల

నచ్చటినుండి జలము తీసికొనివచ్చుటకు మార్గమే లేదు. చేసిన పనియంతయు వృథాయగును. అచ్చటనున్న జనములో నెందఱు మరణింతురో తెలియదు. రుద్రభట్టు మహావృద్ధు. ఆయనయంత శాస్త్రవేత్త మఱల నెన్నియేండ్లకుఁ బుట్టునో! ఆ మహాపురుషునిజీవిత మేమగునో! వల్లభమంత్రి యాయన యందలి ప్రత్యయముచేతఁ గోట్లు వ్యయముచేసి దేశమంతయు ననంతకుల్యానాళికామయము చేసెను.

మంచి శుభలగ్నము నిర్ణయించి యగ్ని వెట్టిరి. కొంత సేపటికి ఫెళ్లుమని మ్రోగెను. తరువాత నా ప్రదేశమునకుఁ బోవుటకు నాల్గయిదుగంటలకాలము ప్రతీక్షించవలసివచ్చెను. పరమేశ్వరునిదయవలన ఱాయి ముప్పదిగజములలోతున బెజ్జము పడినది. కాని చుట్టుపట్లబడిన ఱాళ్ళను దీసివేయు టకు వారముదినములు పట్టినది. కొన్నిబండలు కదలించుటకే వీలులేకపోయెను. బెజ్జముపడినమేఱ సగములో నొక పెద్ద బండ పడెను. మఱల మందు గ్రుక్కవలయునన్నచో నీ సగములోనుండిదూరి లోనికిఁబోయి మఱల తొలిచేసి గ్రుక్క వలయును. అచటికి మనుష్యుఁడు దూఱుటయే కష్టముగా నుండెను. ఱాతియొక్క వేడిమి యేమియుఁ దగ్గలేదు. లోనికి బోయినచో మనుష్య లుడికిపోయెదరేమో! ఏఁబదిగజముల కైవారముకల రంధ్రము పడలేదు. బయటఁ బదునేను గజ ములు పందగజముల కైవారముగల పెళ్ళ విఱిగినది. లోన నైదాఱుగజముల కైవారముగల బెజ్జము పదిగజములలోతున నున్నది. ఆ లోనికిదూఱి మందుక్రుక్కుట యసంభవము. ఈ యైదుగజములమేఱ మందు గ్రుక్కి ముఖము మూసినచోఁ

ప్రయోజనము కనిపించదు. శతఘ్నిముఖమునుండివలె మందంతయు బయటికిఁ గ్రక్కవచ్చును. లేదా పై పర్వతమంతయు విఱిగిపడవచ్చును.

కాని యెదుగజముల కైవారమున్నది. ఆ బెజ్జము లోపలఁ జాల నెగుడుదిగుడులుగా నున్నది. ముప్వురు పనివాండ్రు మా ప్రాణములు పోయినను సరే, తాము పోయి లోపలఁ దొలుతుమనిరి.

మఱియు నింకొక సందేహము కలిగినది. భగవంతుఁడు రక్షించి యీసారి నదీతటము లోపలివఱకు బెజ్జముపడవచ్చును. ఆ బెజ్జముపడుటలో నెంతమేఱపడునో! ఎన్నిరాళ్లు విఱుగునో యేమియుఁ దెలియదు. ఆ లోపల గుండమున్నది. ఆ గుండమంతయు జలమయమై యుండవలయును. అడుగున నీరు గడ్డకట్టెనో లేదో, ఈ బెజ్జమా నీటిలోనికిఁజొచ్చినచో నా నీ రెంత ధారగావచ్చునో యెంతదూరము దూకునో యేమియుఁ దెలియదు. అంతయుఁ జీకటిలోఁ దడుముకొనుచుఁబోవుచున్నట్లున్నది.

ఈ నలుగురు పండ్రుపోయి తామూ పని చేయుదుమనిరి. వారినిఁ బంపించుటయా పంపించకుండుటయా? కొండఱు మహావీరులు దేశముకొఱకు మహాత్యాగము చేయుదురు. తత్కాలమున వారిమనస్సులు పాషాణసదృశములు. వారికి భయముండదు. కాని బాధయంతయుఁ జూచెడివారిది; ప్రేరేపించెడివారిది. అంగీకరించెడివారిది. ఈ చూచెడివాఁడు, నీ ప్రేరేపించెడివాఁడు, నీ యంగీకరించెడివాఁడు వీఁడును పాషాణహృదయుఁడై యుండవలయును. వీని హృదయపాషాణలక్షణమునకు వారి హృదయపాషాణలక్షణమునకుఁ జాల

భేదమున్నది. ఇద్దఱును స్వార్థరహితముగనే చేయుచున్నారు. ఆ మహావీరులకుఁ బ్రతిఫలదర్శనవాంఛ లేదు. వీనికిఁ బ్రతిఫలదర్శనవాంఛ యుండును. తానే యెందు కా సాహసకార్యము చేయరాదు? తనకొఱకు వాఁ డెందుకుఁ జేయవలయును. వానిజీవితమున కది పరమార్థమందుమా? తన జీవితము తత్ఫలము పంచిపెట్టుటయందు సమర్థమయిన శక్తికలదా? ఇది యొక చిత్రమయిన ప్రశ్న. సమీపబంధువు మరణించగా గుండెయాగిపోవునేమో యన్నంత దుఃఖించును గాని, తాను మరణించుటకుఁ బ్రయత్నించఁడు. ఇది స్వ-పర భేదము.

ఆ నలువురు సాహసులు లోనికిఁ బోయిరి. తొలిచిరి. ఐదుగజములలోతు తొలిచిరి. మఱియు నెక్కువగానున్నచో నదీతటము మఱి పదిగజములదట్టముగా నా వెనుకనుండు నేమో! మందెక్కించిరి. ఆ పని వారముదినములు పట్టినది. ఒక్కసారిగా లోన గంటసేపటికంటె నెక్కువ యుండుటకు వీలులేకపోయెను. బయటకువచ్చి యైదాఱుగంటలు విశ్రాంతి తీసికొనినఁగాని మఱల లోనికిఁ బోలేకపోయిరి.

మఱల మందుముట్టించువేళ సమాసన్నమయినది.

వంద చదరపుమైళ్ళమేర మహాతటాకముగా నేర్పడఁ బోవుప్రదేశమునుండి కాలువలోనికి నీళ్లుపోవుటకు వలసిన వంతెనలు తూములు కట్టడములు నన్నియు సిద్ధమైయున్నవి. ఈసారి పూర్తిగా బెజ్జముపడకపోయినచో చేసెడిదేమియు లేదు. నది లోతట్టునుండి యీ తాడిన్నరలోతు మంచుత్రవ్వి యీ బెజ్జముమేర కొలిచికొని యీ ప్రాంతమందు లోనుండి

మందు పెట్టవలయును. అది సాధ్యమే కానిపని. తాడిన్నరలోతున మంచుగడ్డలఁ బెద్ద బావి త్రవ్వినట్లు త్రవ్వవలయును. ఆ లోనికి మనుజులు దిగవలయును ఆ మంచుగడ్డ నిలుచునని నమ్మకమే మున్నది? అది నిశ్చయముగా మనుజులను బూడ్చిపెట్టుటయే.

శాస్త్రజ్ఞులు మువ్వురును బెద్ద బండమీఁద గూర్చుండిరి. నాలుగువందలమంది పనివాండ్రును జట్టును సమావేశమైయుండిరి. అగ్గిపెట్టుటయా? పెట్టకపోవుటయా? ఇంతదూరము వచ్చి పెట్టకపోవుట యేమని పనివాండ్రు. శాస్త్రజ్ఞులకే నిర్ణయము రాలేదు. ఇంతలో నొక మహావరాహము ఆ మందుకూరిన రాతిదగ్గఱ కనిపించెను. అది వరాహములు సంచరించు స్థలముకాదు. ఎక్కడనుండి వచ్చెను? అచ్చటి కెట్లుపోయెను? తీగగాఁ బెట్టిన మందుగొట్టమును గదలించినచో మరల నాల్గు దినములపని వ్యర్థమగును. అది మందుగొట్టమును గదలించునేమో! తెగించి మందునుగూరిన నలుగురిలో నొకఁడు నాల్గు వందలగజముల యీతలనున్న గొట్టపుఁజివఱకు రుద్రభట్టు యొక్క యాజ్ఞలేకుండ నిప్పు ముట్టించెను. సురసురలాడుచుఁ బోవుచుండఁగా నందఱును జూచిరి. ఎవరు ముట్టించిరో యెవరికిని దెలియదు. అందఱును దిగ్భ్రాంతులై నిలుచుండిరి. ఎవ్వరు నేమియు మాటాడలేదు. నోటివెంట మాటలేదు. మనుజులలోఁ గదలికలేదు. ఎవ రగ్గిపెట్టిరన్న యూహకూడ లేదు. సురసురలాడుచు నగ్గి పోవుచున్నది. వరాహమున్నచోటిదాఁక పోయినది. ఈ సురసురను జూచి వరాహము దిగ్భ్రాంతిపొందినది. దాని కెటుపోవుటకుఁ దోఁచలేదు. ఏ త్రోవ వెంటవచ్చినదో యా త్రోవవెంట నెందుకుఁ బోదు? అందఱును బాఱిపోనారం

భించిరి. చాలదూరముపోయివచ్చి ఱాళ్ళవాన నెత్తినఁ గురియునుగదా! అచటికి నందగజములదూరమున నొక పర్వతములో గుహాలుగా నేర్పడియున్నవి. అందఱు నా గుహాలలో నక్కియుండిరి.

మహాధ్వని కలిగినది. కొండఱాళ్లు విఱుచుకొనిపడిన ధ్వని యేమియు లేదు. గంటసేపటికి వారిప్రాణములు గూళ్లు పట్టినవి. అందఱికి నేదియో దూరమునుండి గంధర్వస్త్రీలు సన్ననిగొంతులతో సంగీత మాలాపించినట్లు వినిపించినది. అందులో నొక పురుషస్వరము బొంయిమని స్వరముపోయుచున్నట్లున్నది. ఎవ్వరికి నేమియు నర్థముకాలేదు. నెమ్మది నెమ్మదిగా బయటకు వచ్చిరి. వచ్చిచూచునప్పటికి నా బెజ్జములోనుండి యేనుగుతొండమంత ధారలు రెండు జర్రున పడుచుండెను. అవి ముందుఁ బదిగజములదూరమున దూకుచుండెను. మఱికొంత నీరు ప్రవహించుచున్నట్లుండెను. ఆ స్రవంతులయొక్క స్వరూపము సమీపమునకుఁ బోయి చూచినఁగాని తెలియదు. వచ్చుచున్ననీరు లోయలోనికిఁ బ్రవహించుచుండెను. వారి కాశ్చర్యము వేసెను. ఆ తూము క్రిందనే రెండువందలయడుగులలోతున నఖాతమున్నది. ఆ యఖాత మెట్లు నిండెనో యెప్పుడు నిండెనో!

అప్పటికి నతఁడు గుర్తువచ్చెను. అతఁడు తమలోఁ గనిపించలేదు. వాఁడేఁడీ, వాఁడేఁడీ? వానిపేరు బైరా. అతఁడు తమ వద్దనే యున్నాఁడనుకొనిరి. తమకువలెనే వచ్చి గుహాలలో దాగుకొనెననుకొనిరి. అతనికోసము వెదకిరి. ఎవ్వఁడో చూచి గుర్తుపట్టెను. మందుపెట్టినగొట్టముచివఱిప్రదేశముకలచోట

నొక మనుష్యుఁడు గూర్చున్నట్లుండెను. కొంద ఱచ్చటికిఁ బోయిరి. అచ్చట బైరా కూర్చుండియుండెను. కన్నులు విప్పాఱియుండెను. కొండపగిలి బీటిచ్చినచోటఁ జూచుచున్న ట్లుండెను. అతనిపెదవిమీఁద మందహాసముండెను. బైరా బైరా యని పిలిచిరి. సమాధానములేదు. దగ్గఱకుఁ బోయిరి. ఒకరిద్ద ఱతనినిఁ దాఁకిచూచిరి. అతఁడు కదలలేదు. కదలించిరి. అతఁడు వెనుకకుఁబడిపోయెను. వెంటనే లేవదీసి కూర్చుండఁ బెట్టిరి. మరలఁ బడిపోవునన్నట్లనిపించినది. ఒకతాయి తెచ్చి దానికానించి కూర్చుండఁబెట్టిరి. పోయి రుద్రభట్టాదులతోఁ జెప్పిరి. అందఱును వచ్చి చూచిరి. నిప్పతఁడంటించెనని తెలిసెను. పూర్వమే వారి కెందుకుఁ దెలియలేదు? పూర్వము వారున్నస్థలమునకు నిప్పంటించినస్థలమునకు నడుమఁ బెద్ద తాయియున్నది. ఆ తాయి యడ్డములేనిచోటునుండి పీ రిప్పు డతనినిఁ జూచిరి. అతనినిర్ణిమేషదృష్టియేమి ? అతనియధర ముపైని మందహాసమేమి? అతఁ డేమిచూచెను? దేనికాశ్చర్య పోయెను? దేని కతనికి నవ్వువచ్చెను ? అతఁడు దేనికాశ్చర్య పోయెనో దేనికి నవ్వెనో దానిని వారు చూడలేకపోయిరి. దానికి భయపడి పాఱిపోయిరి. దానినిఁ దాముకూడఁ జూచినచోఁ దాముకూడ నారీతిగాఁ బ్రాణముల వదలియుండెడి వారేమో!

అంతలో నొకఁ డనెను. 'ఆ వరాహమేమయ్యెను?' ఒకఁడు కొట్టుకుపోయెననెను. కొట్టుకొనిపోయినచో నే దిబ్బమీఁదనో దానికళ యుండును. కొందఱు పురాణములు త్రవ్విరి. విష్ణువు ప్రళయసముద్రమున ధరాతలము మునిగియుండఁగాఁ దన

కోఁజలమీఁద ధాత్రినెత్తెను. వివస్వద్రాజ్యము మునిగిపోవుచున్నది. భగవంతుఁడా వరాహమై వచ్చి యీ రాజ్యమును సముద్ధరించెనని. అంత యచ్చెరువుగొలుపు సందర్భములో వాదప్రతివాదములు జరుగలేదు. జలధార లురలివచ్చుస్థలము నకుఁబోయి చూడవలయును. అందఱకును భయమే. రుద్రభట్టు బయలుదేరెను. అతని వెంట నందఱును బయలుదేరిరి. దగ్గఱకుఁబోయి చూచువఱకు జలధారక్రింది రెండువందల యడుగుల యఖాతము పూడియుండెను. అందుచేత జలధారలు లోయలోనికిఁ బ్రవహింపనారభించెను. ఆ యఖాతము నిండినతరువాతనే జలము లోయలోనికిఁ బ్రవహింపవలయునన్నచో రెండుమూఁడుదినములు పట్టెడిది. మఱియు దగ్గఱకుఁబోవుట కందఱకు భయమే. ఏ ఱాయి వదులుగానుండి నెత్తినఁబడునో! రెండు బ్రహ్మాండమైనధారలు మాత్రము వచ్చుచుండెను. ఆ లోపల నదీతట మేమి బీటలిచ్చెనో తెలియదు. క్రిందిఱాతిమట్టముగా కొంత జలము ప్రవహించుచుండెను. ఈ ధార పంద్రెండుగజములలోతునుండి వచ్చుచున్నది. పాతికగజములపొడుగున దూకుచున్నది. ఆ దూకుటలోఁ దూముయొక్క యడుగుభాగమునంటి కొంత ధార వచ్చుచున్నది. ఆ జలముయొక్క వర్ణము వారు మున్నెప్పుడును చూచినది కాదు. సర్వప్రదేశము పరిమళభరితమై యుండెను. ఆ పరిమళ మొకమాదకముగా నుండినది. ఈ జలము ఎన్నివేల సంవత్సరములుగా నదిలోతట్టునఁగల పెద్దగుండములో నిలువయున్నదో! ఏడాదియేడాది వసంత గ్రీష్మములయందుఁ బయిమంచు కరిగి ప్రవాహముకట్టినను నీ గుండములోనున్న నీరు దానిస్పర్శయే

యెఱుఁగును గాని తత్స్వరూపమును వికారముపొందు
టయే యెఱుఁగుదుగాని దాని సహజరూపమునకు మార్పులేదు.
ఇన్ని వేల యేండ్లని చెప్పుటకు పిలులేనంతటి నిలువనీరు. అది
ప్రవహించుచున్నది. అందులోనుండి యేదియో వెగటైన
వాసన బయలుదేఱుచున్నది. ఆ వాసనలో నొక యాహ్లాద
కత్వము లేకపోలేదు. ఆ జలమును గొందఱు త్రావుద
మన్నారు. రుద్రభట్టు వారించెను. సృష్టిలోనున్న సర్వజ్వర మూ
జుములో నుండును. అది యమపేయము. అది త్రావినవెంటనే
జ్వరము వచ్చును. చలువలు క్రమ్మును. మరణము నిశ్చయ
మని రుద్రభట్టు చెప్పెను. ఆయనమాట వేదప్రమాణము.
అందఱకును భయము వేసెను. ఎవ్వరు నా నీటిజోలికిఁబోలేదు. ఆ
జలధారలవంకఁ జూచుచు నందఱు నిలుచుండిరి. ప్రపంచకము
లన్నియు మాసిపోవునపుడు లోకములన్నియు మడిసినపుడు
ఏమియు మిగులని నట్టి కడలిమీఁదఁ బండుకొని నిదురించు
నన్న వెన్నునిమేని చెన్నిట్లుండునా. ఆ నల్లఁదనమును బూర్వ
మెవ్వుడును జూచియుండలేదు. ఆ నీళ్లలో గలిసి చిన్నిచిన్ని
మంచుగడ్డలు కూడ వచ్చుచుండెను. అవి సన్ననిచేపలవలెఁ
గనిపించుచుండెను. సముద్రమును దఱచినపుడు నల్లని రత్న
మేదియో పుట్టఁగా దానిని వెన్నుఁడు తన ఱొమ్మునందుఁ
దాల్చెనని చెప్పుదురు. ఆ రతనమును వెన్నుఁడీ నది లోతట్టున
దాచుకొనెనేమో! దాని కాంతులీ పగిలిన లోతట్టునుండి
పిండుకట్టి వెలికివచ్చుచుండెను. ఇవి జలధారలు కావన్నట్లుండెను.

ఆ ముప్పురు శాస్త్రజ్ఞులలో రుద్రభట్టుకాని వారిద్దఱిలో

నొకనిపేరు మోహనదాసు. అతఁడు విచిత్రమయిన మనః ప్రవృత్తి కలవాఁడు. అతని కా జలధారలో స్నానముచేయ వలెననిపించెను. ఆ నీళ్లు త్రాగవలెననిపించెను. ఇతరులతోఁ జెప్పినచో వారంగీకరించరు. రుద్రభట్టు పోనీయఁడు. అతని యీ కోరిక కవధిలేకుండఁ బోయెను. జలధార దగ్గఱకుఁ బోఁజొచ్చెను. ఎందుకో పోవుచున్నాఁ డనుకొనిరి. కొంత దూరము పోయిన తరువాత నెందుకని యడిగిరి. అతఁడు సమాధానము చెప్పలేదు. ఆ జలము బొంయిమని పోసికొను చుండఁగా నొక మహాధ్వని యీ ప్రదేశమందంతటఁ గ్రమ్మి యుండెను. ఆ ధ్వనిలో నొకరిమాట యొకరికి వినిపించుటలేదు. కొంచెము దూరములోనున్న మనిసితో మాటాడవలయు నన్నచో బిగ్గఱగా నఱవవలసివచ్చుచుండెను. తమ మాట మోహనదాసునకు వినిపించలేదని పదిమంది యొకరి తరువాత నొకరు బిగ్గఱగా నఱవనారంభించిరి. ఆయనవద్దనుండి సమాధా నము లేదు. అచటి కొందఱి కేదో సందేహము కలిగెను. అతనిని వారించవలయునని తోఁచెను. పదిమంది యతనిని వారించుటకు బయలుదేరిరి. వీరు కొద్దిదూరము పోవునప్పటికి మోహనదాసు ధారాప్రదేశమును సమీపించెను.

అచ్చట జనులుండిరనఁగా నందఱును పైనుండి క్రిందికిఁ జిక్కని యున్నిదుస్తులను వేసికొనియుండిరి. ఉన్ని దుస్తులను దీసివేసి నిమేషముండుటకుపీలులేదు. చేతులకుఁగూడ నున్నితోఁ గుట్టిన తొడుగులు తొడిగికొనవలయును. పనివాండ్రందఱు పర్వతనివాసులు. వారిశరీరములు చాలభాగ మా చలికి నలవాటుపడియున్నవి. వట్టిచేతులతోఁ గొంతసేపయినను

వారుండఁగలరు గాని వేరెవ్వఁడుండలేరు. మోహనదాసు తన యుడుపులను దీయనారంభించెను. చూచుచున్నవారందఱికిఁ దెలిసెను, అతఁ డందులో స్నానముచేయఁబోవుచున్నాఁడని. ఎట్లు స్నానము చేయును? అచ్చట మడుఁగుకట్టలేదు. రెండు ధారలు పడుచున్నచోట లోతుండెనేమో తెలియదు. కాని యా చుట్టుపట్ల నీలమండలలోతు లేదు. పాతిక ముప్పయి గజముల మేర నీలమండలలోతు నీరుగా నుండెను. ముప్పది గజములు దాటిన తరువాత నీరు పల్లమునఁ బడుచున్నది. అచట మోకాలిలోతు నీరుండవచ్చును. అందులోఁ గూర్చుండియైన స్నానముచేయవచ్చును. మోహనదాసు ధారలకు సమీపమున నిలుచుండెను. ఒకధారక్రిందకుఁ బోయి నిలుచునా? అయ్యో! అంతటి బరువునకు నంతటి వేగమునకు జటలువిచ్చి నిలిచిన శివునిశిరస్సు తట్టుకొనగలదేమో కాని, మానవుఁడు నిలువలేఁడు. నేల కరుచుకొఁబడును. మఱి లేవలేఁడు. అంత ప్రచండమైన యా ధారలో స్నానముచేయుట యెట్లు? కాని ధారాపాతముయొక్క చివళ్లు తుంపురులచేత సమావృతమై యున్నవి. ఆ తుంపురులు రెండుమూఁడుగజముల మేర పడుచున్నవి. తుంపురులలో నిలుచుండవచ్చును. స్నానముచేయవచ్చును. ఇంతకును మోహనదాసుతాత్పర్యమేమో తెలియలేదు.

దూరముగానున్న రుద్రభట్టాదులు ప్రతిలిప్తయు పట్టరాని భయముతో నుండిరి. మోహనదాసును వారింపఁబోయిన పదిమందియు బదిచోట్లఁ గొంచె మెడమెడముగా మోహనదాసును సమీపింపబోవుచుండిరి. మోహనదాసు

వీరివంక చూడకయు వీరిమాటలు వినిపించుకొనకయు ధార లోనికిఁ బోయెను. ధార విసరికొట్టెను. అతఁడు దూరముగాఁ బడెను. వలదని వెనుకనుండి వీరు కేకలుపెట్టుచుండిరి.

అది రెండు మూఁడు గంటలనుండి పడుచున్న ధారయే గదా! క్రిందఁ బ్రాఁచిపట్టలేదు. మోహనదాసు మరల లేచెను. తాను నిలుచుండి ధారక్రిందికిఁ బోలేఁడు. నిలుచుండిపోయినచో ధార దూరముగా విసరివైచును. ప్రాఁకి ధారక్రిందకుఁ బోవలయును. ధార తా నవ్వాడంతగాఁ ద్రోయలేదు. మోకాళ్ళమీఁద మోచేతులమీఁదఁ బ్రాఁకుచు ధారత్రోపిడి కొడ్డుకొనుచు మోహనదాసు ధారనడిమికిఁ బోయెను. నాలుగైదు నిమేసములలో వానిశవము వెలికివచ్చెను. ఆ యద్భుతదృశ్యమున కొకబలి, ఆ మహాధార కొకబలి.

ఈ బలు లెవ్వరిచ్చిరి? ఎవ్వరు నీయలేదు. ప్రకృతియే తనంతటఁ దా నీ బలులను దీసికొనినది కాలము ఒక విచిత్రమైన సన్నివేశము, నొక మహాదృశ్య మొక దుర్ఘటకార్యము. వానియంతట నవి బలులనుదీసికొనును. అవి జాగరితములైన స్థితిలోఁ బరులు వానికి బలుల నీయనక్కఱలేదు. అవియే స్వీకరించును. వాని జాగరితావస్థకును బలికిని యభేదాధ్యవసాయము కావలయును. అందుకనియే కావచ్చును. ఋషులు దేవతలకు బలులొసంగి వారిని జాగరితులనుఁజేయుట. ఈ బలి పురుషునిచేతఁ జేయఁబడినచో నది దోసము. దానియంతట నది జరిగినచో దోస మెవ్వరిది? ఒక భూకంపము వచ్చును. ఒకచోట సముద్రము పొంగి ప్రాంత దేశమునంతయు ముంచివైచును మరియొకచోటఁ బ్రళయవాయువు మారి మసంగినట్లు

విహరించును. ప్రాణనష్టమెంతయో జరుగును. వీనికర్తయెవరు? ఆ జరిగిన ప్రాణనష్ట మింతయని నిరూపించుటకు వీలులేదు. ఎవఁడో బలికొఱకుఁ దానొక ప్రాణిని హింసించును. ఇచటఁ గర్తృత్వము కనిపించుచున్నది. అచటఁ గనిపించుటలేదు. కని పించనిమేర విశాలమైనది. బహుళమయినది. కనిపించినమేర స్వల్పమయినది. ఏకదేశమైనది. ఇచట దోసమెన్నుదురు. అచట నెన్నరు. కారణమేమి? మనుజునియందు సర్వకర్తృకత్వ మును స్థాపించుటయా? ఐనచో సముద్రములు పొంగుట యందు నదులవఱదలయందు భూమిగొనుక్క కంపములయందుఁ బ్రళయవాయువులయొక్క తాండవములయందు మహా వ్యాధులు పేటెత్తుటయందు వీని కర్తృత్వము రేఖామాత్ర మైన లేదే! అనవధికమయిన యీ విచిత్ర మహావ్యూహమున వీనికర్తృత్వ మస్తి నాస్తి విచికిత్సాహేతువుగా నున్నది. వీని కర్తృత్వ మింత యల్పమయినది. అందులో "వీఁడు పరమాల్ప మయిన తన శక్తిని బరమాల్పమైన కర్తృత్వ మొందు కవలం బించ వలయును" అన్నది కాఁబోలు వానిదోసము.

ఈ యల్పమానవుని యీ యల్పకర్తృత్వమునందు దయావిరహితత్వ మొకటి దృశ్యమానమగుచున్నది. ఇది లోక దృష్టము. ఈ బలిచేతనే దేవతాశక్తి జాగరితమగుచున్నదో యది వాని విశ్వాసముపైన నాధారపడియున్నది. ఈ క్లిష్ట సమస్యమీఁద లోకము కొంతవఱకు తన నీతిమార్గము నిర్మించు కొనుచున్నది. ఆ నీతిమార్గమునకు లోకమే యున్నది. దేవతా భావము లేదు.

బైరా యెందుకుఁ జనిపోయెనో యెవ్వరికిని దెలియదు. వాఁడు పోయి యెవ్వరికిని జెప్పకుండ నగ్గి నేల ముట్టించెను? ముట్టించినవాఁడు దూరముగాఁబోక యేమిజరుగునో చూతమని యక్కడనే యేల యుండెను? మోహనదాసున కా ధారాపాతముక్రింద స్నానముచేయవలయునన్న యూహ యేల కలిగెను? లోకమందఱు బ్రదుకవలెనని వాంఛింతురుగదా! లోకములోఁ గొందఱియందుఁ జనిపోవలయునన్న వాంఛ మిక్కుటముగా భాసించుట దృశ్యమానమగుచున్నదే! దుఃఖముచేత బడలి, యాపదలచేత సడలి, నిరాశచేత విడిలి మృత్యువును వాంఛించువారున్నారు. వారిని మన మర్థము చేసికొనవచ్చును. సుఖముగానుండి పదవులుండి భోగముండి కొందఱు మృతిని వాంఛింతురు. ఇది మానవున కర్థముకాదు. వీరిసంఖ్య స్వల్పము. వారి మనోలక్షణము లెట్లుండునో! తన కున్నదానితోఁ దృప్తిలేక మానవునికిఁ దెలిసినది సర్వము దానికి మించినదిలేదు అన్నభావము లేక మనుజునకుఁ దెలియని దేదో యున్నది. మానవుని తెలివి పొలిమేరలుదాఁటి యేమున్నదో యన్న యొక జిజ్ఞాస వారి యెదలనుఁబట్టి పాలార్చుచుండు నేమో! వారిని మూర్ఖులనవచ్చునా? వా రున్మత్తులందుమా? అన్నవాఁడు కాఁగూడదా?

బైరా దేనినిఁజూచి యాశ్చర్యమగ్నుఁడయ్యెను? దేనినిఁ జూచి హసితముఖుఁడయ్యెను? దేనినిఁజూచి యతఁ డట్లయ్యెనో దానిని మ తెవ్వఁడును జూడలేదు. చూచినచో వారుకూడ నట్లే యగుదురా? నే నిది చూచితినని వాఁ డితరులతోఁ జెప్పుటకు నా చూచినవిషయము తగదా? వాఁడు చెప్పినచో నితరులు

దానిని నమ్మరా ? చెప్పుట కదియంతయు యోగ్యమా ? అమానుషమా ? దానికిని జీవ ప్రపంచకమునకును సంబంధము లేదా ? దానిని జూచితినన్న వాఁడు చూచితినని తరువాత నను కొనుటకుఁగూడ వీలులేదా ? ఆ చూచినదానితో నా ప్రాణ మంత కలిసిపోవునా ? శరీరబహిర్గతమైన ప్రాణమునకును దద్దృష్టవిషయమునకు మాత్రమే సంబంధము కాఁబోలును.

అతఁ డంత పేదగుండెవాఁడు కాఁబోలును. దిట్టమైన గుండెకలవాఁడు మరొకఁడైనచోఁ జూచెడివాఁడు. తెట్టుకొనెడి వాఁడు అని యనవచ్చునేమో ! అట్టివానికి నిట్టి దృశ్యమును జూచుటయే తటస్థపడదే. ఈ ప్రశ్నల కొకదానితో నొక్కటికి సంబంధము లేకుండ నున్నది. ఔగాములు తేల్చుట దుర్ఘట ముగా నున్నది. మోహనదాసు చిత్రముగా బయలుదేరెను. అతని నాపుటకును వీలులేకపోయినది. అతనికి దాని క్రింద స్నానము సేయవలయునన్న యూహ యెందుకుఁ బొడమవలయును? ఆ యూహ పొడమి యది యతని హృద యము నంత గాటముగాఁ బొదివిపట్టుకొని వాని నంత సమాక ర్షించినది. ఇట్టి యాకర్షణ యెచ్చటినుండి వచ్చెను? పట్టి భావనామాత్ర విషయము కాదే. అది యతనిగుండెను వశము చేసికొనియుండవలయును. కొందఱకు గాఢమయిన భావనా శక్తి యుండుటయు, నా భావనాశక్తి మనసునందు మాత్రమే నిలువక వానిగుండెను బట్టుకొని వాని యిహలోకమందలి మనుగడకు భంగ మేల కలిగించవలయును? ఆ స్నానము చేసి నందువలన నేమివచ్చును?ఇదికూడ నొక యున్మత్తభావమేమో!

ఉన్మత్తభావమనఁగా నెట్టిది? లోకమునందు బ్రదుకుట సంసారము సేయుట బ్రదుకు తెరువు లాలోచించుట తదనుకూలముగాఁ బ్రవర్తించుట ఇంతకుమించిన సర్వము నున్మాదమేయని సామాన్య మానవుఁ డూహించును. ఈ యున్మాద మొకొక్కప్పుడు వ్యాధి. ఒకొక్కప్పుడు తత్కాలావేశము. వ్యాధియైన యున్మాదము నష్టముచేసికొనవచ్చును. పలువ్యాధులు సంభవించినట్లే యదియు సంభవించును. దేహగత పిత్తాది వికారములచేత మనస్సు గాడితోలఁగి వ్యాదియైన యున్మాదము పుట్టును. ఒక దుఃఖముచేత నొక విచిత్రమైనసంఘటనచేత మనసు గాడితప్పవచ్చును. అదియు నున్మాదమే సంభవించుటకుఁ బూర్తిగా మనస్సే కారణమా? శరీరమునందలి ధాతువులయు గుణములయు నొక విలక్షణమయిన సంక్రమణము జరిగియుండి తత్కాలమునకు నున్మాదస్థితికలుగుటకు హేతువగునా? మోహనదాసునకుఁ దత్కాలమున నొక యున్మాదవృత్తి కలిగెనందము. ఒకొక్కవృత్తి యొకొక్క సంఘటనచేత నుద్దీపితమగును. అతని రక్తగతమైన యేదో గుణము తాదృగద్భుతదృశ్యదర్శనముచేతఁ బ్రకోపించునదియై యుండవలయును. అట్టి రక్తాదుల సంస్థితి యతనిశరీరమున నెందుకుండవలయును? ఈ సంఘటన దాని కెందుకు దోహదమీయవలయును? ఈసంఘటనము, నతని మనోలక్షణము, అతని దేహగతరక్తగుణాదులయొక్క తాదృశస్థితి యివియన్నియు నావేళకు నొక సమాహారదశ నెందుకుఁ బొందవలయును?

వీనివలన నేదైన ప్రయోజనమున్నదా? ఈ రెండు ప్రాణము లిట్లుపోవుటవలన నీ మహోత్కల్యాపదశము భవిష్యత్తు

నందు నిరాటంకముగఁ గొనసాగునా? కొనసాగుట కిట్లు జరిగెనా? అట్లు కొనసాగవలసిన పరిస్థితి యొక మహాశక్తియై యిట్టి సంఘటనమును దీర్చిదిద్దికొనియెనా ?

అవి యట్లు జరిగినదనుటకన్నఁ జెప్పఁదగిన దేమియుఁ గనిపించుటలేదు. దీనిలో నొక్కొక్క యూహ కొందఱు కొందఱు సేయవచ్చును. అది హీరానాట్యప్రదర్శన ప్రకటన పత్రములు గుడినగరమున గోడలమీద నంటించిన దినము.

## తృతీయాధ్యాయము

ఆనాఁడు పట్టాభిషేకదినము. గుడూచీనగరమున శశికిని గుడనగరమున వివస్వంతునకును నాఁడు పట్టాభిషేకము జరుగును. పట్టాభిషేకసమయము పగలు పండ్రెండుగంటలకు. గుడనగరములో సద్దు లేదు. మహోద్యోగులు పెద్ద జమీందారులు చిన్న జమీందారులు సామంతులు. రాజమిత్రులు నెవ్వరును రాలేదు. చాలదూరములనుండి సమీపగ్రామముల నుండి లక్షలాదిప్రజలు వచ్చిరి. ఊరు కిటకిటలాడిపోవుచుండెను. చాలమంది జనము రాజభవనమువద్దకుఁ బోయిరి. రాజభవనమునందుఁగాని తత్పరిసరములయందుఁగాని పట్టాభిషేకప్రసక్తియే లేదు. ఎవరో రాజోద్యోగులను రాజసేవకులను బ్రశ్నించిరి. వారిలోఁ జాలమంది సమాధానము చెప్పకుండనే వెళ్ళిరి. ఎవరో యొకరిద్దరు సమాధానములు చెప్పిరి. ఆ సమాధానము లొకదానితో నొకటి పొసఁగవు. ఆ సమాధానములు పలువిధములుగా నుండెను. ఒకటి శశిగారికి పట్టాభిషేకము జరుగవలెనుగాని వివస్వత్ప్రభువునకుఁ గ్రొత్తగాఁ బట్టాభిషేక

మెందుకు? పూర్వమే జరిగినదిగదాయని. రెండవది వల్లభ మంత్రిగారు నగరములో లేరు. వారు వచ్చినతరువాతఁగాని పట్టాభిషేకము జరుగదని. మూఁడవది యెవరో ముఖ్యులయిన సామంతులకు వచ్చుటకు వీలులేకపోయెను. మఱి మహా వాస్తు వేత్తయైన రుద్రభట్టుగారు కనిపించుటలేదు. దానిమూలముగఁ బట్టాభిషేక మాగిపోయినదని. నాల్గవది మహాశాస్త్రజ్ఞుఁడైన మోహనదాసుగారు చనిపోయిరట ఈ దుఃఖసమయములలోఁ బట్టాభిషేక మెట్లు జరుగును? ఈరీతిగాఁ గొంచెము ప్రొద్దెక్కు వఱకు పట్టాభిషేక మాగిపోయెనని సర్వప్రజలకుఁ దెలిసి పోయెను. సమీపగ్రామస్థులు తమ యూళ్ళకుఁ గాలిదారి పుచ్చుకొనిరి. కొందఱు మహానగరమునందుఁ దిరుగుటయే యొక భోగమనుకొనినవా రా భోగము ననుభవించుచుండిరి. పట్టణములో బంధువులున్నవారు బంధువులయిండ్లకుఁ బోయిరి. తక్కినవారు గ్రామమునందుఁ దిరుగుచుండిరి. ఏ పనియు లేనివా రేదియో చేయవలయునుగద. హీరా నగరమునకుఁ జేరినదా యన్న ప్రశ్న పుట్టెను. ఆమె వచ్చినచో, నూరివెలుపలనున్న యొక పెద్ద కోటలో నొక గొప్ప భవన మున్నది, అందులో దిగును. అక్కడికి జనము గుంపులు గుంపులుగాఁ గొందఱు పోయిరి. మఱికొంద ఱామె రాలేదనియుఁ బన్రెండుగంట లకు నగరమునకుఁజేరు రైలులో వచ్చుననియు నొక వార్త పుట్టెను. ఆ వార్తవెంట రైలునిలుచు ప్రదేశమునకుఁ దండ ములు తండములుగాఁ బ్రజలు పోఁజొచ్చిరి. పన్రెండు గంటల కామె రాలేదు. ఆ రైలుమీఁద నెక్కి కొందఱు వెడలిపోయిరి. కొందఱు కాళ్ళీడ్చుకొనుచు నగరములోనికి వచ్చిరి.

పట్టణములోఁ బరిస్థితి చాల బిగువుగానున్నది. పూర్వ
మిది హంగరాజీయు లధికారముచెలాయించిన ప్రాంతము. నెలనాళ్లనుండి యీ యధికారము క్రమక్రమముగా సడలఁ జొచ్చినది. కడచిన నాల్గయిదునాళ్లగా నా యధికారమున్నట్లే లేదు. నగరములో హంగరాజీయులు మహాధనవంతులున్నారు. నిన్నటివఱకు గొప్ప పదవులలోనున్నవా రున్నారు. హంగరాజమతస్థులొక విలక్షణమయిన ప్రకృతిగలవారు వారిలో ధనవంతులసంఖ్య తక్కువ. పేదవాండ్రసంఖ్య యెక్కువ. ధనవంతులు సర్వదా వినయము ప్రదర్శింతురు. నాగరకులవలెఁ బ్రవర్తింతురు. సాంఘికమర్యాద నెఱపుటలో నగ్రగణ్యులు. అందఱకు మత దురభిమాన ముండును. వారిలోఁ గొందఱు తీవ్రవాదులు. పేదవారిలో నెక్కువమంది వసాధువులని చెప్పవచ్చును. కఱ్ఱలు పుచ్చుకొని కత్తులు పుచ్చుకొని బయలుదేరుదురు. వీరివెనుకఁ దీవ్రవాదులయిన తన్మతస్థులు ధనవంతులుందురు. వీరిని వారు పోషించుచుందురు. ఎచ్చటనో యొక ఖాద్యములమ్మెడి యంగడివద్ద నొక హంగరాజమతస్థుఁడు నొక మాంధాతృ మతస్థుఁడు నిలుచుండి యుండి రనుకొందము. గుడసహిత ఖాద్యపుఁబళ్లెముమీఁద నొక యీఁగ వాలినది. హంగరాజమతస్థుఁడా యీఁగతనమతమునకు జెందినదనుకొనును. మాంధాతృ మతస్థునకు వాఁ డట్లనుకొనెనని యెట్లు తెలియును? ఆ యీఁగ నీతండు తోలును. ఎష్ట! నా యీఁగ నెందులకుఁ దోలితివని వాఁడనును. వీఁడు నీ యీఁగయని నాకుఁ దెలియదనును. నీకుఁ బొగరెక్కినది. ఎందుకుఁ దెలియదని కయ్యమారంభించును. వానినిఁ గొట్టును. వీఁ డొకొక్కప్పుడు తిరిగి

కొట్టగలవాఁడయియుండును. దానితో రఘుల్కొనును. రెండు మూన్నాళ్లు మాంధాతృమతస్థులను సందుసందున విఱుఁగఁ బొడుతురు. ఇంటింటదూరి యల్లరిచేయుదురు. నాల్గవనాటికి మాంధాతృమతస్థులలో నావేశములు పుట్టును. పీరు సిద్ధమగుదురు. ఆ దినమున మూన్నాళ్లటి యప్పు వడ్డీతోసహా తీర్తురు. అప్పు డధికారులకు మెలఁకువ వచ్చును. వీధులలో నిద్దఱు కలిసి నచోఁ జెఱసాలలోఁ బెట్టుదుమన్న యాజ్ఞ పుట్టును. పేరునకు హంగరాజమతస్థులలోఁ గొంతఱిని, నిజానకు మాంధాతృమతస్థులలో నెక్కువమందిని బంధించి రక్షకభటులు గొంపోవుదురు. నగరములో పదిగజాల కొక రక్షకభటుఁడు నుండురు. ఊరంతయు శ్మశానమువలె భాసించును. ఇది తొలినాటి కథ. నెలనాళ్లనుండి యీ యుబ్బుపోయినది. పోయినదన్న విచారము హంగరాజమతస్థుల కెట్లుపోవును? అడుగడుగున నిన్నాళ్లు తమ యధికారముగల పొలములలో నొక్క సారి తామెందులకుఁ బనికిరాకపోయితిమనఁగా మరియొక నగరమే తమకుఁ గాక పోవుచున్నదనఁగా గుండెలలో మంటలు బయలుదేఱెను. ఆ మంటలు లోలోపలఁ దమఱిని గాల్చునదేగాని వెలికివచ్చి మఱొకదాని నంటించుటకు వీలులోనిదిగదా! ఆ మంటలు లోన నెట్లు మండుచున్నవో తెలియదు. వెలికి మాత్రము మొగములును గన్నులును జేవురించియున్నవి. లక్షలాది సంవత్సరములు తమ నెత్తురులందు వేదాంతము, నహింస, పరలోకములు, దేవుఁడు మొదలయిన భావములు జీర్ణించియున్న మాంధాతృమతస్థులకు నేదియుబట్టదు. ఏదియైనను నెత్తిమీఁదకు వచ్చినపుడుగాని వారికి మెలకువరాదు. అప్పుడుగాని వారికిఁ దెలి

యదు అయ్యో! మనకుఁ బెండ్లము- బిడ్డ లున్నారు. మనకును శరీరములు గలవు. మనమును మనుష్యులమే. ఇట్టి యూహాలు వారి కప్పుడు గలుగును. జేవురించిన మొగములతోడ బిగిసిన ముఖలక్షణములతోడ నంగరఖాలలో దాఁచుకొనిన చిఱు బాకులతోడఁ గత్తులతోడ హంగరాజమతస్థులు నగరమునఁ దిరుగుచుండగా మాంధాతృమతస్థుల కా గోడేపట్టలేదు. పట్టాభిషేకోహోత్సవదర్శనము చెడిపోయెనని, హీరానాట్యము చూచుటకు వీలులేకపోయెనని యీ రెండుచింతలు. మఱియుఁ గొందఱు బుద్ధిమంతులు హీరా తరువాతిరైలునకు వచ్చును. పట్టాభిషేకమునకు హీరానాట్యమునకు సంబంధమేలేదని. నాట్యమింత ప్రకటింపబడిన తరువాత మానివేయరని. రాత్రి తొమ్మిదిగంటలవ్వటికయిన దిగకతప్పదని వేఁచి కూర్చుండిరి. ఈ వేఁచికొని కూర్చున్నవారు నాట్యముచూచుటకు వీలే లేనివారు. అన్నిఁటికంటెఁ బెద్ద ప్రవేశపత్రముయొక్క మూల్య మేఁబది రూకలు. అన్నిఁటికంటె చివరిదాని మూల్య మయిదురూకలు. ప్రవేశపత్రములన్నియు నిది వఱకే యమ్ముడుపోయినవి. ఏ తరగతివి లేవు. అవి నిన్నప్రొద్దుటికే లేవు. వీరిలో నైదురూకలుపెట్టి ప్రవేశ పత్రమును గొనగలవాఁ డొక్కడును లేఁడు. కాని వీరందఱును నాట్యము జరుగువేళకు నాట్యభవనముముందు మూఁగి యుందురు. చిన్నచిన్న దుకాణములు పాలికముప్పదియుండును. పొగత్రాగు సన్నచుట్టలు, బీడీలు, ఆవిరిసీళ్లువేయించిన వేరు సెనగకాయలు, బెల్లపుమట్టితో వండిన తీయచక్కిలాలు, ఈ ద్రవ్యమైనవి కానికో యర్ధణాకో కొనుచుండుట, తినుచుండుట

పొగవదలుచుండుట, వచ్చుపోవు బండ్లకు నెడములేకుండ నిలుచుండుట, ప్రవేశపత్రములు కలవారు లోనికింబోవుటకు వీలులేకుండ ద్వారములవద్దం గ్రిక్కిరిసియుండుట, ఒకరినొకరు త్రోసికొనుచుండుట, మాటాడినచో నూరకే మీాందంబడి కలితురన్నట్లు తీవ్రమయిన యొక యావేశముతో మెలంగుట, నాట్యము సగము గడచువఱకీస్థితి. ఆమె పాడెడికీర్తన, ఇందులో సగముమందికిం బల్లవులు వచ్చును. తక్కిన సగములో సగము మందికిం జరణములుకూడ వచ్చును. లోపలినుండి యీ పాటలు వినంబడునప్పుడు బయటినుండి వీ రా పాటలు పాడుచుందురు. నాట్యభవన మెంత కట్టుదిట్టముగా నున్నను గోడలకుం బైకప్పునకు నెడముండును. కొందఱు గుఱ్ఱపుంబండ్ల గుడిసెల పైభాగము లెక్కి వీథికి రెండవవైపునంగల మహాసౌధముయొక్క తలుపుచెక్కలుమూసియున్న యెత్తైన గవాక్షములయొక్క యినుపచువ్వలుపట్టుకొని వివిధములైన ప్రదేశములనుండి బెజ్జములనుండి నాట్యమును జూచుచుందురు. వీరు నాట్యమయిన తరువాతం గూడ వెడలిపోరు. ఆమె తన యాహార్యకమునంతయుం దొలంగించుకొని యొకరిద్దఱుపురుషులు వెంటరా వెలికివచ్చి బండిలో నెక్కును. బైట జనము మూంగియున్నారని తెలిసినచో దొడ్డిగుమ్మము వెంటనే పోవును. మిక్కిలి తెలివిగలవా రా దొడ్డిగుమ్మమువద్దనే కాచికొని యుందురు. ఆ బండివెంటం బరువెత్తుదురు. వీరి పరుగుల కందకుండ బండి దాటిపోవును. అప్పటికి వారు నాట్యముచూచుట పూర్తియగును. ఇట్టివారు నగరమునందు సంచరించుచుండిరి.

హీరా యెందుకురాలేదో తెలియదు. పట్టాభిషేక

మూగిపోయినసంగతి యామె కెట్లు తెలియును? ఆనాటి ప్రొద్దుటివఱకు నగరములోననే తెలియదాయెను. సామాన్య ప్రజలకుఁ దెలియని కొన్ని విషయములు కొందఱు ధనవంతులకు నధికారులకుఁ దెలియును. మఱియు మానవునిబుద్ధి జరిగినకొన్ని సంగతులను ప్రోవుచేసి తన కిష్టములయిన వ్యాఖ్యానములు సేయుచుండును. కడచిన రెండు మూఁడుదినములలో గుడనగరములోఁ గొన్ని సంఘటనములు జరిగినవి.

హంగాబలాయను నొక హంగరాజమతిస్థుఁడు పెద్ద వర్తకుఁడు; ధనవంతుఁడు; పలుకుబడికలవాఁడు అతని పెద్ద కుమారుఁడు గుడూచీనగరములోఁ బెద్దచదువులు చదువుచున్నాఁడు. అతనికిఁ బ్రాణముమీఁదికివచ్చినదని రెన్నాళ్ల క్రిందఁ దంతివార్త వచ్చెను. వాని కుటుంబమంతయు గుడూచీ నగరమున కేగిరి. అతనియిల్లు పెద్ద సౌధము. దానికిఁ దాళములుపెట్టి పోయిరి. కావలావాండ్రుండిరి. కాని యా రాత్రి పూట వానియింట దొంగలుపడిరి. ఇద్దఱు కావలావారిని కాలు సేతులు కట్టివేసి, నోళ్లలో గుడ్డలుక్రుక్కి యొకమూలఁ బాఱవేసిరి. దొంగలు తాళాలు పగులగొట్టిరి. లోనఁబ్రవేశించిరి. కొంపయంతయు సోదాచేసిరి. ఇనుపపెట్టెలు పగులగొట్టిరి. బీరువాలు మాఱుతాళపుఁజెవులతోఁ దీసిరి. కాని యింటిలో సొమ్మేమియుఁ బోలేదు. ఒక్క దమ్మిడీసొమ్ము పోలేదు. ఆ దొంగలు దొంగలో దొరలో, ఆ దొంగతన మెందుకు జరిగినదో, వారెత్తుకపోయినవస్తువు వేమో తెలియదు. మఱునాఁ డెవ్వరో చూచి కావలావారిప్రాణములు రక్షించిరి. అందులో నొకఁడు దొంగతనము జరిగినది, జరుగలేదని తెలిసికొనెను. ఈ వార

హాంగాబలాతోఁ జెప్పుటకు వాఁడు గుడూచీనగరమునకుఁ బోయెను. గుడూచీనగరమున హాంగాబలా కొడుకు సుక్షేమముగా నున్నాఁడు. సేవకుఁడు హాంగాబలాను దిరిగిరమ్మని నాఁడు. అతఁడు రానన్నాఁడు. ఇది యొక సంవిధానము.

మఱియు నింకొక సంవిధానము కలదు. హాంగరాజీయుడు జంగహాంగ యనువాఁడు గొప్ప ధనవంతుఁడు. గొప్ప మల్లుఁడును, హాంగ దేశీయు లతనిక్రిందఁ బదిమంది మల్లు లెప్పుడును నుందురు. వారనినచో ఊరంతయు వణకిపోవుచుండును. పదియేండ్లక్రిందఁ బదునేనేండ్లు గుడనగరమునకు రాజు వాఁడు. ఏలయనఁగా రక్షకభటులు వాఁడు చేసెడి పనులతో జోక్యము కలిగించుకొలేరు. సైనికులు వానియింటికి రారు. రాజ్యమంతయు హాంగరాజుయొక్క యధికారముక్రయం దుండఁగా వానిది యథేచ్ఛారాజ్యమయ్యెను. హాంగరాజు ప్రోత్సాహము వాని వెనుక నున్నదని యందఱకును దెలియును. ఇండ్లలో నందఱుఁ జెప్పుకొందురు. వీథిలో నొక్కఁడు మాట యనఁడు. సభలలో నీ ప్రసక్తిరాదు. ఎవఁడైనను యథార్థవాది, సుంత నిర్భయుఁడు నొకవేళ దీని ప్రస్తావన నలుగురిలోఁ దెచ్చినచో నందఱు ముక్కుమీఁద వ్రేళ్ళు వేసికొందురు. లోకములో నిట్టి పరిస్థితులు వందలుండును. ఒక గొప్పవాఁడు నొక పలుకుబడికలవాఁడు నొక యధికారి యొక పరమదుర్జనుఁడు – నేవో సమాజమునకు ద్రోహములైన విషయములు చేయుచుందురు. దానివలన సమాజము బాధపడుచుండును. అది ప్రతిక్రియావిరహితముగ సాగుచునేయుండును. ఆ వెట్ట

పొందిన వారికి బ్రదుకుట దుస్సహముగానే యుండును. ఆ దుష్టప్రభుని చేసినవానియొక్క యాధిక్యము వలన దాని ప్రస్తావన పదిమంది యున్నచోటఁ జేయరాదు. వెట్టతగిలిన వాఁడు విడివడి మాటాడును. వెట్టతగులనివాఁడు మర్యాదా లక్షణమును బాటించుచుండును. మనుజులలో భిన్న ప్రకృతులుండును. ఒకఁడు పరుఁడు చేసిన యపకారమునకు లోలోన గ్రుక్కిళ్లు మింగి యూఱకుండును. మఱియొకఁడు దూఱకొన్నట్లుండి ప్రతీకారసమయమునకుఁ బ్రతీక్షఁ జేయుచుండును. మఱియొకఁడు నోటికివచ్చినట్లెల్ల మాటాడును. వానికి వెట్ట తగ్గినంతనే సహజముగా శాంతి యేర్పడును. వాఁడు ప్రతీకారమే చేయలేఁడు. వాఁడు ప్రతీకారముకొఱకుఁ బుట్టినవాఁడే కాఁడు. వాఁడు సంఘములో నవివేకి.

ఈ జంగహాంగుయొక్క దుష్టరాజ్యము పదునేనేండ్లు సాగినతరువాత దానిని సహించుట మాంధాతృమతస్థులకు దుర్భరమయిపోయెను. మహాప్రవర్తకుడయిన గిరిధరుఁడు వీనికిఁ బ్రతీకారప్రయత్నమును జేసెను. అతఁడు పదిమందిమల్లులను తన యింటనుంచుకొని పోషింపనారంభించెను. రెండేండ్లు తిరుగకమునుపు గిరిధరుని మల్లులనఁగా నచ్చుపోసినయాఁబోతులని పేరువచ్చెను. జంగహాంగుయొక్క మల్లులు వీరిముందాగలేకపోయిరి. రోజున కొక్కొక్కఁడు వందరూపాయిలతిండి తినును. గూడకట్లుకట్టుకొని ముందు మెలివెట్టిన యంచులు దోపుకొని గుడ్డ వెనుక పిక్కలవఱకు ముందు మోకాళ్ల మీఁదికి రాగా కాషాయవర్ణముగల యుల్లిపొర కంచెమెడ చొక్కాలతో నత్తాకోడలంచు పట్టుత్తరీయములుంగచుట్టి చంకఁ

బెట్టుకొని యీ వస్తాదు లూరివెంటఁ దిరుగుచుండ మాంధాతృ మతస్థులకుఁ గనుబండువుగా నుండును. హాంగరాజీయులకుఁ గన్నెఱ్ఱగానుండును. పదేండ్లుగా నా మల్లులకు నీ మల్లులకు సంఘర్షణ మెప్పుడును జరుగలేదు. పూర్వమువలె జంగహాంగు మల్లులుచేసెడు దుష్కార్యములును లేవు.

లోకములో ధర్మము చమత్కారముగా నుండును. అధికారము కలవాఁడొక యధర్మముచేయుచుండును. తిరిగి యధర్మముచేయునన్నాళ్లు వానియాట సాగుచునేయుండును. సాహసించి యెవఁడును దిరిగి యధర్మముచేయఁడు. చేసినచో నేదియో వచ్చి నెత్తినిఁబడునని వాని భయము. ఒకానొక సాహసుఁడు తిరిగి యధర్మము చేయనారంభించును. ఆ దుష్టుఁడు కిక్కుఱుమనకుండ నూఱకుండును. ఇది యొక చమత్కార మయిన ధర్మభావము. తన యధర్మము సాగినన్నాళ్లు తన యధికారమంతయు నా యధర్మమును రక్షించుట కుపయోగించెను. దానికిఁ బ్రతిక్రియారూపమయిన యధర్మ ముదయించినపుడు తన యధికారముతో నా యెదిరించిన యధర్మమును నిర్మూలనముచేయుటకు సాహసముచేయనేచేయలేఁడు. ధర్మము, పుణ్యము, దైవము మొదలయిన సద్భావములు సర్వ మానవులయందుండును. కొందఱిలో విస్పష్టముగాఁ బైకిఁ గనిపించును. కొందఱిలో మనస్సువెనుక దాగియుండును. కొందఱిలో భయమువెనుక నణఁగియుండును.

ఈ జంగహాంగుయొక్క మల్లులు మూన్నాళ్లనుండి నగరములోఁ గనిపించుటలేదు. జంగహాంగుకూడఁ గనిపించుట లేదు. వారేమైరో తెలియదు. రాజ్యవిభాగమైనతరువాత

గుడూచీనగరమునకుఁ బోయిరని కొందఱు చెప్పిరి. గుడూచీ నగరమున కేగినచో మూఁడు నెలలక్రిందనే వెళ్ళివచ్చెను. మూనాళ్ళక్రింద నెందుకు?

ఇట్టి రెండుమూఁడు పరిస్థితులకు హీరానాట్యమునకుఁ బట్టాభిషేకమాగిపోవుటకు సంబంధములు కలిపి పలురకము లయిన వ్యాఖ్యానములు పలునోళ్ళ నుండి వినఁబడుచుండెను.

హీరానాట్యము పట్టాభిషేకముకొఱకే నిర్ణయింపఁబడెను. పట్టాభిషేక మాగిపోవుట మన కిప్పుడు తెలియునుగాని రెండుమూనాళ్ళక్రిందనే రాజును మంత్రియు నిర్ణయించికొనిరి. ఆమెను రావద్దని తంతియిచ్చిరి.

హీరానాట్య మేదో రాజకీయపు టెత్తు. ఆ యెత్తు సాగలేదు. అందుచేత నామె రాలేదు.

అదిగో పులి యనఁగా నదిగో తోక యనువా రుందురు. వా రూహాగానము సేయుదురు. హీరాతల్లి ముసలిది. ఆమెకు సరిగా నాల్గునాళ్ళక్రింద జబ్బుచేసినదట. అందుచేత రాలేదు. అది నీ కెట్లు తెలియుననగా హంగబలాను జూచుటకు వెళ్లిన వాఁడు తిరిగివచ్చెను. వాఁడు చెప్పెను. వాఁడు తిరిగియేరాలేదని యొకఁ డనెను. ఇద్దఱకుఁ దెలియకపోవుటతో నా వివాద మణఁగిపోయెను.

# చతుర్థాధ్యాయము

శశిపట్టాభిషేకమయినది. వివస్వత్ప్రభునికిఁ గాలేదు. ఇద్దఱిపట్టాభిషేక మొక్కదినమునఁ గావలయునని హాంగరాజు వల్లభమంత్రితోఁ జేసికొనెను నిబంధన. కాని యట్లు జరుగలేదు. ఈ నిబంధనయొక్క యుల్లంఘనము గూర్చి వల్లభమంత్రితో మాటాడవలయునన్నచో హాంగరాజునకు మఱునాఁడేమి తీరిక? పైఁగాఁ బూర్వమువలెఁ దాను వల్లభమంత్రి వద్దకు వచ్చుటకును వీలులేదు. తా నొకరాజ్యమునకు మంత్రి. పరరాజ్యమునకుఁ బోవలయుననగా నా రాజ్యాధిపతులయు నధికారులయు ననుమతిలేకుండఁ బోవరాదు. పోయి యేమని యడుగును? మాకీ యిబ్బంది కలదు. ఈ యిబ్బందికలదనివారు చెప్పినచోఁ దా నేమిచేయఁగలఁడు? రాజ్యములు, కొన్ని యధికారములు విలక్షణమయినవి. ప్రతి చిన్నవిషయమునకు యుద్ధమే యనివార్యమయినదిగాఁ గనిపించును. ప్రతిదానికి యుద్ధ మెవరు చేయఁగలరు? యుద్ధముచేయవలయునని నిర్ణయించుకొన్నచో స్వల్పాతిస్వల్పమయినవిషయము కారణమగును; గాని యుద్ధముచేయుటకు సిద్ధముగాలేనపుడు మహాకారణము కూడఁ గారణము కాదు. మఱియు హాంగరాజునకుఁ గొన్ని సందేహములు విడఁబడలేదు. హీరానాట్యమేల జరుగలేదు? హాంగబలా గుడూచీనగరమున కేల వచ్చెను? అతఁడు తిరిగి యెందుకుఁ బోలేదు? జంగహాంగు ఏమయినాఁడు? అతని మల్లురేమయిరి? హాంగరాజున కేమియును దెలియలేదు. ఎంతయో జరుగుననుకొన్నది సుంతయైనను జరుగలేదు. తనకుఁ దీరుబడి

లేదు. తనకు వచ్చివార్తలుచెప్పెడివారు చెప్పలేదు. వల్లభమంత్రి చాల శాంతుఁడు, అహింసాపరుఁడు, వివేకవంతుఁడయినను రాజకీయవిషయములందు గూఢాలోచనలేనివాఁడు. ఆయన సచ్ఛీలముచేత తన శాంతిచేతఁ బ్రజ లతనికి వశంవదు లయినారు. ఆ రుద్రభట్టోకఁడు చండప్రచండుఁడు. అతఁడు మిక్కిలి వృద్ధు. మఱియు నతఁడు నాల్గయిదు నెలలనుండి కనిపించుట లేదు. మృతి యొకవిధముగా వచ్చునని యెట్లు చెప్పవచ్చును? నేనను కొన్న ట్లతడు మరణించియుండవచ్చును. ఆయన నాల్గవ కుమార్తె పరదేశములందున్నది. ఆ కూతునుజూచుట కతఁడు వెళ్లునట్లుచేసితిని. దారిలో నొక మహాటవి కలదు. ఆ మహాటవీమధ్యమున నాయన కనిపించకుండఁబోవును. అట్లు కనిపించకుండఁగ నేపోయెను. వివస్వంతునకుఁ దమ్ముఁడన్నచో మిక్కిలి ప్రేమ. తన రాజ్యమంతయు శశి లాఁగుకొన్నను వివస్వంతుఁడు పట్టించుకొనఁడు. అతనిచింత యెంత సేపటికిఁ దమ్ముఁడు చెడిపోవుచున్నాఁడని. అతఁ డాత్మభ్రష్టుఁడగుచున్నాఁడని. అరే! యీ జాతికి నిహలోకముకంటెఁ బరలోకము ముఖ్యము. ఇహలోకాపేక్ష యీ పరలోకము లున్నవి కాని, పరలోకములు వానియంతటనవి లేవు. ఈ సంగతి వారి వేదాంతులకును దెలియ దేమో! ఆత్మభ్రష్టుఁడయిపోవును. సర్వాత్మలను సముద్ధరించెడి పరమేశ్వరుఁడుండఁగా వీరి కీ చింతన యెందులకు? ఇచ్చట యథేచ్ఛముగాఁ బ్రవర్తించవలయును. భగవంతుఁడా! నా తప్పులను మన్నించుమని భగవంతునిఁ బ్రార్థించినచో నతఁడు మన్నించును. ఆ భగవంతుఁడు ప్రేమయొక్క స్వరూపము.

ఈ మహారహస్యము తెలిసినజాతులు పైకివచ్చును. లేనివి నేలలోనికి దిగఁబడిపోవును. ఇది రహస్యము.

హాంగరాజునకుఁ దీరిక లేకుండెను. హాంగబలా తనదగ్గ ఱకు రాలేదు. అతనికి వార్తపెట్టవలయుననఁగా నతఁ డెచ్చట నుండెనో తెలియరాదు. ఇట్టిచింతతో హాంగరాజు తన కార్య భారమునందు మునిగియుండెను. గుడూచీనగరమంతయుఁ బట్టాభిషేకోత్సవములలో స్వధర్మములుకూడ మఱచియుం డెను. ఆ దినమున రెండుజాములుదాటువేళకు విచిత్రమయిన సన్నివేశము జరిగెను హాంగరాజుయొక్క బ్యాంకులలోనికిఁ గోట్లు నిలువచేసిన మహావర్తకులు మొదలు పందలవఱకు నిలువవేసికొనినవారుకూడఁ దమ ధనము కావలయునని కోరిరి. ఈ పని యానాఁడు గుడనగరములోఁ బెద్దయెత్తున జరిగెను. గుడూచీనగరములోఁగూడఁ జాలభాగ మీపని జరిగెను. కాని హాంగ దేశపుబ్యాంకులలో గుడనగరమున నున్నది శాఖ యైనను ప్రధానస్థానమున జరిగెడు పనియంతయు నక్కడనే జరుగుచుండెను. ఆ ధనాగారాధిపతుల కేమియుఁ దోచలేదు. ప్రజలువచ్చి భవనమును ముట్టడించిరి. అల్లరి క్రమక్రమముగా విజృంభించెను. వారు రాజభటులకొఱకుఁ బంపించిరి. రాజ భటులు రాలేదు. ప్రజలు తలుపులఁ బగులగొట్టిరి. గుమాస్తా లెవరిదారిన వారు పారిపోయిరి. ఉన్న కాగితములన్నియుఁ జెల్లాచెదరైపోయెను. భవనమంతయు నిర్మూలింపఁబడినది. భవ నాంతర్భాగమున భూస్థాపితములయినయినుపపెట్టెలలోఁ గొన్ని కోట్ల రూపాయలున్నవి. ప్రజల కది స్వాధీనముకాలేదు. గడ్డ పలుగులకుఁగూడ నవి లొంగుబడలేదు. నేలయంతయు

నినుము కరిగించిపోసిరి. ఆ తాళములు సాధ్యముకాలేదు. ఆ బ్యాంకుయొక్క యధిపతి తాళపుఁజెవులతోఁ బరారియయ్యెను. పరారియయ్యెనేకాని యతని చహరాయంతయుఁ గనిపెట్టెడివారుండనేయున్నారు. అతఁ డింటికిఁ జేరకముందే వానినుండి తాళపుఁజెవులు సంగ్రహింపఁబడినవి.

ప్రొద్దుగ్రుంకకముందే వివస్వద్రాజభటులు వచ్చి ధనాగారముచుట్టు కావలాయుండిరి. దీనిని ముట్టడించి తలుపులు పగులఁగొట్టి లోనికిఁబోయి, గగ్గోలుచేసిన ప్రజలలోఁ గొందఱు ప్రధానులయినవారిని బంధించి చెఱలోఁబెట్టిరి. ఆ యర్ధరాత్రమునఁ దాళపుచెవులు వశముచేసికొన్న నలుగురైదుగురు మానిసులు రహస్యముగా నినుపపెట్టెలకడకుఁ బోయిరి. తాళములుతీసిరి. ధనమంతయు దీసికొనిరి. ఈ ధనాగారమునకు వెనుకవైపున నొక విశాలమయిన నిర్జనప్రదేశము కలదు. దాని నిండఁ దుమ్మదుబ్బులు కసిందమొక్కలు గోరింటపొదలు సాగనారుమట్టలు రేఁగుపొదలు చిల్లకంచెలు. ఇదియొక చిట్టడవి. ధనాగారమును రక్షించుచున్న రాజభటులు వెనుకవైపునకే పోలేరు. కాని యీ చిట్టడవిచుట్టు వందమంది రక్షకభటులు కాపుండిరి. ఆ యినుపపెట్టెలు తాళములు తెఱచి ధనమంతయుఁ దీసికొన్నవారు వారివెంటఁ గొన్నిసాధనములు తెచ్చిరి. ధనమంతయు దీసికొనినతరువాత నాసాధనములతో కరిగించిపోసినయినపనేలయంతయు విరూపముచేసిరి. బెజ్జములువేసిరి. తాళములు వేసెడిస్థలముఁ గరగించిపాఱవేసిరి. మఱునాఁడు పత్త్రికలలో దీనిసంగతియంతయుఁ బ్రచురింపఁబడినది. ఆ యినుపగదినేలయంతయుఁ బలుచోట్లఁ గరగించఁబడినదని తాళములున్న

నేల పూర్తిగా విధ్వంసముచేయఁబడినదని పత్రికలలోఁ బ్రక టింపఁబడెను. మహారక్షకభటాధిపతి చేసిన వాఙ్మూలము ప్రకారము ఆర్థికమంత్రి దీని వయినమంతయు గుడాచీనగరాధి కారులకుఁ దెలియఁజేసెను. ధనము దమ్మిడీ చిక్కలేదు. అయోధనాగారము కరగింపఁబడినది. తగినవేళలోనే రక్షక భటులచ్చటికిఁ జేరిరి. వీరచటికిఁ జేరువఱకే కార్యము మించి పోయినది. విప్లవనాయకులు బంధింపఁబడిరి. వారియిండ్లు పరి శోధనచేయఁబడినవి. ఏమియు దొఱకలేదు. ఆశ్చర్యమేమనఁగా బట్టువడిన విప్లవనాయకులలో జంగహాంగుయొక్క వస్త్రాదులు నలుగురు దొఱికిరి. వారియిండ్లు పరిశోధించఁగాఁ గొన్ని రహ స్యములయినకాగితములు కనిపించెను. ఈ సంగతులన్నియు వ్రాసి గుడాచీనగరాధిపతులకుఁ దెలియఁజేయఁబడెను.

గుడనగరములోఁ బట్టాభిషేకమునాఁటిప్రొద్దున నెంత యానందము విజృంభించెనో యా సాయంతనమున నంత విషా దము చెలరేగెను. నగరమంతయు రక్షకభటులతో నిండి పోయెను. మనుజులు తిరుగుటకు వీలులేకుండెను. ప్రతి పదము నందు రక్షకభటులకుఁ దామెవ్వరో యెచ్చటికి వెళ్లుచున్నారో మొదలయిన విషయములు తెలియకుండ నెవ్వరు నెచ్చటికి వెళ్ల వీలులేకుండెను. ఒక మనుజుఁడు చెప్పిన సమాధానము వలన నా రక్షకభటుఁడు తృప్తిపడలేదు. వాఁడు కదలుటకు వీలులేదు. రక్షకభటులలో రెండువిధములు. ఒకఁడు సామా న్యులు. వారు దైనందినముగా నగరములోఁ దిరుగుచు సామా న్యములైన పోట్లాటలు, మార్గమునందు పథికులును శకటములు నిర్ణీతప్రకారముగా నడచుటకేర్పాటులనుజేయువారు. రెండవ

విధమయిన రక్షకభటులు పరదేశములనుండి వత్తురు. వారి కి దేశభాష తెలియదు. వారి నాంబోతులను మేపినట్లు మేపుదురు. తెగబలిసియుందురు. వారికిఁ జేతిలో నొక కఱ్ఱ, బుజమునఁ దుపాకి. వానికిఁ బెద్ద పిన్న వివక్షలేదు. మంచి చెడ్డ యాలోచన లేదు. గౌరవనీయుడెవఁడో యగౌరవనీయుఁడెవఁడో దుస్తులనుబట్టి తెలిసికొనలేఁడు. ముఖలక్షణములనుబట్టి తెలిసికొనలేఁడు. తెలివితేటలలో వానికిని వానిచేతిలోని కఱ్ఱకును భేదములేదు. ఆ రెండు నొక్కటేవిధమయిన తెలివిగల పదార్థములు. ఈ రక్షకభటులు హంగరాజుచేత నిర్మింపఁబడిన యొక మహాసంస్థ. హంగరాజు నిర్మించిన యీ రక్షకభట సముదాయమును, దాని సైనికులును నొక్కటియే తీరు. వారికాలోచన యుండఁగూడదని యొక సిద్ధాంతము. వారికి మనస్సు మెత్తఁదనము కలుగరాదని మరియొక సిద్ధాంతము. వారికిని ప్రపంచకమునకును సంబంధములేదు. వారికి సామాన్య జనులను జూచినచో నొక్కటే యూహ. వారు తమచేతఁ గఱ్ఱ దెబ్బలు తినుటకో, తమ తుపాకిగుండున కెఱయగుటకో భగవంతునిచేత సృష్టింపఁబడిన జంతువులని. వారికి రాజ్యములు మాఱుచున్న సంగతి తెలియదు. విప్లవములు జరుగుచున్న సంగతి తెలియదు. స్వదేశము పరదేశము దేశభక్తి మొదలయిన భావములు వారియెదలలో లేవు. ఈభావములే యేమి, యే భావములును లేవు. తినుటయు, దినమెల్ల నిర్ణీతమైన వ్యాయామము చేయుటయు వారికొఱ కేర్పాటైన క్రీడలు నెఱపుటయు, తుపాకితో లక్ష్యమునుగొట్టు నభ్యాసము చేయుటయు, గాలిలో మనుజులున్నారనుకొని కఱ్ఱలుపెట్టి యటు

నిటు కొట్టుచు సంచరించుటయు—నిదియంతయు వారివిద్యలో నొక భాగము. తరువాత నప్పుడప్పుడు బండిలో నెక్కుమందురు. వారెక్కుదురు. ఆ బండి యెక్కడికో పోవును. ఒకచోట దిగుమందురు. దిగుదురు. వరుసగా నిలుచుండమందురు. నిలుచుందురు. కొట్టుమందురు; కొట్టుదురు. కాల్చుమందురు, కాల్తురు. వారి జీవితపరమార్థమంతయు నింతియే. ఇట్లు లక్షలమంది ప్రాణులను హంగరాజనీతి సైన్యమనుపేరఁ బ్రత్యేక రక్షకభటులనుపేర నిర్మాణముసేసెను. వాని సిద్ధాంతములే వేఱు. మానవులందఱికి సమానమయిన వివేకము కలదని యొక సిద్ధాంతము. అందఱకు సమానమైనహక్కు లుండవలయునని యొక సిద్ధాంతము. అందఱు సమానులేయని యొక సిద్ధాంతము. సామాన్యమానవులకుఁ గావలసిన వివేకముకూడ మానవత్వముకూడ లేకుండ నిట్లు కొన్ని లక్షలజనము సేనపేర, రక్షకభటులపేరఁ బశుప్రాయులుగా నిర్మించిన యీ హంగరాజనీతి వానికే తెలియవలెను ఆ నీతికంటె నుత్తమనీతి సృష్టిలో లేదని వాదించు హంగరాజరాజ్యాంగవేత్తలకుఁ దెలియవలయును.

ఆ రాత్రి యీ ప్రత్యేక రక్షకభటులచేత నగరమంతయు నిండియుండెను. జనమందఱు తలుపులు వేసికొని లోననే యుండిరి. వీథులవెంట జనసంచారమే లేదు. ఇట్టి రక్షకభటులు లేనిచో గుడనగరమున నా రాత్రి యీరాత్రిగా గడచెడిదిగాదు. కనుక నిట్టి రక్షకభటులయొక్క యావశ్యకత గలదని యర్థము. ఒక ప్రయోజనముకొఱకు వా రట్టివారయి యుండవలయును. వారి నట్టివారిగా శిక్షచేయుటలో నొకవిధ

నయిన ప్రజాక్షేమము కలదు. ప్రజయనఁగా వీరు కానివారే ప్రజయా? వీరు ప్రజలోనుండి రాలేదా? ప్రజయుఁ బాలకు లును వీరు పాలకులలోని భాగమా? పాలకులు పాలించుట, దాని కవసరమయిన సిబ్బంది - యిదియంతయుఁ బ్రజలు కారా? వీరు కానివారు ప్రజలా? వివేకాదులును సమానధర్మ ములును సమానమయిన హక్కులు మొదలయిన సూత్రములు పాలకసంబంధమయిన జనసమూహమునకు వెలినున్న సామాన్యప్రజ యం దభివ్యాప్తముచేయఁదగిన సూత్రములా?

ఆరాత్రి యీ రక్షకభటులసంచారమువలన జరుగ వలసిన మహావిచిత్రములు జరుగలేదు. హీరానాట్యమే యీ రాత్రి జరిగినచో, ననఁగా హీరా యానాఁడు వచ్చియున్నచో నాట్యములేదు గీట్యములేదు. దైవము రక్షించి యీ ప్రొద్దు ననే యీ విషయము పరిష్కారముచేయఁబడెను. ఇట్లుండఁగా నారాత్రి యొకచోట నొక గృహమునందుఁ బెద్ద హల్లకల్లో లము జరిగెను. నిమేషములో వందమంది రక్షకభటు లచటికిఁ జేరిరి. వందమంది హంగరాజమతస్థులు వారి మతపుగేకలు పెట్టుచు బయలుదేరిరి. వందమంది రక్షకభటులు చాలలేదు. వారికి వీరికి సంఘర్షణము జరిగెను. వారివద్దగూడఁ దుపాకులు మొదలైన సాధనములు గలవు. వారిలోఁ గొందఱు చనిపోయిరి. వీరిలోఁ గొందఱుచనిపోయిరి. ఇంతలో సైన్యమువచ్చెను. హత శేషులయిన హంగరాజమతస్థులు సశేషముగా నిర్మూలింపఁ బడిరి. అంత వారు బయలుదేఱినగృహము పరిశోధింపఁబడెను. ఆ గృహ మొక యాధునికదుర్గముగా నిర్మింపఁబడెను. లోన శతఘ్నులు,మనుజులను వరుసగా టపటపకాల్చివేయు ఫిరంగులు

బోలెడంత మందుగుండుసామాను. లోన సాయుధులయిన కొందఱు భటులు. సైన్యము తద్గృహమును ముట్టడిచేయవలసి వచ్చెను. వెంటనే సాధించుటకు వీలులేదు లోనుండి కాల్పులు. వట్టి సైనికులు పనికిరారు. మహాయుధములు తేఁబడెను, శతఘ్నులు వచ్చెను. ముట్టడి ప్రారంభమయ్యెను.

అందఱును తలుపులు గొళ్ళెములు వేసికొనిరి. తెల్లవారువఱకీ వార్త నగరమంతయుఁ బొక్కిపోయెను. ఎట్లు పొక్కెనో తెలియదు. దానియొక్క స్వరూప మిదమిత్థమని తెలియదు. ఆ వార్తమాత్ర మొక నిశ్చితరూపమును దాల్చెను. హంగరాజమతస్థులు మాంధాతృమతస్థులను నఱికివేయుచుండిరి. కనిపించినవారిని గనిపించినచోట మారణహోమము చేయుచుండిరి. జనము భయభీతమయ్యెను. కాని యాథార్థ్యమెవ్వరికిని దెలియదు.

కాని తెల్లవాఱకముందు మఱి యిట్టిసంఘటన మింకొకచోట జరిగెను. ఆ సంఘటన మింకొకరీతిగా సమారంభించెను. ఒక హంగరాజీయుల మహాసౌధమునకుఁ బ్రక్కనొక మాంధాతృమతస్థుని యిల్లున్నది ఆ హంగరాజీయుఁడు మహాధనవంతుఁడు. ఈ మాంధాతృమతస్థులు నిఱుపేదవారు. మనుజుల కలిమిలేములకును, నహంకారాదులకును సంబంధముండదు. నిరుపేదవాఁడై యుండును. వాని యహంకారమునకు భూమి యాకాశము పట్టకుండును. వాని దురుసుతనమునకు మొదలు చివఱ కనిపించదు. వాకిటిలోనికిఁ గొందఱు బిచ్చగాండ్రు వత్తురు. బిచ్చగాండ్రవిషయములో గృహస్థులు పలువిధములుగా నుందురు. ఒకొక్కప్పుడు ప్రేమతోఁ దెచ్చి

బిచ్చము వేయుదురు. మఱియొకప్పుడు మనసొకవైపున వేయుమనును. మఱియొకవైపున వద్దనును. ఆ రెండు భాగముల బలాబలాలనుబట్టి యటో యిటో చేయుదురు. మఱియొకప్పుడు బిచ్చగాఁడు వాకిటిలో నిలుచుండియేయుండును. వాఁడు నిలుచున్నాఁడని తెలియును. బిచ్చమును వేయఁడు. పొమ్మనఁడు. మఱియొకప్పుడు వానినిఁ దిట్టుదురు. ఇవి బిచ్చము వేసెడి వారిలక్షణములు. ఇంక బిచ్చమునకువచ్చెడివారిలక్షణములు వీనికంటె ముదిరియుండును. ఒకఁడు కొంతసేపు చూచి వెడలిపోవును. ఒకఁడు నీ వేదో సమాధానము చెప్పువఱకల్లె నిలుచుండును. మఱియొకఁడు గుప్పెడు బియ్యము నోడిలో వేయించుకొని, పచ్చడిబెట్టుమని, చద్దియన్నము బెట్టుమని యేదైనఁ బ్రాతగుడ్డయున్నచో నిమ్మని గోజాడును. నీవు పొమ్మనినచోఁ బోఁడు. నీవు విసిగికొని తిట్టెదవు. వాఁడు వెడలిపోవును. వెడలిపోవుటలోఁ బది లక్షణములు నిన్ను దిట్టుచున్నట్లు పెదవులాడించుచు నొకఁడుపోవును. వాకిలిలోనికిఁ బోయి మఱియొకఁడు తిట్టనారంభించును. గృహస్థు వానిని గొట్టినా బిచ్చగానిని గొట్టినని యప్రతిష్ఠ. తక్కువవర్ణముల స్త్రీలలో దాటకలు, పూతనలు, శూర్పణఖ లుందురు. వారొకొక్కప్పుడు చేసెడి మర్యాదాతిక్రమణము, నోరువదలుటయు సహించుటకు యోగీశ్వరుఁడు కావలయును. ఆమె శూర్పణఖ యని యందఱకును దెలియును. ఆమెమీఁదఁ జేయిచేసికొనరాదు. చేయిచేసికొంటివో యామెమీఁద వందసార్లు చేయిచేసికొందమనుకొన్న వారందఱు నిన్నే దూయఁబట్టుదురు. ఇంకఁ గూలివాండ్రు, రిక్షాలులాగువాండ్రు, బండ్లు

తో లెడివారు, మరియాదగల బిచ్చపువాండ్రు-అనఁగా గంగిరెద్ద వాండ్రు, భజనకీర్తనలఁ బాడుచు వచ్చెడివారు మొదలయిన వారు కలరు. వీరిలోఁ గొందఱు చెలరేగినచో నడిమిరకపు గృహస్థు లాగలేరు. కూలివాండ్రు, రిక్షావాండ్రు, బండ్లుతోలెడి వారు-వారిలోఁగల దుష్టత్వమున కవధియుండదు. నీవు వాని నేమి యనుటకును వీలులేదు. వానికిఁబోవు మరియాద లేదు. నీకుఁ బోయెడిది గలదు. ఒకొక్కప్పుడు నీవు చేయిచేసికొనిన లాభము లేదు. వారికిఁ దిండిలేదని పేరేగాని, వారిలోనొకొక్కక్కనికి జబ్బులుతిరిగియుండును. నిత్యము కష్టముచేయుటమూలముగా వానిశరీరము నినుపకడ్డీవలె నుండును. మహాధనవంతులకు వీరితో సంఘర్షణ యెప్పుడు నుండదు. మహాధికారులకంతకుముందే యుండదు. సంఘముయొక్క బరువంతయు మోయువారు సంఘములోనున్న నడిమిరకపు గృహస్థులు. పన్నులబాధ వారిది. అల్పములైన సర్వకష్టములు వారివి. అల్పసుఖవంతులు వారు. అధికకష్టవంతులు వారు. మరియు దేశముయొక్క నాగరకతను భావించునది వారు. సంప్రదాయమును సంరక్షించునది వారు. మరియాదయన్న భావము కలది వారికే. మహాధనవంతులకు మర్యాద యక్కఱలేదు. తక్కువవారి కది లేదు.

కాని సంఘములో నే తరగతి కా తరగతికిఁ బ్రయోజనములు కలవు. నష్టములు కలవు. అందఱును గలిసి చమత్కారముగా సంఘదౌర్జన్యము ననుభవింతురు. సంఘరక్షాపరులు నగుదురు. ఇంతకును మానవులయొక్క కామక్రోధాదులు సంఘములో వారిస్థితిననుసరించియుండవు. అవి

యథేచ్ఛముగా నుండును. కామక్రోధములు సాధించుటకు మార్గములలో భేదములుండును. కామక్రోధము లుదయించుటకును విజృభించుటకును హద్దుపద్దులు లేవు. లోకములో నొకఁడు గొప్పవాఁడని చెప్పఁదురు. గొప్పవాఁడనగా ధనవంతుఁడు. అధికారి. కామక్రోధము లదుపులోనున్న వాఁడన్న యర్థమే కాదు. అధర్మములవంకకుఁ బోఁడన్న మాటయే లేదు.

క్రోధమున్నది. అహంకారమున్నది. వాని విజృంభణము లున్నవి. ఇవి సంఘములో విలక్షణములయినవి. తక్కినవానికి వీనికి సంబంధమే లేదు. నిజముగా విచారించినచో గామమొక్కటియే వ్యక్తికిమాత్రము సంబంధించిన విషయము. క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు వ్యక్తి సంబంధకములేగాక, జాతి వర్ణ మత సంఘ సంబంధులు. కామ మొకొక్కప్పుడు మతసంబంధముగాఁ గనిపించుచుండును .మత సంబంధముగాఁ గనిపించుట యారోపితవిషయము. క్రోధ లోభ మోహ మద మాత్సర్యములలోఁ క్రోధగుణముది యది యొకప్రత్యేకస్థితి తక్కినవి నైయక్తికముగాఁదీసి వేసినచోఁ బాలకులకు సంబంధించియుండును. క్రోధము భిన్నదశలలో విజృంభించును. ఇది సర్వవ్యాపి. వ్యక్తిగతముగా నుండును. వర్ణగతముగా నుండును. సంఘగతముగా నుండును. జాతిగతముగా నుండును. మతాశ్రయమై యుండును.

ఒకేసంఘములో నడిమిరకపు జనులకుఁ దక్కువరకపు జనులకుఁ గలిగిన సంఘర్షణలోఁ దక్కువరకపుజనుల యహంకారాదులు సంఘముయొక్క యాంతరవ్యవస్థకు మర్యాదాభంగహేతువుగా గనిపించును. కాని మతాంతరు

లతో జాత్యంతరముతో సంఘర్షణలు కలిగినపుడు వారి యహంకార క్రోధములు సంఘరక్షకములుగా నుండును.

ఆ హంగరాజధనికుని పొరుగుననున్న పేదవాఁడయిన యీ మాంధాతృమతస్థుఁడు పరమాహంకారి. పరమక్రోధి. వాఁడు నాయకుఁడు. వానిక్రిందఁ గొన్నివందలజనము కలరు. ఈ రెండుమతస్థులవారిసంఘర్షణము జరిగినపు డీ మతస్థుల కోపు పడిపోకుండఁ జూచెడివాఁడు వాఁడు. వాఁడు హంగరాజ మతావేశపరులకుఁ బ్రక్కలోనిబల్లెము. వానిని మడిగించుట కెన్నో ప్రయత్నములు జరిగెను. కాని ఫలించలేదు. తమ రాజ్య మెట్లును నీ మహానగరమునుండి పోవుచునేయున్నది. వీనిపనిపట్టించి మఱి పోదమనుకొనిరో యేమో! అందుచేత నా రాత్రి కొంతవేళకు వానియింటిచుట్టు గడబిడ బయలు దేరెను. ఆ మాంధాతృమతస్థునియిల్లు తగులఁబడెను. వాని యింటఁ బసిబిడ్డబాలాదిగ నందఱు నఱుకఁబడిరి. వెంటనే రక్షకభటులు వచ్చిరి. వారిలో గొందఱు మడియింపఁబడిరి. అచ్చటికిఁగూడ మఱియొక సేనాభాగము వచ్చెను. ఆ గృహముకూడ మొదటి గృహమువలెనే యాధునిక దుర్గము వలె నుండెను. లోనఁ దుపాకులు ఫిరంగులు. అనిర్భేద్యము లైన గోడలు. లోన జనముండి సైనికులమీఁదఁ గాల్పులు మొదలుపెట్టుట. ఈ వార్త వల్లభమంత్రికిఁ దెలియఁజేయఁ బడెను. వెంటనే యిరువది సేనాదళములు ప్రత్యేకింపఁబడెను. ఎచట నెచట నీ లక్షణములు కనిపించునో యచటచటికి నీ సేనాదళములు పోవును. ప్రతిదళము ముట్టడించుటకుఁ దగిన సన్నాహములతో నుండును. ఆ స్థలములకు దూరములందు

గొన్నియిండ్లు వెంటనే నిర్జనములుగాఁ జేయఁబడియు నా యిండ్లను సైన్యము లాక్రమించుకొనుటయు నటనుండి యీ యిండ్లను వశపఱచుకొనుటకు బ్రయత్నించుటయు ఇట్టియాజ్ఞలు తంతుల మీఁద నడచినవి.

కాని యిదియంతయు సైనికరహస్యమయిపోయెను. సామాన్యప్రజల కేమియుఁ దెలియదు వారందఱు హాంగ రాజమతస్థుల దౌర్జన్యముచేత గొన్ని యేండ్లు బాధపడిన వారు. వారి మనఃప్రవృత్తి యెట్లుండుననఁగా దోమలను జంపుట కెక్కడనో గడ్డిమంటబెట్టుదురు. ఆ పొగ కొంత యాకాశము లోనికిఁ బోవును. ఈ పొగను జూచిన మాంఛూమతస్థులకు హాంగరాజీయు లేయిల్లో ముట్టించిరని భయము. అచ్చటికిఁ బోయి యా గడ్డిమంటఁ జూచెడివఱకు నెవ్వరికిని గుండె నిలువదు.

గుడూచీనగరము పదిమైళ్ళపొడవు, ఆఱుమైళ్ళ వెడల్పు. ఈ రెండు సంఘటనలు నొకటి తూర్పుదిక్కునందుఁ జివఱ. రెండవది నైఋతిదిశలో జరిగినది. ఎవరితలుపులు వారు బిడాయించుకొనిరి. వీథులవెంట మనుజులు తిరుగుటయే లేదు. కాని వార్తలు ప్రయాణముచేయుట యారంభించినవి. వార్త యశరీరిణి. అది యాకాశవాణి. అది మహాకవయిత్రి. దాని కల్పనల కవధియుండదు. ఒకనోటినుండి రెండవనోటికిఁ బోవువఱకుఁ జిన్నకోతి చింపంజి యగును. పిల్లి పెద్దపులి యగును.

తెల్లవాఱినది. నగరమంతయు ఫిరంగుల మ్రోతలతోఁ బ్రతిధ్వనించుచున్నది. హేతు వెవ్వరికిని దెలియదు. శశియొక్క

సైన్యము గుడనగరము నాక్రమించుటకు వచ్చెనని, యుద్ధము సాగుచున్నదని కొందఱు చెప్పుకొనసాగిరి. మఱికొందఱు హూంగరాజీయులు మరల విజృంభించిరి. నగరములోని ప్రజలను జంపివేయుచుండిరి. ఇండ్లలోనికిదూరి దోచుచుండిరి. పసిబిడ్డ బాలాది సంహరించుచుండిరి యని చెప్పికొనఁజొచ్చిరి. మేము పోయి చూచివత్తమని యెవరైన బయలుదేఱినచో నింటిలోని స్త్రీలు పోనీయరు. ఇంటిలో బియ్యము లేదు. పప్పులులేవు. కూరలు లేవు. ఒకఁడు తెగించి బయలుదేరినను నంగడులు లేవు. అంతకంటె నరాజకముండదు. ప్రళయమనఁగా నట్లే యుండును. ప్రళయమునకు దానికి నొక్కఁడే భేదము. ప్రళయములో సర్వజనులు నశించిపోవుదురు. ఇప్పు డిండ్లలో బ్రదికియుండిరి. సర్వరాజకార్యములు నడచుట మానివేసెను. ఆ నగరములో రాజ్యమున్నదా? పాలకులుండిరా? జనులు బ్రదికియుండిరా? పొరుగింటివార్త యిచటికిఁ దెలియునా? అంత నిస్తేజముగా నిశ్చేతనముగా నుండిపోయెను.

పై సన్నివేశమువంటిది వాయవ్యదిశయందు మఱి యొకటి జరిగెను. దానితోఁ దుపాకులమ్రోత నగరములో నిచట వినిపించుచున్నది యిచట వినిపించుటలేదని లేదు. ఫిరంగుల మ్రోతవరుస తూటాలమ్రోతలు.

ఇంకఁ బేదయిండ్లు కలవు. తేలికగా తలుపు లుతకలెత్తవచ్చును. వానికి రక్షణమే లేదు. వారెచ్చటఁ దలదాచుకొనవలయునో తెలియదు. ఆ దుర్మార్గులు తమయిండ్లమీదికి వచ్చినచో వారెట్లు బ్రదుకవలయును? సంవత్సరములు కష్టపడి

కష్టపడి గవ్వలుగవ్వలుగా, దమ్మిడీలు దమ్మిడీలుగా ప్రోవుచేసి రెండుమూడువందలో కొంచెము బంగారమో నిలువఁజేసికొని దానిని రక్షించికొనుట యెట్లా యను దిగులు వారి భయము యొక్క స్వరూపమయ్యెను.

## పంచమాధ్యాయము

గుడిమాచీనగరమునకుఁ బదిక్రోసులదూరములో కాల గిరి యను నొక పల్లెటూరు గలదు. ఆ గ్రామమంతయు హంగ రాజమతస్థులు. ఆ యూరిలో క్రొత్తగా మతాంతరులైనవా రెవ్వరును లేరు. వారి తండ్రులో వారి తాతలో మతాంతరు లయిరి. మాంధాతృమతములో నొకవిలక్షణమైనస్థితి యున్నది. దానిలో వర్ణభేదములు. ఈ వర్ణభేదములు లోకమునం దే దేశమునందును లేవు. ఈ విషయ మితరదేశములలోని వారి కాశ్చర్యజనకముగా నుండెను. ఆశ్చర్యమే కాదు, పరిహాస భాజనమయినది. ఈ వర్ణవ్యవస్థ సర్వమానవసమానతా ప్రథమ మానవస్వాతంత్ర్యసూత్రమునకు విరుద్ధమయినదని వారిసిద్ధాంతము. అందుచేత వారందఱకు మాంధాతృమతము సులభముగా జగత్తునుండి నిర్మూలించవచ్చునని పెద్ద యాశ. వారిరాజనీతి పైకిఁ బ్రజాస్వామ్యనీతియైనను నంతరాంతర మునఁ బ్రజలను విభాగించి పరిపాలించునట్టిది. పైకి సర్వప్రజలు నొక్కటియనుటయు, లోన మానవులను విడదీయుటయు వారి రాజ మానవనీతులలోని ప్రథమసూత్రము. వారి యీ రాజ నీతిలోని ప్రథమసూత్రమును మాంధాతృమతములోఁ బ్రయ త్నములేకుండ సిద్ధించినది. వారి కింక నేమికావలయును? తక్కిన

నీతిసూత్రము లాచరణలోనికిఁ బెట్టినచో మాంధాతృమతము నిర్మూలమయిపోవును. నిర్మూలమైపోయినతరువాత నేమి జరుగును? అందఱు సమానులగుదురు. వారి దేశములో వారి మతములో నందఱు సమానులేనా? ధనవంతులును బీదవారు లేరా? పాలించెడివారును పాలింపబడెడువారును లేరా? బలిష్ఠులును బలహీనులును లేరా? పొడుగయినవారును బొట్టివారును లేరా? స్థూలకాయులు బక్కపలుచనివారును లేరా? వివేకవంతులు నజ్ఞానులు లేరా? కుత్సితులును ముక్కుసూటిగాఁబోవువారును లేరా? ఈ లోకములోని సుఖములను త్రవ్వి తలకెత్తుకొందు మనుకొనువారును ఈ లోకము తుచ్ఛమని నిరాకరించువారును లేరా? గాయకులు ఖరస్వనులు, కవులు నంగిమాటలవారు, సుందరులు వికారస్వరూపులు లేరా? దేశమే యొకొక్కచోట నెక్కువగాఁ బండును. మఱియొకచోటఁ దక్కువగాఁ బండును. ఒకచోట వానలు కురియును. ఒకచోటఁ గురియవు. ఒకచోట నదులు ప్రవహించి, నేల రేగటిమట్టియై కుంచెడు గుమ్మరించినచో రెండుపుట్లు రాలును. మరియొకచోట నిసుకయెడారి. ఒకచోఁ బర్వతము. మఱియొకచో సముద్రప్రదేశము. కాలము చూచినచో నొకప్పుడు తెగవానలు, మఱియొకప్పుడు బెట్ట. ఒకప్పుడు చలి. ఆకు పచ్చిగానుండుటలేదు. చెట్లు మోళ్లుగాఁ గనిపించును. మఱి నెలతిరుగునప్పటికిఁ బసిమి పసిమి చివురాకుల సొరులతో వనాంతము పండ్రెండేళ్ళకన్య పరికిణీ చెంగుజీరువాఱఁ బయనించినట్లు తోఁచుట. ఈ సర్వప్రజ లొక్కటేయనువారు, సర్వమానవసమానత పాలించువారు దీనిలోని యేని యసమానత వారింతురో తెలియదు. సమానత యనఁగా జననమరణములు

సమానములు. సుఖదుఃఖములు సమానములు. పెండ్లము బిడ్డల యందు దండఅకుంౘ భేదయుండును. తనదియనుకొన్న దానియందుం బ్రతివాని కభిమాన ముండును. ఈ యనురాగము లీ ద్వేషములు ప్రధానవస్తువునందు సమానములు గాని, వాని విజృంభణములందు వాని క్రియాదశలందు సమానములుగావు. సుజన కుజను లిద్దఱికి నొక వాంఛ కలుగును. ఆ వాంఛాపరిపూర్తి కలుగుమార్గములు తక్కువ. సుజను డుపసంహరించుకొనును. కుజనుఁడు దానియందే ప్రవర్తించి తన జీవితము రొష్టుపెట్టి కొనును. పరజీవితము వెక్కసపెట్టును. ఈ సర్వమానవ సమానతాసూత్రవాదులలోనైనను జాల భేదములు కలవు. ఒకరు సర్వసమానతయనఁగా సర్వసమానత యనియే చెప్పుదురు. మఱికొంద ఱార్థికవిషయములయందు సమానతయని చెప్పుదురు. ఆ సమానత నెట్లు సాధింతురో తెలియదు. పండినచోట్లు నెండినచోట్లు ఈ రెండుచోట్లొక్క రాజుపాలనక్రింద నున్నవి. పండినచోటఁ గన్న నెండినచోటఁ బదార్థము వెల యెక్కువ యుండును. ఈ వెల యెక్కువ వర్తకులుచేసిన దందురు. పండినచోట మిగిలినవస్తువు నెండినచోటికిఁ బాలకులే తీసికొనిపోయి యిత్తురందము. ఇచ్చటినుండి యచ్చటికిఁ దీసికొని పోయి యిచ్చుటకు వ్యయమగును గదా! ఆ వ్యయము వస్తువు యొక్క వెలమీఁదఁ బడునా పడదా? ఆ వ్యయము పాలకులే పెట్టుకొందురనుకొందము. పాలకు లెచ్చటనుండి తెచ్చి పెట్టుకొందురు. ప్రజలనుండి పన్నులరూపమున దీసికొనిన ధనములోనుండి పెట్టవలయును. ఇది కాదు. దేశమంతయు నొకటే రాజ్యము. సొత్తంతయు రాజ్యముదే. ప్రజలకు లాభనష్టము

లతోఁ బనిలేదు. వారందఱకుఁ గూడు గుడ్డ లోపములేకుండఁ జేయుదుము. వారి కార్థిక క్లేశములు లేకుండఁజేయుదుము. దేశసంపదయంతయు దేశముదే యగును. ఆ దేశము సస్యవంతమైనచో లాభములు మిగులును. ఆ లాభములు ప్రజలకుఁ బంచుదురా? సైన్యములుపెంచి యుద్ధములుచేయుదురా? రాజకీయవేత్తలు చెప్పెడి వేయి సిద్ధాంతములు విచిత్రమైన స్వార్థవృత్తితో గూడికొనియుండును. వారిలోఁ గొందఱి స్వార్థత దృశ్యమానముగా నుండదు. అది యాంతరమైన దురభిమానలక్షణముగా నుండును. తన సిద్ధాంతము సర్వోత్కృష్టము. అది సర్వజనులచేత నాచరింపబడవలయును. ఆచరింపబడినచో సర్వమానవక్షేమము కలుగును. కలుగునని వారు చెప్పుదురు. కొందఱు విశ్వసింతురు. ఏదియైనను విశ్వాసముమీదనే యాధారపడియున్నది. ఆ గొడ్డు మంచిదయినచో నా యూరిలోననే యమ్ముడుపోయెడిది. తనకు విశ్వాసమున్నచో తన యున్నచోటనే శాంతి లభించును. ఈ సర్వ రాజకీయవేత్తలు, నీ సర్వమతప్రచారకులు శాంతి మానవునియెదలో నున్నది, వానియంతట వాఁడు సాధించికొనవలసిన వస్తువు అన్న పరిజ్ఞానములేని జాతి. సర్వరాజకీయసూత్రములు సర్వరాజ్యాంగ విషయములు మానవునియొక్క సృష్టిలక్షణముయొక్క సూక్ష్మ పరిజ్ఞానము కలిగినతరువాతఁ జేయవలసినవి. అంతర వేత్తలుకాని బాహ్యరవిడంబనులు సర్వథా లోకోపద్రవహేతువులగుచున్నారు.

ఈ కాలగిరిలోని హంగరాజీయు లేతాదృగ్విశిష్టభావనా లక్షణముల కనంతక్రోశములదూరములో నున్న దురావేశ

పకులు. తక్కిన దేశములలోని ప్రజలు ప్రజారాజ్యాంగవేత్తలు మతములు మతనిర్మాతలు మతప్రచారకులు నేఁతి స్వార్థ భావనులో వారందఱిని కలిపినంత స్వార్థభావనులు వీరు. మూఁ భాతృమతనిర్మూలన ప్రయత్నము వేలయేండ్లుగా జరుగు చున్నది. ఆ మత మట్లే యున్నది. దీనికిఁ గారణము తన్మతము నందు వారేది దోషమని భావించికోయదియే.వర్ణవ్యవస్థ యీ మతమునకుఁ బెద్దదోషమని వారనుకొనిరోయదియ యీ మతా భిప్రాయములను నిలువద్రొక్కికొనుటకుఁ బెట్టనికోట. సృష్టి యంతయు దేశము కాలము మానవుడు విశ్వాసములు ప్రజా జీవితము భిన్నతతోఁ గూడుకొనియున్నది. ఆ భిన్నత్వమును బరిగ్రహించి యంగీకరించి, భిన్నములయినచోట్ల భిన్నతను బాటించి, భిన్నతలేనిచోట్ల సమానత నాచరింపజేసి వ్యవస్థ యేర్పఱచిన సంఘము నిరుపద్రవమయినది అట్టి పరిజ్ఞానము లేక నిర్మించిన సంఘము సోపద్రవమయినది. భేదము లాచారములందు, విశ్వాసములందుఁ బ్రవృత్తు లందు ధర్మములందు. భేదములేకపోవుట యుష్ణశీతములయందు సామాన్య కామాదులయందు వానిని, వీరిని గలిపి చేయుట మానవజాతియొక్క నిర్మూలనహేతువు. నిర్మూలనము ద్విధా భూతమయియుండును - ఆంతరము బాహిరమునని. బాహిర ముగా సమానత్వము తెచ్చితిమనును. ఆంతరముగా నది ప్రళయము గాని వ్యవస్థాసంపన్నమయినవిషయము గాదు.

ఈ కాలగిరివాసులు ఆశయాకృతులు. అచటి సర్వ స్త్రీ పురుషులు నొకొక్క రొకొక్క యగ్నిపర్వతము. అగ్ని పర్వతమయినను నయమే. లోపల రాజి రాజి గాని నిప్పు

లుమియదు. వారు లో రాజనక్కఱలేదు. వారికిఁ బ్రశాంతి యను లక్షణము మానవాత్మలో నొక్కఁడుండునని తెలియదు. సంగీత సాహిత్య నాట్యము మొదలయిన హృదయవిద్యల కా వీటఁ దావులేదు. ఆ యూరిలోఁ బోయి యొకనిపేరు చెప్పి వారి యిల్లెక్కడనని నీ వడిగి తెలిసికొనలేవు. నీ వదృష్టవంతుఁడ వయినచో వాఁడు మాటాడకుండఁ బోయెను. కానిచో నిన్ను గోపముతోఁ జూచును. నీచముగాఁ దిరస్కరించును. అట్టి యూ రది.

రంగీలా హీరానాట్యము ప్రదర్శింపబడునని గుడనగర కుడ్యములమీఁదఁ బ్రకటనపత్రము లంటించబడిన మరుదినము నా గ్రామవీథులలో దిరుగుచుండెను. అతని కెవరియిల్లో కావలయును. ఇద్దరు ముగ్గురి నడిగినాఁడు. చపేటావధివచ్చి తోలగినాఁడు. ఒకఁడెవఁడో యా వైపున నున్నదని చెప్పెను. ఎవని మొగము చూచినను బ్రశ్నించుటకు వీలులేకున్నది. ఒక్కొక్కఁడు కాలాకృతి. ప్రతివాఁడు బలిష్ఠదేహుఁడు; ఆజానుబాహువు. పొదలువోని కన్బొమలవాఁడు. ఎఱ్ఱనికన్నులవాఁడు. తిరస్కారము కోపము చెక్కిళ్ళయందుఁ బెదవులమీఁద కూరుచున్నవాఁడు. వారికన్నులఁ జూచినచో భయమువేయుచున్నది. వా రెప్పుడయిన నవ్వుదురా? వారికినిఁ బెండ్లము బిడ్డలుందురుగదా! వారివిషయములోనయిన వీరియెదలలో మెత్తనిభావములు కలుగునా? పెద్దపులులకును బిల్లలు కలవు. వాని నవి చంపవు. వాని కాపదరాకుండఁ జూచుచుండును. తల్లి పెద్దపులి యొక లేడిని జంపెను. దానిమాంసమును దినుచుండెను. పిల్లలా మాంసమును దినుటకు వచ్చును. వానినిఁ

బజారులో విదలించుము. తా నంగుళించినవాత నవి. ఇది పసు ప్రేమ. ఇట్టి దాదా?

రంగీలా కొంతదూరము పోయెను. అచట నొకవృద్ధుఁడు కూరుచుండెను అతనికిఁ డెబ్బది యేండ్లుండవచ్చును శరీరము ముడుతలుపడియున్నను వానియందు సత్త్వముపోయినట్లు లేదు. వార్ధక్యముచేతనో యేమో మొగమునందంత తీక్ష్ణత లేదు. రంగీలా వానివద్దకుఁ బోయి కాలంజరియెల్లెచ్చటనని యడిగెను. ఆ వృద్ధుఁడు తా నేదియో తినుచుండెను. తినుచున్నవస్తువు గుప్పెడుతీసి రంగీలా మొగమున విసరెను. వస్తువు మెత్తనిదే. తగిలినదెబ్బ పెద్దది. రంగీలా మొగముతుడిచి కొని మరలఁ బోయెను.

ఈ కాలగిరి గుడూచీనగరమునకు గుడనగరమునకు సరిగా నడిమిభాగమునఁ గలదు. ఊరుమాత్రము గుడూచి రాజ్యములోనిది. ఆ గ్రామము నదియొడ్డున నున్నది. ఆతలి వైపున నున్నది. నదియే సరిహద్దు. రంగీలా దెబ్బతిన్నచోటి నుంచి నది కన్పించుచున్నది. నది కాలగిరివైపున నిసుకతిన్నెలు వేసియున్నది. నదీప్రవాహము గుడరాజ్యమువైపున నున్నది. పడవలలోనెక్కినజనులు సులభముగా నిసుకతిన్నెలమీద దిగవచ్చును. తాను వచ్చెడునప్పుడు చూచినాడు. కాలగిరికిఁ బ్రాగ్దిశయందు మూడునాలుగు చిన్నగుట్టలు కలవు. నదియొక్క యొడ్డునందు తెల్లు పెరిగియున్నది. చాలభాగ మెండియున్నది. ఆ యూరు పర్వతప్రదేశమనుటకు వీలులేదు. అడవి యనుటకు వీలులేదు. తెల్లు గ్రామముచుట్టును వ్యాపించియున్నది. ఊరికిఁ బడమటిభాగమున సారవంతమయిన నేల కలదు. ఎంతయో

చక్కగాఁ బండించవచ్చును. కొంత వ్యవసాయమున్నది కాని,
యెవనికిఁబుట్టినబిడ్డరా యెక్కనెక్కి యేడ్చుచున్నదన్న
ట్లుండెను. ఈ యూరివారు సోమరులు. దోచుకొనితినుట మర
గినవారు. వ్యవసాయము చేయుటకు డగిన నేల యుండగా
గొఱ్ఱెలను మేకలను మేపికొనుచు బ్రదుకుట యుత్తమముగా
భావించినవారు. ఆ యూరిలో నునుపుతేరి నాగరకముగాఁ
బుష్టిగాఁ గనిపించుచున్నవి, కొంత శాంతముగానున్నవి
రెండే జంతువులు. ఒకటి గుఱ్ఱములు, రెండు బఱ్ఱెలు. ఆ బఱ్ఱె
లొక్కొక్కఁడు పూటకుఁ బదిశేర్లపాలు పిండునట్లున్నవి.
గుఱ్ఱములు వాయుదేవుడు సంచారముచేయునట్లున్నవి. ఆ
ఊరు పశ్చిమముఖముగా నున్నది. ఒక గుట్టనానించి యిండ్ల
న్నియు గట్టఁబడినట్లున్నవి.

రంగీలా మొగముదుడిచికొని పోయెను. స్త్రీల నడుగ
వలయునుగాని పురుషుల నడుగరాదనుకొనెను. స్త్రీ లెచ్చటను
గనిపించుటలేదు. ఊరకయే గ్రామమునందు దిరుగుచుండెను.
ప్రొద్దెక్కె యొక వృద్ధురాలు కనిపించెను. కొండ మలుపుతిరి
గినచోట విడిగా నొక చిన్న కుటీర మున్నది. ఆ యూరిలో
నున్న యెక్కడే యంగడిలో నేమియో కొని యామె యా
బుట్ట చేతబుచ్చికొని పోవుచుండెను. ఇత డామె వెనుక నే
నడువజొచ్చెను. నీ వెవరవని యడిగినవాఁడు లేఁడు. ఈ యూరు
లోనికి గ్రొత్తవాఁ డెందులకువచ్చెనా యని యడిగినవాఁడు
లేఁడు. ఆ వృద్ధురాలు వృద్ధురాలయినను దంతము లూడలేదు.
కనుచూపు తగ్గలేదు. ఒడలిలో జవసత్త్వములు తగ్గలేదు. కాని
వృద్ధురాలిలక్షణములు సమృద్ధిగా నున్నవి. ఊరిచివరియిల్లు

దాటినతరువాత నామె రంగీలావంక వెనుదిరిగి చూచెను. ఆమె భాషలో నీ వెవరవని యడిగెను. ఆ భాష రంగీలాకు వెన్నతోఁబెట్టిన విద్య. అతఁ డామె మొగములో నొక యొయ్యారమయిన ప్రసన్నతఁ జూచి యిట్లనెను: "అవ్వా! నా పేరుచెప్పినచో నీవుకూడఁ గొట్టవుగదా." ముసలిది నవ్వెను. ఆ నవ్వుట యొక ముసలియాఁడుపులి సన్నముగా నావులించినట్లుండెను. అతఁడు తనపేరు హంగాది యని చెప్పెను. నీ పేరేమియని యామెనడిగెను. ఆమె చెప్పలేదు. ఆమె నడచుచుండెను. ఇతడు వెంటనంటెను. ఆమె తన యింటికిఁ జేరెను. ఇత డింటిముంగిలికిఁ జేరెను. ఆమె యింటి లోనికిఁ బోయెను ఇతఁడు వాకిటనే నిలుచుండెను. వాకిటిలో నొక బఱ్ఱె యుండెను. పాలిచ్చునదే. ఒక కుక్కిమంచముం డెను. ఒక పేడప్రోవు. బెజ్జాలుకల యొక వెదురుబుట్ట గూడుగా నల్లినది బోర్లించియుండెను. దానిక్రింద నై దాఱుకోళ్లు, కోడి పిల్లలు కలవు. కొంతదూరాన మేక యొకటి కట్టివేయఁబడెను. అది చూడిదో పాడిదోఁ గాని గేదెయు మేకయుఁ గోళ్లును బుష్టములుగా నుండెను. ముసలిదొక్కతియే బక్కచిక్కి యుండెను.

అది చిన్న గుడిసె. లోనికిఁబోయిన ముసలిది కాలము గడచుచున్నను బయటికి రాలేదు. ఇత డట్లే నిలుచుండి కొంత సేపటికి నా కుక్కిమంచములో జదికిలఁబడెను. ఆమె గంటసేప టికి వచ్చెను. అతఁ డచ్చటఁ గూర్చున్నాఁడని యామెచూచెను. అనగాఁ జూడలేదు. కూర్చున్నాఁడని యామెకుఁ దెలియును. మానవులు చూడకుండఁ జూతురు. ఆ చూచుటలో నున్నట్లు

తెలియును. అది చూచుటకాదు, తెలియుట. ఆమె యతనిని బలుకరించలేదు. అతనివంకఁ జూడనేలేదు. గేదెనువిప్పి మఱి యొకచోటఁ గట్టివేసినది. మేకదగ్గఱకుఁ బోయి చూచి వచ్చినది. మరలవచ్చి గేదెమెడపలుపూడదీసినది. దానిని కొండమీఁదికిఁ దోలినది. తిరిగి యింటికి వచ్చినది. కోళ్లబుట్ట కదిలించినది. బుట్టతీసి పెడగా బెట్టినది. కోళ్లను మేఁతకు వదలి పెట్టినది. లోనికిఁ బోయినది. లోనుండి యొక కోడిని బయటికిఁ దోలినది. అది గ్రుడ్లని బెట్టినదో, పొదుగుచున్నదో! మరల నింటిలోనికిఁ బోయెను. ఒక బిందెపుచ్చుకొని పోయినది. కను చూపుమేర నొక చిన్న బావి కలదు. ఆ బిందెతో మూడుబిం దెలనీళ్లు తెచ్చినది. రెండుబిందెలనీళ్లు గుడిసెలోనికి దీసికొని పోయినది. ఒక బిందెడునీరు వాకిటిలోనున్న యొక తొట్టెలోఁ బోసినది. పోసి తొట్టెలో నడుమనున్న చిట్టోతవుడో చేతితోఁ గదిపినది. ఆ చేయి కట్టుకొన్నచీరకే తుడిచినది. అప్పటికి జాము జామున్నర ప్రొద్దెక్కినది. లోనుండి యొక కచ్చికయుఁ జెంబెడునీళ్లు తెచ్చి దంతధావన మారంభించినది. దంతధావన మయినది. ఆమె దంతధావనముచేయుచుండగా రంగీలా నాలుక గీసికొనుట కొక వాడిగల సన్నని బద్ద తీసి యామెదగ్గఱఁ బోయి నిలుచుండెను. ఆమె కచ్చికతో దంతములు తోమి నీళ్లు పుక్కిలించఁబోవుచున్నది. అతఁడా బ్రద్ద నామెచేతికీయఁ బోయెను. ఆమె యతనినిజూచి నవ్వి యా బ్రద్దను దీసికొని నాలుకగీసికొనెను. అతఁడు పోయి మరలఁ గుక్కిమంచము పైనఁ గూర్చుండెను. మఱికొంతసేపటికి ముసలిది కాలుచేతులు కడిగికొని తా నొక కంచములో రొట్టెలుపెట్టికొని, మఱియొక

కంచములో నతనికి రొట్టెలుపెట్టి రెండుమూడు వ్యంజనములు వేసి కూర్చుండెను. తాను తినదు. అతనిని బిలువదు. రంగీలా కొంతసేపటికిఁ బోయి లోనికి దొంగిచూచెను. సంగతి గ్రహించెను. ఆమె రమ్మనలేదు. సెగచేయలేదు. తానే పోయి కాలుసేతులు గడిగికొని కంచముముందు కూర్చుండెను. ఇద్దరు రొట్టెలు తిననారంభించిరి. రంగీలా చెప్పనారంభించెను: "నా పేరు హంగాది. మాది గుడనగరముదగ్గఱ నొకపల్లెటూరు. మేమును హంగమతస్థులమే. నాతండ్రియు తల్లియు జిన్నతనముననే చని పోయినారు. నన్ను మా మేనత్త పెంచినది. నాకు సంగీతము వచ్చును. తబలా వాయించగలను. దానిమీాది సంపాదన యేమి సంపాదన? ఎప్పుడయిన దొరకినచోఁ బదిరూకలుదొరకును. ఆ పదిరూకలువచ్చిననాఁడు పండుగ. తక్కిన యిరువదితొమ్మిది దినములు వట్టి పొగత్రాగుచు బ్రదుకుటయే. నే నెక్కడనైన నుద్యోగముచేయవలెనని తోచినది. నా కుద్యోగ మెవరిత్తురు? చదువులేదు, సంధ్యలేదు. మూాడునెలలక్రింద నొకసంఘటనము జరిగినది. ఒక సైనికు డొంటరిగా గుడనగరములో నాగ్నేయదిశయందు నొక సందులోఁ బోవుచుండెను. అతడు మన మతస్థుఁడు. ఆ సందులో మాంధాతృమతస్థులు కూలినాలిచేసి జీవించెడివారు. కాని వచ్చిరౌడీలు. ఒకప్పుడు కొందఱు సైనికులా పేటలోనికి వెళ్లి యిండ్లలోదూరి నానా భీభత్సములు చేసిరట. అప్పటినుండి వారికి హంగమతస్థులైన సైనికులన్నచోఁ బట్టరానంత కోపము. ఒంటరిగా నెవ్వడైన హంగమతస్థుఁడు సైనికుఁ డా పేటలోనికిఁ బోవుట తటస్థించి నచో నతడు బ్రదికి బయటఁబడఁడు. వాఁడేమయ్యెనో యెవ్వరి

కిని దెలియదు. ఆ పేటలో వంద వందపాతిక యిండ్లున్నవి. యమలోకములోనికిఁ బోయి తిరిగిరావచ్చును. ఆ పేటలోనికిబోయి మరల తిరిగి యెవ్వఁడు రానేరఁడు. సరిగా నా పేట యీ యూరువంటిది."

ముసలిదాని పెదవిమీఁద జిఱునవ్వు తాండవించెను.

రంగీలా మరల నిట్లారంభించెను: "పదిమంది కఱ్ఱలను కత్తులను దీసికొని వానినిజంపుటకు వచ్చిరి. నే నపు డచ్చట నుంటిని. నేను పెద్దపెద్ద సంగీతసభలుజరిగినచో తబలా వాయింతును. ఆ వాద్యములో నేను ఘటకుడను. కాని యీ సభలతో గూర్చున్నచో నాకు జీవితము గడువదు. అందుచేత నేను సంగీతపుబెట్టె వాయించుచుఁ బాడుచుఁ బేటపేటలకుదిరుగు చుందును. మరియు నిట్టి పేద బిక్కజనములుగలపేటలలో నా సంపాదన యెక్కువ. నా కనేకములైన యసభ్యపుఁబాటలు వచ్చును. వానిని నే నభినయించుచు బాడుదును. నడుమనడుమ నృత్యముచేయుదును. ఎడమచేతితో సంగీతపుబెట్టె లాగుచు నోటితో బాడుచుఁ గుడికాలికిగజ్జెలుకట్టి ప్రయోగించుచు గుడిచేతితో సన్నని చిడతలు వాయింతును. నా చిడతలవాద్యము విన్నవారు నన్నువదలిపెట్టరు. ఆ పేటలో నే నున్నచో నందఱికి నిష్టమే. చిన్నపిల్లలకు మఱియు నిష్టము. అందుచేతఁ దల్లులు తండ్రులు నన్ను తమపేటలోనివానిగనే జూచుకొందురు. నా మతమును వారు లెక్కపెట్టరు. నా కెచ్చటను దిండిదొరక నిచో నా పేటలో నెక్కడో యొకచోట నా కన్నము పెట్టుదురు. ఆ సైనికు డెవ్వఁడో నాకుఁ దెలియదు. అతనికిఁ బ్రాణము మీఁదికివచ్చినది. ఆ సంగతి యతనికిఁ దెలిసెను. మఱియొక

నిముసములో వానిశిరస్సునఁ బడి కర్రదెబ్బలు, వాని దేహ ములో బడి కత్తిపోట్లు తగిలియుండును. నే నదియేమియు నెఱుఁగనివానివలె వానివద్దకుఁ బరుగెత్తివెళ్లి పోయి కౌగిలించు కొంటిని. ఎప్పుడునచ్చితివని యడిగితిని. అతఁడును దొలుతఁ గొంచెము దిగ్భ్రాంతుడయ్యెను. వెంటనే తెలివితెచ్చికొని నా బంధువువలె నాతో మాటాడనారంభించెను. ఇదియంతయు జుట్టుననున్నవారందఱు చూచిరి. అతఁడు నా చుట్టమనుకొనిరి. కత్తులును గర్రలును దీసికొనివచ్చి, యితఁడు నీ కేమగునని యడిగిరి. నా పినతల్లికుమారుఁడని చెప్పితిని. వాని పేరేమిటని నన్నడిగిరి. వారినోటిమాట వారినోటియందుండగనే యతఁడు తనపేరు చెప్పెను. నే నొకపేరు చెప్పి వా డొకపేరుచెప్పెడి యాపద తప్పినది. అపుడు వారితో నే నిట్లంటిని: 'నా పేరు హంగాది. వానిపేరు ఆదిహంగ. మేమిద్దఱము మాతాతగారి యింటనే పెరిగితిమి. చిన్నప్పుడు నాతండ్రి చనిపోయెను. వాని తండ్రి దేశాంతరగతుడయ్యెను. మా తల్లులిద్దఱు మమ్మిద్దఱను దీసికొని మా తాతగారియింటికిఁ బోయిరి. ఇద్దఱు నొకయాడు వారమే. కలిసి యాడుకొంటిమి. ఒకకంచములో తింటిమి, యొక మంచములోఁ బండుకొంటిమి.పదియేండ్లువచ్చువఱకు గలిసియే యుంటిమి.తరువాత నాదిహంగను వానిపినతండ్రి తానుపోషింతు నని తీసికొనివెళ్ళెను. నేను వీనిని జూచి పండ్రెండేండ్లయినది. మరల నీనాఁడు చూచితిని. వెంటనే గుర్తుపట్టితిని. నా ప్రాణ ములు లేచివచ్చినవి' యంటిని. ఆదిహంగ ఔనురా! నేను గుర్తు పట్టలేదు నీవువచ్చి కౌగిలించుకొని నవ్వినంతనే నాకుఁ దెలిసి నది. నీవేమైతివో నాకుఁ దెలియలేదు. నేను నిన్నెన్నిసారను

కొంటిని. భగవంతునకుఁ దెలియవలెను. నా పినతండ్రి నన్ను బెంతునని తీసికొనివెళ్లినేకాని, యచ్చట నేనుబడినకష్టములు కుక్కలుకూడఁ బడవు. నా పినతండ్రికొడుకులు ముగ్గురున్నారు. ఇద్దఱు నాకంటెఁ బెద్దవారు. ఒకడు నాకంటెఁ జిన్నవాఁడు. చిన్నవాఁడు పెద్ద దయ్యము. వారుముప్పురు కలసి నన్నేడిపించిన చేడిపించుటయా! ఆ యింట నా బ్రతుకు దుర్భరమైపోయెను. నే నా యింటిలోనుండి తప్పించుకొనిపోవుట యెట్లా యనియే దిగులుపట్టుకొనినది. కాని వారితోబాటు నాకును మోటుతన మలవాటయ్యెను. నన్ను జూచెడివారు లేరు. నా పినతండ్రిభార్య తనకొడుకులు నన్నెంత యేడిపించినను, గొట్టినను, దిట్టినను వారి నేమియు ననెడిదిగాదు. నే నెచ్చటఁ బండుకొన్నానో యామె కవసరములేదు. నేను బ్రదికియున్నానో లేదో యామెకుఁ బట్టలేదు. కొడుకులను తిండికిఁ బిలిచెడిది. నన్ను బిలిచెడిదికాదు. ఆవేళకుఁబోయి నాయంతట నేనే వారితోఁ బోయి తిండికిఁ గూర్చుండెడివాఁడను. అది యేమి చిత్రమో వారికెట్లుపెట్టెడిదో నాకు నట్లే పెట్టెడిది. ఏదియైన రుచిగలవస్తువు నాదగ్గఱనుండి వారుముప్పురలో నెవ్వడైన లాగుకొన్నచో వానిని కోపపడి యా వస్తువు నాకు రెట్టింపు వేసెడిది. ఆ యింట నాకు సుఖమేమియు నుండెడిదిగాదు. తిండి కెప్పుడును లోపములేదు. కాని నాయంతట నేనే పోయి కూర్చుండవలయును. నా పినతండ్రికి నాగోడే పట్టుటలేదు. మా పిన్నయ్యకొడుకులతో నేనును మిక్కిలి మోటువాడనయితిని. కర్రసాము, కత్తిసాము, గుఱ్ఱపుస్వారి, కొండలెక్కుట, కాలువలుదూకుట, దెబ్బలుతగిలినచో లెక్కసేయకపోవుట

యొకనాఁడు నెత్తురుకారుచుండఁగా రెండవనాఁడు శిరోభ
మింపఁబడి కఱచుట కొట్టుట యీ విద్యలన్నియు నా పినతండ్రి
కొడుకులతోఁబాటు నాకును వచ్చినవి. వారికంటె నెక్కువ
వచ్చినవి. ఆ యూరిలో నా యీడువారు నాముందఱ నెవ్వఁడు
నిలిచెడివారుకాదు. నా పినతండ్రికొడుకులును నాముందాగ
లేరు. ముగ్గురను గలిపికూడ నేనొక్కనాఁడ తిన్నఁగలను. కాని
వారు ముగ్గురు నన్ను గొట్టినను, తిట్టినను నోరుమూసికొని
యుండెడినాఁడను. నేను వారికి మాత్రము లోకువనైతిని.
అచ్చట నేను నేర్చిన విద్య యిది. ఇంతలో మా యమ్మ చని
పోయినది. మా నాయనతోఁడబుట్టువున్నది. ఆమె కాలగిరి
యన్న గ్రామములో నున్నది. ఆమెకు దోడులేదు. ఆ కొంప
విడిచిపోయినచోఁ జాలని నే నాయూరు పోయితిని. ఆ నా
మేనత్త నన్నుజూచి నెత్తినబెట్టుకొన్నది. ఐదేండ్లచ్చట
నుంటిని. ఆమె కన్నిపనులు చేసిపెట్టితిని. బఱ్ఱెలను, మేకలను,
గొఱ్ఱెలను నేనె పాలించితిని. ఆమె కొండప్రక్కనఁ గూరపాదులు
వేసెడిది. మరియు గొంతమేర ద్రవ్వి జిలగడ్డలు వేసెడివాఁ
డను. గోధుమ చల్లెడివాఁడను. ఆ యూరు మిక్కిలి మోటు
యూరు. నన్నాయూరిలోని బాలకులందఱు తొలుదొలుతఁ
బరిహసింపనారంభించిరి. తరువాత తరువాత మోట
తనములో నేను వారికంటె తక్కువవాఁడనుగానని తెలిసెను.
ఆ యూరిలో నలువదియేండ్ల ముసలివాఁ డొకఁ డున్నాఁడు.
వానియంతటి కత్తిసాము నేర్చినవాఁ డా యూరిలో లేఁడు.
అతనినిఁజూచినచోఁ దక్కినవారందఱికి భయము. వానికొడుకు
నా యీడువాఁ డొకనాఁడు నేనూఱకే దారివెంటఁ బోవుచుం

డగా నామీఁదఁ దా నొక యరటిపండు తిని తొక్కలు బుద్ధిపూర్వకముగా నాపైఁబడునట్లు విసరెను. నేను వానిని దెబ్బలాటకు రమ్మని పిలిచితిని. వాఁడు కఱ్ఱపుచ్చుకొని వచ్చెను. ప్రక్కనే యొకదడికిఁ బాతినకఱ్ఱను లాగి నేను వానిమద మడఁగించితిని. ఇదియంతయు వానితండ్రి చూచుచునే యుండెను. ఇరుగుపొరుగువారు పది పదునేనుగురు గుమిఁగూడిరి. ఆ వృద్ధునకు నే నన్నచో మెప్పుదలయు గల్గెను. నా మీఁద గోపమును వచ్చెను. గిల్లి ఖజ్జా పెట్టికొన్నది తన కొడుకు. నేను బేదరాలయిన యొక ముసలిదానికి మేనల్లుఁడనయినను నూరిలోని వాఁడనే. అందులోఁ దన కొడుకుతోఁ బోట్లాడుచు నెంతసేపటికి వానిదెబ్బలు తట్టుకొంటినిగాని, వానిని దిరిగి మోపుగాఁ గొట్టలేదు. ఒకటి రెండుసార్లు 'మనయూరిలో నీ తండ్రి మహా ఖడ్గవిద్యావేత్త. ఆయనయందలి గౌరవముచేత నిదిగో యీ దెబ్బ నిన్ను గొట్టుటలే'దని రెండు గొప్ప వాట్లు వదలిపెట్టితిని. ఆ ముసలివాఁడు తాను నా వద్దకువచ్చి 'కఱ్ఱలతోఁ బోట్లాడుటలో మొనగాఁడవే. నాతోఁ గత్తియుద్ధము సేయుదువురా' యనెను. నేను సరేయంటిని. ముసలివాఁడు లోనుండి రెండు ఖడ్గములు తెచ్చెను. ఇద్దఱము యుద్ధమారంభించితిమి. ఊరంతయు గుమికూడినది. అతఁడు నెఱజోదు. నేను ముక్కుపచ్చలాఱనివాఁడను. అతనితో నేను యుద్ధమాడుటకు నంగీకరించుటయే తప్పు. ఆ యూరి కది యమర్యాద. పది నిముసములు యుద్ధము జరిగినది. అతఁడు నన్నేమియుఁ జేయలేకపోయినాఁడు. చివఱ కాయన యుద్ధమాపి నిలుచుండి నావంక తీక్ష్ణముగా జూచి తలయూడించి

పోయెను. అనఁగా నీవు మహా ఖడ్గవిద్యానిపుణుఁడవు, నిన్ను మెచ్చుకొంటినని యర్థము. ఆనాటినుండి నా కా యూరిలో గౌరవము మొదలుపెట్టెను. ఆ యూ రొక చిత్రమైన యూరు. అందఱును దొంగలే! ఎప్పు డేయూరుమీఁదఁబడి దోచుకొందురో తెలియదు. ఏ వర్తకసంఘము దారివెంట బోవుచుండగా ముట్టడింతురో తెలియదు. ఒకొకప్పుడు ధనము తీసికొని చుట్టుపట్లనున్న కొన్ని చిన్నరాజ్యములలో సేనాభాగములలోఁ జేరి యుద్ధములవంటి కలహములలోఁ బాల్గొందురు. అట్టివానిలోనికి నన్నుగూడఁ దీసికొనిపోవనారంభించిరి. కాని పట్టుమని యెవ్వఁడును రాజోద్యోగము జేయఁడు. రాజసైన్యములోఁ జేరఁడు. అది వారి కమర్యాద. రెండేఁడ్లు గడచినతరువాత నా కా దొంగవృత్తిలో రుచిలేకపోయెను. రాజసైన్యములోఁ జేరవలెననిపించెను. నా యీ యూహ యా యూరిలో దెలిసినచో మఱునాఁడు నన్నుఁ జంపివేయుదురు. రహస్యముగా మా మేనత్తతో జెప్పితిని. నే నామెను వదలిపెట్టిపోవుట యామె కిష్టములేదు. కాని యామె కా యూరివారిమీఁద నభిమానము లేదు. ఆమెభర్త నే నచటికిఁ జేరకముందు మూఁడు నాలుగేండ్ల క్రిందఁ జనిపోయెను. ఆయన యా యూరికిఁ బెద్ద. అతనిపేరు చెప్పినచో సింహపుఁబిల్లలు పాలుత్రాగెడివి కావట! ఒకనాఁ డాయన భోజనముచేసి కూర్చుండి పొగత్రాగుచు నూరకే ప్రాణములువిడిచెనట! ఆయనభార్యకూడ ఖడ్గవిద్యాప్రవీణురాలు. గుఱ్ఱపుస్వారి చేయగలదు. ఒకప్పుడు పురుషులందరు దారులుకొట్టుటకుఁ బోగా వారి యూరిమీఁదికిఁ గొందఱు విరోధులు దాడిచేసిరట. ఊరిలోఁ బసిపిల్ల

లును స్త్రీలును పదునాలుగేండ్లలోపు బాలురును దప్ప మఱి యెవ్వరును లేరు. ఆమె నాయకత్వమువహించి దాడివచ్చిన వారిని గొందఱిని వధించి వారినిఁ జెల్లాచెదరుచేసెను. కాని యామెకుఁ దనభర్తయొక్క వృత్తిమీద గాని, యా యూరి లక్షణములమీద గాని యభిరుచి లేదు. నేను సైన్యములోఁ జేరుదునని చెప్పినంతనే యామె సంతోషించినది. నా బ్రదుకు నేను బ్రదుకుదునులే. నీవు రహస్యముగాఁ బొమ్మన్నది. నీ వుద్యోగములోఁ బయికివచ్చినతరువాతఁ బెండ్లిచేసికొని నాకు వార్తపెట్టుము. చివరిరోజులు నేను మీదగ్గఱనే యుందునన్నది. నేను సేనలోఁ జేరితిని. ఇన్నాళ్లు నీ వెట్లు గడిపితివని యడిగెను. నేను నా కథయంతయు జెప్పితిని. ఆ పేటలోని వారందఱు మా కథలు వినుచు, నాదిహాంగను జంపుటకు వచ్చినామనియే మఱచిరి. అచ్చట నొకరియింటిలో నానాడు మా యిద్దఱికి భోజనముపెట్టిరి. ఆనాటినుండి నా కతనితో స్నేహమయినది. అతఁడు నే నతని నీ యాపదనుండి తప్పించినదానికిఁ గృతజ్ఞుడగునో కాదో తెలియదు గాని, నా సంగీతవిద్యకు వశుఁడైనాఁడు. అగునో కాని యేమిటి? ఆ విష యములోఁ గృతజ్ఞత లే దతనికి. అతఁ డంత పిరుఁడనగా నా పది మందియుఁ దనమీఁదఁ బడినను వారిని విదలించి చెల్లాచెదరు చేసి తాను తప్పించికొనిపోగలఁడు. అది యతని ధైర్యము. ధైర్యమే కాదు, అది యతనిశక్తి. అందుచేత నే నవ్వా డతనికి సాహాయ్యపడితినని సామాన్య మానవలక్షణముగా నాయందుఁ బ్రేమగానుండుటయేగాని, తనప్రాణము రక్షించితినన్న లోత యినయూహ లేదు. కాని మా చెలిమి వృద్ధిపొందినకొలఁది నా

కృతజ్ఞతయన్న భావ ముండవలసివచ్చినచో నది యెంత యుండునో దాని కిబ్బడిముబ్బడిగా నా సంగీతమునకు, నా పాటలకు, నా వాద్యములకు, నా యుత్సాహములకు నాయందుఁ బ్రేమ పెంచికొన్నాఁడు. సైన్యములోనుండి తన కొక్క యరగంట విశ్రాంతి దొరకినచోఁ జాలు, నన్ను వచ్చి చూచి పోవును. కొన్నాళ్లయినతరువాత నా కుద్యోగము సంపాదించి పెట్టవలయునని పుట్టెను. అతఁడు సైన్యములో మహావీరుఁడు. బహుమానములను బొందినవాఁడు. పదకములను సంపాదించినవాఁడు. అధికారుల కనుకూలముగాఁ బ్రవర్తించెడివాఁడు. ఆ యధికారుల కీతనియం దాదరాభిమానములు కలవు. అందుచేత వారితోఁ జెప్పి నా కొక యుద్యోగ మిప్పించినాఁడు. నాకు వ్రాతకోతలు తెలియవు. నా కేమి యుద్యోగమిత్తురు? సైనికుల కందఱకు నాహారపదార్థములిచ్చు గిడ్డంగి కలదు. ఆ గిడ్డంగి మీఁదఁ బర్యవేక్షణముచేయునధికారము నా కిప్పించెను. నేను లెక్కలు వ్రాయనక్కఱలేదు. నే నెవ్వరికిని జవాబుదారీ లేదు. ఊరకయే వచ్చినవస్తువులను దింపికొనుట, వానిని నొకచో నుంచుట, యెవ్వరు దీసికొనిపోకుండఁ జూచుట. జీతము మాత్రము తక్కువలేదు.''

ఇంత చెప్పినతరువాత ముసలిది తలయూడించెను. రంగీలా యూరకుండిన, ముసలిది మొదటిసారి మాటాడెను. "నీ విప్పు డిక్కడి కెందుకు వచ్చితివి?"

రంగీలా మరల నారంభించెను: "ఆ యాదిహాంగకు నన్నియు మంచిలక్షణములే కాని, యొక్కటి మంచిలక్షణము లేదు. అతఁడు కాముకుఁడు. కాముకుఁడని తిరుగుడు తిరుగఁడు.

అందమయిన స్త్రీ కనిపించినచో దానియిల్లు కనుగొనవల యును. అది వీధివెంటఁ బోవుచున్నచో దానివెంటఁబడి పోవును. తన కాతలఁ బనియున్నదన్నమాటకూడ మఱచి పోవును. నా కీ యుద్యోగమిప్పించుటకు, నాతో నింతస్నేహము చేయుటకుఁ బ్రధానకారణ మొకటి యున్నది. అతఁ డందరితోఁ జనవుగా నుండఁడు. అందరితో యథేచ్ఛముగా మాటాడఁడు. తన మనస్సులోని భావములను తన మనస్సులోనే యుంచు కొనును. ఎవఁడో సామాన్యుఁడయిన సైనికుఁడు—వాని దుస్తుల మీఁద రెండుపదకము లుండవచ్చును—వాని పాగమీఁద రెండు జరీతీగ లుండవచ్చును—ఆ జరీతీగలు వానిసాహసమును జూపిం చునని సామాన్యజనుల కేమి తెలియును? ఆ పదకములు వెండివి—అవి యెందుకు వానికి వచ్చినవో యెవనికిఁ దెలియును? అవి తన సాహసమునకును బరాక్రమునకును జిహ్నములని తన కేఁ దెలియును. తోడి సైనికులకుఁ దెలియును. ఇతనికంటికినచ్చిన, వీథిలోఁ గనిపించిన యెవరో పదిపదునాలుగేండ్లపిల్ల కేమి తెలి యును? పైగా నాదిహాంగు సుందరుఁడు కాఁడు. వానిమొగ మునఁ జెక్కిలిమీఁద నొక కత్తిదెబ్బ తగిలి, మానిపోయిన పొడు గయిన గాయపుమచ్చ గలదు. కొందఱి కట్టి గాయపుమచ్చ మొగమున కందమిచ్చును. ఇది యతనిమొగమును వికారము చేసెను. అతనినిఁ జూచినచో స్త్రీలు కొందరు నవ్వికొందురు. దీని నతఁడు తనయందలిప్రేమగా వ్యాఖ్యానముచేసికొనును. కొందఱు తొలగిపోదురు. కొందఱు భయపడి తొందరలో బెదరిన లేడివలె నడతురు. అదియంతయు నితఁడు తనయందు వారికి బ్రేమ యంకురించినదని తనలోఁదాను టిప్పణములు

వ్రాసికొనును. ప్రతిదినము రాత్రిపూట నా ప్రాణములు తేలిపోవుచు. నే నతనితోఁ గూర్చుండవలయును. ఈ మాటలన్నియు వినవలయును. ఆ పిల్ల నన్నుఁ బ్రేమించుచున్నది. నిజమా? యబద్ధమా? యని నన్నడుగును. నే నేమి చేయవలయును? ఆ పిల్లను నేను జూడలేను. ఇతఁ డామెను జూచినప్పుడు నే నచ్చటలేను. ఆమె తనయెడల నట్లు ప్రవర్తించినదని యితఁడు చెప్పినమాటలు విని నే నామె యితనిని బ్రేమించుచున్నదో లేదో చెప్పవలయును. ఆమెయొక్క కొన్ని లక్షణములు తనయం దామెకుగల ప్రేమగా నాతఁడు చెప్పును. కాకపోవుటకును వీలుండును నేను బ్రేమించుటలేదు. ప్రేమలేకపోయినను స్త్రీ లట్లే ప్రవర్తింతురని చెప్పితినా, నీకుఁ దెలియదు, నీవు మూర్ఖుఁడవు. వయసులోనున్న పిల్లలసంగతి నీ కేమి తెలియునని నన్నుఁ దిరస్కరించును. ఇట్టిబాధపడలేక నే నతఁడు చెప్పినదెల్ల నిజమే యందును. అతని యుత్సాహము చెలరేగును. నన్ను సంగీతము పాడుమనును. నాకు పాడకతప్పదు. మేము నిద్రపోవుటకు మలిజాము కోడి కూయవలయును. నెల కిరువదిరోజులు నా బ్రదుకింతేయైనది. అతఁడన్నచో నా కమితమయిన యనురాగము పుట్టినది. ఏలయనఁగా నింతమంది స్త్రీలను జూచినను నెప్పటికప్పుడు దానినే పెండ్లిచేసికొందుననును. నేను వెక్కిరింతును. పెండ్లిచేసికొనెడివాఁ డెవ్వతెనో యొక్కతెనే జూచికొనును గాని, యింతమందిని జూచి యింత యారాటపడఁడని. అతఁడు సమాధానము చెప్పును—చూచినవారినందఱిని జేసికొందుమా? ఎవ్వతెనో యొక్కతెనే చేసికొందుము. మనకెవ్వతె వ్రాసియున్నదో యదియే మనకు భార్య యగును.

అంతవఱకు బ్రయత్నముచేయవలదా యనును. నే నంటును గదా "యిది యేమి బ్రయత్నమయ్యా మహారాజా! పెండ్లి చేసికొనువా డొక పిల్లను జూచును. ఆమె కిదివఱకుఁ బెండ్లి కాలేదని స్థిరపఱపవలయునుగదా! నీవు వారమున కొకపిల్లను జూచివచ్చి నాతోఁ జెప్పెదవు. వా రవివాహితలో వివాహితలో తెలియదాయెను. ఆ పిల్ల నీ కులస్థురాలో కాదో, నీ మతమో కాదో, దాని తల్లిదండ్రులకు డబ్బుమీద వాంఛ యున్నదేమో, ఏమియుఁ దెలియదాయెను. చాలమంది తల్లిదండ్రులు తమకూతుండ్రను సైనికులకిచ్చుట కిష్టపడరు. రేపుప్రొద్దున యుద్ధమువచ్చినచో నా సైనికుడు యుద్ధములోఁ జావవచ్చును. సైనికుని యాయువువిషయములో నిశ్చయములేదు" అంటును. అతఁడు "నే నీ సైన్యములోనుండి మాని వేయుదును. కాలగిరిలోఁ బోయియుందును. అచట మా మేనత్త కలదు. ఆ యూరిలో నొక పిల్ల యున్నది. నే నామెను బ్రేమించితిని. మా యత్తకుఁ దెలియు"నని చెప్పెను. ఆ పిల్ల కిదివఱకే పెండ్లియైనదేమో యని నే నంటిని. ఆ పిల్లపేరేదో చెప్పినాఁడు. ఔను, జ్ఞాపకమువచ్చినది. ఆ పిల్లపేరు నీలాటియట. ఆ పిల్ల యీ యూరిలో నున్నదా?" అని రంగీలా యడిగెను.

ముసలిది రొట్టెనమలుట మాని రంగీలావంక నిదానించి చూచెను. రంగీలా మరల నడిగెను.

ముసలిది "వాని మేనత్తపేరేమి?" యని యడిగెను. రంగీలా "ఆబిడపేరు కాలంజరి. ఆమెనుగూర్చి నే నెవ్వరి నడిగినను నెవ్వరు మాటాడలేదు. ఇంతకు, నవ్వా! నీవే కాలంజరివా? అడిగినచో నీకుఁ గోపమువచ్చునేమోయని నే నడుగలేదు.

ఈ యూరిలో నెవ్వరి నేమియు నడుగరాదు. వారి కిష్టము వచ్చినచోఁ జెప్పుదురు. లేనిచోఁ గఱ్ఱలో కత్తులో విసరుదురు. నే నీ యూరినుండి బ్రదికి బైటపడ్డప్పటిమాట. అతఁడు నన్నిచ్చటకు బంపెను." ముసలిది యిట్లనెను. "సిలాటికిఁ బెండ్లియైనది అది తన యత్తవారియూరు పోయెను. ఈ యూరిలోఁ బెండ్లి యనగా దాని నెవఁడో లేవఁదీసికొనిపోవుటయే. దాని తండ్రియుఁ దాని సోదరులు. వానితోఁ గత్తియుద్ధమాడుదురు. పెండ్లి కొడుకుఁ దట్టికొన్నచో నది వానిపెండ్ల మగును."

రంగీలా నవ్వుచు నిట్లనెను. "ఆమాత్రము మా యాది హంగ చేయలేకపోయెనా. దాని పెండ్లియైనచో నైనది లే. మా వాని కంతకంటె మంచిసంబంధమే వచ్చినది. దాని కొక యడ్డు వచ్చినది, అంతే. ఆ యడ్డు తొలగించుటకు నే నీ యూరు రావలసివచ్చినది. అతనిమేనత్త కనిపించినచో నే నామె నడిగి తెలిసికొనవలసిన విషయము లున్నవి."

ముసలి దా 'యడ్డేమి'టని ప్రశ్నించెను.

రంగీలా "ఈ కొలగిరివంటి యూరు—అవ్వా! యీ ప్రాంతముల నెన్నియున్నవి? ఇటువంటి గ్రామములు, ఇట్టి కొండజాతివారు నెత్తురుబ్రదుకులు బ్రదికెడివారు, చిత్రములయిన సంప్రదాయములు కలవారు, నే డేదో మహానాగరకత వృద్ధిపొందినదనుకొనుచున్న పట్టణవాసులున్నవన్నచో నమ్మరు. ఆ గుడనగరములో నిట్టి గ్రామ మున్నదన్నచో విశ్వసించెడి వాఁడొక్కఁడుండఁడు. ఆ నాగరక జాతి చమత్కారమయినది. పాశ్చాత్యదేశములను జూచి వారి సంఘవ్యవస్థలు వారి నాగరకత వారి యాచారములను వారి చదువులు పరమోత్కృష్ట

మనుకొని వానియందు మమకారము పెంచికొని పట్టణములలో యువకులైనప్రజ లుందురు. ఈ గ్రామమునుగూర్చి చెప్పినచో వారు నమ్మరు. అట్టి యాచారములుకల ప్రజలు నేటికాలమున నుండ నేయుండరనుకొందురు ”

ముసలిది “ఆ యుద్ధమాట యేమిటి చెప్పు” మనెను.

రంగీలా “అది చెప్పుటకే నే నిట్లనవలసివచ్చినది. ఆది హాంగ నెలనాళ్ళక్రింద నొక పిల్లను జూచెను. ఆ పిల్లను గూర్చికూడఁ బూర్వపుస్త్రీలనుగూర్చివలెనే చెప్పజొచ్చెను. నే నట్టిదే యనికొంటిని. కాని వారము పదిదినములు గడచినవి. వ్యవహారము ముదిరినది. ఆ పిల్ల యిల్లుఁ బోయి చూచివచ్చెను. ఇరుగుపొరుగువారిని నా పిల్లకు వివాహముకాలేదని కనుగొని వచ్చెను. బలవంతముగాఁ నన్నుఁదీసికొనిపోయి ఆ పిల్లను జూపించెను. ఆ పిల్లతండ్రి యొక పూర్వసైనికుఁడు. అతఁడు నావలెనే చిన్నప్పుడు సంగీతము తబలావాద్యము మొదలయినవి చేసినవాఁడు. నే నతనితోఁ బరిచయముచేసికొంటిని. నా చేత సంగీతముఁ బాడించినాఁడు. తబలా వాయించుచున్నాఁడు. తానుగూడ వాయించినాఁడు. అతఁడు బాగుగనే వాయించినాఁడు. నాలుగయిదుసార్లు రాకపోకలు జరిగినతరువాత నాది హాంగయు నేను గలిసి వారియింటికిఁ బోయితిమి. ఆ పిల్ల ఆది హాంగను నైదాఱుసార్లదివఱకే చూచినది. మేము వెళ్ళినంతనే యామె యితనివంక కోఱగాఁ జూచెను. అందులోఁ గొంత యిష్టము, కొంత యనిష్టము. ఇతర స్త్రీః నామెకు నితఁడు సైనికుఁడగుట యనిష్టహేతువుకాదు. తండ్రియే యుద్యోగవిరమణము పొందిన సైనికుఁడాయెను. మఱియుఁ

దొలుత నీతఁడు వెంబడించుట ధూ ర్తలక్షణముగాఁ బరిగణించి నను దరువాతఁ దరువాత నతని నిజమయిన ప్రేమయే యనియుఁ బెండ్లియాడుటకు వాంఛించుచున్నాఁడు గాని, దుర్జనత్వము ప్రకటించుట కాదనియు నామెకుఁగూడఁ దెలిసెను. వారి యింటికిఁ బోయినతరువాత మే మామెను గుఱించి సంగతులన్నియుఁ దెలిసికొంటిమి. ఆమె కిరువదియేండ్లు తక్కువలేదు. ఆమె పూర్వ మీ ప్రాంతములలోని పిల్ల. ఆమెపేరు రిటా. ఈమెయు హీరాయు—హీరాయనఁగాఁ నీకుఁ దెలియదేమో ఆమె పెద్ద నాట్యకర్త్రి. ఆమెపేరు చెప్పినచోఁ బట్టణములలో నేమి మహానగరములలో నయితము ధనము కురియును. వీరిద్దరు చిన్నప్పుడు కలసి నాట్యము నేర్చుకొన్నవారట. ఐదేండ్లనుండి వారిద్దఱకును సంబంధములేదు. అనఁగా నీమెదారి నీమె యున్నది. ఆమెదారి నామె యున్నది. ఆమెతండ్రి యుద్యోగవిరమణముచేసి నాలుగై దేండ్లయినది. కొంతధనము కూడఁబెట్టినాఁడు. తనకూతురు నాట్యముచేయుట తన కమర్యాదయని భావించినాఁడు. ఆమె చేత నాట్యము మానిపించినాఁడు. అతఁడు సంబంధములు తెచ్చును. అతఁడు నిరాకరించును. ఈ నిరాకరించుటకు గారణ మేమనగా హీరాయును రిటాయును మిక్కిలి చెలిమిగా నుండెడి వారు. ఒకప్పుడు వారిద్దఱునుగలిసి ప్రమాణములుచేసికొన్నారట, ఒకరియనుమతిలేకుండ నింకొకరు వివాహము చేసికొన రాదని. వారిద్దఱుకలిసి యారోజులలో నాట్యముచేసెడివారు. ఆ యిద్దఱకలయికవలన వారినాట్య మెంతయో శోభించెడిదట. అందుకనియే యెక్కువధనము వచ్చెడిది. వారిలోనొక ర్తుక

వివాహముచేసికొనినచో రెండవయామె నాట్యవృత్తి పడిపో
వును. ఆ యుద్దేశముతో వారట్టి ప్రమాణముచేసికొనిరి. కనీసము
హీరా తా నట్టి స్వార్థభావముతో నీ ప్రమాణముచేయించెను.
ఈ రిటా యమాయకురాలు; ఈమెకు నల్లనివన్నియు నీళ్లును,
తెల్లనివన్నియుఁ బాలును. ఆమెకుఁ దనయందుఁగల మహా
స్నేహభావముచే నట్టి ప్రమాణము చేయించుకొన్నదని
యీమె యనికొనెను. ఆ తండ్రి యీవిషయమునందు హీరా
యొక్క యనుమతి తెప్పించవలయునని యెప్పుడును ప్రయత్నిం
చలేదు. గడచిన నాల్గేండ్లలో గుడనగరమున హీరానాట్యము
మూడు నాలుసార్లు జరిగినది. తండ్రి రిటాను పోనీయలేదు.
అందుచేత నీమె యీమెతోఁ గలసికొని యీ సంగతిని విచా
రించలేదు. మఱియు నిదివఱకు వచ్చినసంబంధములు రిటాతండ్రి
తెచ్చినవి. కాని వారువచ్చి రిటానుజేసికొందుమన్నవి గావు.
ఈ కథ వేఱాయెను. రిటా హీరాయొక్క యనుమతియున్నచో
దా నాదిహంగను వివాహముచేసికొందునన్నది. తండ్రియు
నంగీకరించెను. హీరా యెక్కడనున్నదో తెలియలేదు. ఆమె
సంగతి తన మేనత్తకుఁ దెలియుననియు నన్నుఁబోయి యామెతో
మాట్లాడుమనియు నాదిహంగ నన్ను దఱిమెను. అతనికి సెల
వులు లేవు. మఱియొక యిబ్బందిగలదు. అతనిపైయుద్యోగస్థుఁ
డితనిని వదలిపెట్టి నిముసముండఁడు. అన్నిపనులితఁడే చేయ
వలయును. తక్కిన సైనికులకుఁ గవాతితఁడు చెప్పవలయును.
పనియంతయు నితనిచేతఁ జేయించి యతఁడు విశ్రాంతితీసికొను
చుండును. ఆదిహంగయే యిచ్చటికి వచ్చెడివాఁడు. మఱియు
నతఁ డీ యూరు రానని చెప్పెను. అతఁ డీయూరివాఁడనియు

దాను సైన్యములోఁ జేరుట యీ యూరివారందఱి కిష్టము లేదనియుఁ దా నీ యూరిలోఁ గనిపించినచోఁ నందఱు గేలి సేయుదురనియు, పి రెంతటివట్టుడల మనుష్యు లనఁగా, నిదుర పోయెడివేళ నతనిని జంపినను జంపవచ్చుననియు నతనిభయము. ఇంత యెందుకు. నీ వొక్కసారి కాలంజరివద్దకుఁ బోయి రమ్ము. ఆమె నొకసారి కలిసికొనుము. ఆమె కాలగిరిలోననే యుండు ననుకొందును. నేను వివాహముచేసికొనిన తరువాత మా మేనత్త నీ యూరు తీసికొనివత్తును. నాకుఁ దల్లి లేదు. తండ్రి లేఁడు. పినతండ్రియు, వాని కొడుకులకు నాకును సంబంధ మెప్పుడో తీరిపోయినది' అని నన్ను వేధించెను. ఈ రిటా సంబంధములో నింకొక మేలున్నది. ఆ రిటాతండ్రికి వేఱ సంతానములేదు. భార్య యెప్పుడో పోయెను. అతనికి గుడనగర ములో నిల్లున్నది. కొంత ధనము నిలువయున్నది. ఆ యింటికి నా ధనమునకు నాదిహంగయే వారసుఁడగును అవ్వా! ఆ కాలంజరివి నీవా? కానిచో నామె యెవ్వరో నీకుఁ దెలిసి యుండును గదా. నాకు దయఁజేసి చెప్పుము. నా ప్రాణమిత్రుని బ్రదుకు దీనిమీఁద నాధారపడియున్నది" యనెను.

అంతకుఁ బూర్వమె భోజనములైపోయినవి. ముసలిది తన కంచములోననే చేయి గడిగికొనెను. ఆమె యేమియు బదులు చెప్పలేదు. రంగీలా లేచి తన కంచము తానే వాకిటిలోనికిఁ దెచ్చి కంచముగడిగి, చేయిఁగడిగికొని లోనికిబోయి కంచ మొకచోటఁ బెట్టి వాకిటఁ దిరుగుచుండెను. ఆమె యేమియు మాటాడలేదు. కొంతసేపటి కామె బయటకువచ్చి తలుపునకు గొళ్లెముపెట్టి యెచటికో వెళ్లిపోవుచుండెను. ఇతఁ డేమి చేయ

వలెను? ఎండ పెళపెళ కాయుచుండెను. అతఁడట్లే నిలుచుండెను. ఆమె యూరిలోనికిఁ బోయెను. గంట గంటన్నరసేపు గడచెను. గేదె త్రెంచుకొనెను. మేక యఱవనారంభించెను. అతఁ డా రెంటి నూడదీసి కొండమీఁదికిఁ దోలుకొనిపోయెను. చాలసేపు రెండుపశువులను మేపెను. ప్రొద్దువాటాఱు వేళకు గేదె యింటివైపునకు మరలెను. మేకకా యలవాటులేదు. ఆ కొండమీఁదఁ దూర్పుదెసఁ బెద్ద కొపిరె కలదు. దీనినిండ ముండ్లచెట్లు. ఈ మేక యా పొదలలో మేయుచుండెను. ఇతఁడు పోయి దానిని బలవంతముగా మళ్లించుకొనివచ్చి రెండు పశువుల నింటిదగ్గఱఁ గట్టివేసెను. వానికి మేతవేసెను. ముసలిది రాలేదు. గేదె పాడిది. కాని దూడ చచ్చిపోయినట్లున్నది; ఇతఁడు తలుపుగొళ్లెముతీసి లోనికిఁ బోయి యొక పిడత దెచ్చి గేదెపాలుతీయనారంభించెను. అది సాధువు. చేపెను, పాలిచ్చెను. రంగీలాకు గేదెపాలుతీయుట తెలియును. అతని మేనత్తకు నొక యావును గేదెయు నుండెడివి. అది చాల దినములక్రిందటిమాట కాని, యొకవిద్య వచ్చినచో దానిని మఱచి పోవుట యుండదు. ఆ పాలపిడత లోనికిఁ దీసికొనిపోయి భద్రము చేసెను. మూతపెట్టెను. మేకకుఁగూడఁ బాలుతీయవలెనా వలదా? అది చూడిదా పాడిదా? పాడిదైనచో నుచ్చులుండును. దీనికి నుచ్చులులేవు. చూడిదయియుండును. కాని యీ కొండనేలలో నిది యిట్లేయుండునని చెప్పుటకు వీలులేదు. అయినను ప్రయత్నముచేయుదమని యింటిలో వెదకి యొక మట్టిచెంబు దీసికొనివచ్చి పిదుకనారంభించెను. మేక నిలువలేదు. కాని బలవంతముగాఁ బట్టికొని పిండనారంభించెను. అది

పాలుపిండెను. తీసికొనిపోయి యా పాలనుగూడ భద్రముచేసెను. ప్రొద్దుగ్రుంకవచ్చెను ముసలిది రాలేదు. ఆమెయే కాలంజరియా? ఇతని కేమో మనసులో ననుమానముగానున్నది. ఎంత యనుమానముగానున్నను కాదన్న విశ్వాసమే ప్రబలముగా నున్నది. ఆమె మూగదియేమోయని యనుమానమువచ్చెను. ఒకసారి మాటాడినదని జ్ఞాపకమువచ్చెను. కథయంతయు శ్రద్ధగా వినెను. ఆమెమొగములో నే భావమును గోచరించలేదు. వాని దారిని వాఁడు వచ్చినాఁడు. వానిదారిని వాఁడే పోవునని యూరకొన్నదేమో! మఱి బఱ్ఱెపాలుతీయకుండ నెట్లు? ఆమె యేకాకిని. తీసినచోఁ దీయును. తీయకపోయినచోఁ దీయదు ఆమెకొకపూటపాలు చాలవా? పాలమ్మదా? అమ్మినచో నాయూరిలో గొనెడివారెవరు? పట్టణమునకు దీసికొనిపోయి యమ్మవలయును. అచ్చటికిఁ బదిమైళ్లదూరములో బట్టణమనునది లేదు. ఈమె యెట్లు బ్రదుకుచున్నది? ఈమెకు సంపాదన యేమి? ఆధారమేమి? తలుపునకు గొళ్ళెముతగిలించి పోయినది. తాళముకూడ లేదా? తా నున్నాఁడని వెళ్లినదా? తనమీద నామె కంత విశ్వాస మెందులకు? తన పనిమీదనే యామె వెళ్ళినదని తాననుకొని తానువచ్చువఱకుండుననియా?

ప్రొద్దుగ్రుంకినది. అది శుక్లపక్షము ఆ నాఁడు సప్తమి. వెన్నెలలు గొంచెము కలుకుగానే యుండెను. అతని కేమియుఁ దోచకుండెను. లోనికిఁబోయెను. దీపము వెలిగించవలయును. దీపపుబుడ్డి యెక్కడనున్నదో, నిప్పుపెట్టె యెక్కడనున్నదో పగలెదో చూచినట్లు జ్ఞాపకము. దీపపుబుడ్డి లేదు. ప్రమిద యున్నది. అందులో గుడ్డవత్తి యున్నది. నిప్పుపెట్టె ఎక్కడనున్నది? నూనె

యెచ్చటనున్నది? వంకెన నొక తోలుతిత్తి కలదు. అది నూనె యేమో! తీసి వాసనచూసెను. ఆ వాసన తా నెప్పుడు నెఱుగఁడు. అది యాముదము గాదు; నువ్వులనూనె గాదు. కొంచెము ప్రేలికిరాచి వాసనచూచెను. జిగురు గానే యున్నది. ఒక వెగటు వాసన కలదు. అది ప్రమిదెలో పోసెను. వెలిగించుట యెట్లు? ఆ యింటిలో నిప్పుపెట్టి యుండుననుకొనుట యతనిదే తప్పు. ఈ నూనెతిత్తి ప్రక్కనే యొక గుడ్డసంచి యున్నది. ఆ సంచిలో వెదకెను. చెకిముకిరాయియు దూదియు గలవు ఈ విద్య యతనికిఁ దెలిసినదే. తబలావాయించెడి హంగరాజమతస్థులలోఁ గొందఱు దీనినే వాడుదురు. కొట్టి వెలిగించి జ్వాలచేసి దీపముముట్టించెను. లోనుండి బయటికి వచ్చెను. అతని కొక యూహ తోచెను. ఆ యింటిలో దీప మెప్పుడో తప్ప నెప్పుడు నెందులకు? నూనె వృథాగా వ్యయముచేసితినని యామె కోపించునేమో!

మధ్యాహ్నము భోజనముచేసెను. కాని మరల వాని కాకలియగుట కారంభించెను. ఇన్నిచేసినవాఁడు రొట్టె లేల చేయఁగూడదు? ఆ కుటీరములోనికి గాలియన్నది రాదు. తలుపు వేసినచో దీపమారనేయారదు. తలుపు వేసి దీపపు వెలుతురునఁ గుండలన్నియు వెదకి గోదుమపిండి తీసి నీటితోఁ దడిపి కొద్దిగా నువ్వువేసి నిప్పుచేసి రొట్టెలుచేయనారంభించెను. అతఁడు రొట్టెలుచేయుటలో సిద్ధహస్తుఁడు. అతఁడు చపాతీలు చేసినను పరోటాలు చేసినను వానిమిత్రులు విఱుగఁబడి తిందురు. అతఁడు కొండమీఁదకుఁ బోయినపుడు తా నొక యాకు

చూచెను. ఆ యాకుతోఁ బచ్చడిచేసినచోఁ బరోటాలు దానిలో నంజుకొని తిన్నవారు బ్రదికియుండఁగా నా యాహార మును వదలిపెట్టలేరు. అతఁడు పరోటాలుచేసి చల్లారకుండఁ బ్రొయ్యిమీఁదనేయుంచి మరలఁ గొండమీఁదికిఁ బోయి వెన్నెలలో నా యాకును వెదకి తీసికొనివచ్చి దానితోఁ బచ్చడి చేసెను.

రాత్రి జాముప్రొద్దుపోయి ముసలిది వచ్చెను. ఇతఁడు వాకిటిలోననే కూర్చుండెను. లోనికిఁబోఁగా దీపము వెలిగించి యుండెను. పాలుతీయుదమని పోఁగాఁ బాలు తీసియుండెను. ప్రొయ్యి వెలిగింతమని పోఁగా రొట్టెలుచేసియుండెను. ఇంకొక పిడతలో వేడిపాలు గలవు. ఆ పాలేమిటో యామెకుఁ దెలియ లేదు. ఆ పిడత తీసికొనివచ్చి యివి యేమిటని యడిగెను. అతఁడు మేకపాలనెను. ఆ పాలపిడత యక్కడఁబెట్టి యామె యచ్చటఁ గూర్చుండి విఱుగఁబడినవ్వెను. కారణములేకుండ నతఁడుగూడ నవ్వనారంభించెను. ఆమె "నీవు చాల గడుసు వాఁడవు. అది పాడిమేకగాదు. నీ కది పా లెట్లిచ్చెననెను. ఇతఁడు—'అది పిండెను. నేను పిండితి'ననెను. అదిమొదలు ముస లిది మాట్లాడుటతప్ప నింకొకపని చేయలేదు. లోనికి రమ్మ నెను. రొట్టెలు కలిసి తినెను. ఆ రుచి మెచ్చుకొనలేక చచ్చి పోయెను. ఆ పచ్చడి యేమిటని యడుగనారంభించినది. అతఁడు చెప్పెను. భోజనము పూర్తియైనది. వెన్నెలలోఁ గూర్చుండిరి. ఆమె చెప్పనారంభించెను. "హీరాది యీ యూరు కాదు. ఇక్కడి కామెయూరు నాల్గుక్రోసులదూరమున నున్నది. ఇప్పుడు నేనామెయూరు వెళ్ళియే వచ్చితిని. ఇదివఱకు నా

కామె సంగతి యెక్కువ తెలియదు. హీరా యొక నీచజాతి, హంగమతస్థునికూతురు. అది యొక్కతే కాదు. వారు కవల పిల్లలు. హీరాపెద్దది. రెండవదానిపేరు నీరా. వారిద్దఱు ఒకటే యందగత్తెలు. ఇద్దఱు నిద్దఱని యెవ్వరికిని దెలియదు. కాని యొక్కటే భేదము. నీరా మూగది. దానికే విద్యయు రాదు. నాట్య మంతకుముందే తెలియదు. వారితండ్రి యడవిగ్రామముల వెంటఁ బాడుచు బిచ్చమెత్తుకొనెడివాఁడు. ఆ పిల్లలతల్లి వారిని వదలిపెట్టి లేచిపోయెను. ఈ యిద్దఱుకూతుండ్రను వాఁడు వెంటదీసికొని పాటలుపాడుచు నూళ్లవెంట బిచ్చమెత్తెడివాఁడు. హీరాకు నేడెనిమిదేండ్లువచ్చువఱకు నా పాటలన్నియు నామె కవియంతటనవియే వచ్చెను. దానికంఠము కిన్నెరకంఠము. అది పాడనారంభించినది మొదలు వానిసంపాదన వృద్ధియయ్యెను. నీరా మాత్రము నేచెట్టుక్రిందనో కూర్చుండి, వీరికి వంట మొదలయినవి చేయుచుండెను. నీరాకు వయసువచ్చెను. ఒక హంగరాజీయుఁడు దానినిఁ బ్రేమించెను. తండ్రికిని వానికిని విరోధమువచ్చెను. కొన్నాళ్ళకా తండ్రి యేమయినాడో తెలియలేదు. హీరా నీరాలు వానియధీనములోనేయుండిరి. వాఁడు హీరాను నాట్యకత్తెను జేసెను. నీరా యన్నచో హీరాకుఁ బ్రాణము కనుక వాఁడు నీరా నేమియుఁ జేయలేదు. దానినిఁ బోషించుచునుండెను. కాని నీరా యున్నదని యెవ్వరికిని దెలియదు. వాఁడు నీరానంత జాగ్రత్తగా రక్షించుచుండెను. మఱియొక రహస్యము గలదు. వాఁడు హంగరాజునకుఁ జాల నాప్తుఁడు. హంగరాజు ప్రయోగించెడి నీతులలో వీఁడు హంగరాజునకుఁ గుడిబుజమువంటివాఁడని యా

యూరిలోఁ జెప్పిరి. హీరాయొక్క నాట్యప్రశస్తి కంతకు వాఁడే కారకుఁడు ఇంతకును రెండేండ్లక్రింద హీరా మశూచికము వచ్చి చనిపోయెను. వీఁడు నీరానే యామెవలెఁ జూపించుచుండెను. కాని యీయామెకు నాట్యము రాదు. మూగది. సంగీత మెట్లు పాడును? తక్కినసంగతి తెలియదు. బ్రదికె నేని హీరా రిటావివాహవిషయములో నంగీకార మెట్లిచ్చును?"

రంగీలా "అవ్వా! నీవు కాలంజరి వేనా?" యనెను.

ముసలిది "ఓరి వెఱ్ఱివాఁడా! ఆదిహాంగ పెండ్లి జేసికొనిన తరువాత నాకు జాబు వ్రాయుమనుము. నే నీ దిక్కుమాలిన యూరు వదలి బెట్టివత్తు" ననెను.

రంగీలా వెంటనే యామెవద్ద సెలవుదీసికొని పోయెను. నాల్గుమైళ్లు తూర్పునకు బోయి యర్ధరాత్రమునందు నది నీదియాతలియొడ్డు చేరెను. అతనికొఱకొక విమానము ప్రతీక్షించుచుండెను. అతఁడు తెల్లవాఱకముంద గుడనగరము చేరెను.

# షష్ఠమాధ్యాయము

గుడూచీనగరమునకును గుడనగరమునకును నడుమ నున్న దూరము నూటపాతికమైళ్లకన్న నెక్కువ యుండదు. కాని యయోమార్గము చుట్టుతిరిగివచ్చుటచేత నూటయేబది మైళ్లయినది. ఆ మార్గము కొండలు తిరిగివచ్చుచుండును. రెండుచోట్లఁ గొండలు తొలిచి మార్గమును వేసిరి. ప్రయాణికులు ఆ కొండబెజ్జములలోనుండి రైలుబండి పోవుచుండగా నొకవిధమయిన యచ్చెరువు ననుభవించుటకుగూడ నా బండి

మీాద ప్రయాణముచేయుచుందురు. ఈ దూరములో ముప్పది మైళ్లు పెద్ద యడవి, కొండలు, లోతయిన వాగులు. వానిపైన వంతెనలు. కొండప్రక్కనఁబడి పోవుటలు. మార్గమంతయు రమ ణీయముగా నుండును. మాంధాతృసుతస్థులకు హంగరాజీ యులవిరోధములు ప్రబలి యొకరినొకరు చంపికొనునాళ్లలో నా ముప్పదిమైళ్లదూరములోఁ బలుమార్లు రైలునకు చిత్ర చిత్ర ములయిన యవస్థలువచ్చెను. ఒకప్పుడు సరిగా గొండతొలి చినదారిలో రైలున్నది. ముందు పోవుటకు వీలులేదు. దుర్మా ర్గులు ముందు పట్టాలు తొలగించిరి. రైలు వెళ్లెను. బండి బండి యంతయు నాల్గువందలయడుగులలోతుననున్న యఖాత ములోఁ బడిపోయెను. అందులో నెవరుండిరో యెవరు లేరో తెలియదు. మరియొకసారి బండి నా చోట నాపి పెట్టెలలోనికిఁ జొఱబడి పసిబిడ్డబాలాది నఱికిరి. ఇట్టి వైదాఱుసార్లు జరిగెను. ఆ జరిగినక్రొత్తలో నయోమార్గాధికారులు కొన్ని కట్టుదిట్టములు చేయుదురు. ఏడాది రెండేండ్లు పోవును. కట్టు దిట్టములు సడలును. హంగరాజరాజ్యాంగవిధానములో విచా రణ యను నొకయంశ మున్నది. రైలు పట్టాలుతొలగి పడి పోవును. నదులమీాద బాటసారులున్నపడవలు మునిగిపోవును. ప్రజలు విప్లవముగా గుమికూడి యల్లరిచేసినపుడు రక్షకభటులు వచ్చి తుపాకులతో గాల్తురు. విషవాయువునుఁ బ్రయోగింతురు. ప్రజారాజ్యాంగసభలలోఁ గొందఱు సభ్యులు వీనినిగూర్చి ప్రశ్నింతురు. మంత్రులు విచారింతుమందురు. విచారణ పూర్తి యగువఱకు రెండేండ్లు పట్టవచ్చును. అప్పటికిద్దఱినో ముగ్గు రినో శిక్షించితిమనియో, దోషము ప్రజలదే యనియో, పౌర

పాటునఁ బడవ సుడిలోనికిఁ బ్రవేశించెననియో, రైలుక్రింది వంతెన భద్రముగా లేదనియో పలువిధములయిన సమాధానములు పత్రికలలోఁ బ్రకటింపఁబడును. ఆ సమాధానములు ప్రకటింపఁబడునాటికి నా జరిగిన యుపద్రవముల వెట్ట చల్లఁబడియే యుండును. వానినిగూర్చి యెచరికిఁ గావలయును. తత్కాలమునందుఁ బ్రజల నుద్వేగపఱచుటకుఁ గ్రొత్త యుపద్రవములుండనేయుండునాయెను హాంగరాజీ విచిత్రమయిన రాజనీతిని దేశమునం దభివ్యాపింపఁజేసెను. రెండు రాజ్యములు విడివడినను గుడనగరరాజ్యమునందుగూడ నీ నీతియే స్థిరముగా బాదుకొనిపోయినట్లు కనిపించుచున్నది. ప్రజలకు వల్లభమంత్రి యొక్కనిమీాదనే యాసగా నున్నది. ఆయన యీ సర్వమయిన హాంగరాజరాజ్యాంగనీతియుఁ దొలగించి మాంధాతృ రాజ్యాంగపద్ధతులు ప్రవేశపెట్టునని కొందఱియాశ. కాని హాంగరాజరాజనీతి కాని, వారినాగరకత కాని నిరాదరింపఁ దగినవికావు. వానిలోఁ గొన్ని గొప్పవిషయములు కలవు. అయోమార్గము, తంతివార్తలు, ఆధునిక యుద్ధాయుధములు మొదలయిన వెన్నియో హాంగరాజీయనాగరకతతోవచ్చిన మహావిషయములు. ఎంత పురాతనభావమిళితబుద్ధియైనను వానినిఁ బరిహరించికొని యాధునికరాజ్యములను సంబాళించుకొనలేరు. మఱియుఁ బురాతనులు మఱియు నధునాతనులు— ఈ రెండు తెగలమూలముగ దేశమున కొకత్రోవ లేకపోయినది. ఓడనినచో నంతయు నోడు— అని పురాతనులు, గట్టియనినచో నంతయు గట్టియని యధునాతనులు. హాంగరాజీయనాగరకతలో నేది గ్రాహ్యము, ఏది యపరిగ్రాహ్యము? పూర్వమాం

ధాత్రునాగరకతలో నేది స్వీకార్యము, నేది సగము గ్రహింపఁ బడినది, మొదలయిన చర్చ చాల నిగూఢమయినది. ఆధునిక వివస్వద్రాజ్యమున రాజ్యపాలకులందఱు హూంగరాజనీతిధిషణా ధురంధరులు, తద్విద్యాపారంగతులు. వారు రాజ్యాంగము తమచేతిలోనుంచికొనుటకుఁ బలుపోకిళ్లుపోవుదురు. మాంధాతృ నాగరకతమీఁద వేయి యపప్రథలు వేయుదురు. వల్లభమంత్రి వంటి తీక్ష్ణసుకుమారదండులు రక్షించినఁగాని యా రాజ్యము బాగుపడదు.

అది యట్లుండగా గుడూచీనగరప్రాంతములందు నొక చోట హీరా రైలెక్కినది. ఆమె వెంట నామెకువిద్య నేర్పించిన వాఁడు కలఁడు. అతఁడు చాల నధునాతనుఁడు. ఆ రైలులోననే దూరపుపెట్టెలలోఁ బదిమంది సైనికులెక్కిరి. వారు హీరా రక్షకులు. ఇది తక్కిన ప్రయాణీకులకుఁ దెలియదు. ఆమె యెక్కినచోటఁ బ్రజలు గుంపులుపడి యామెనుజూచుటకు వచ్చిరి. ఆమె హీరాకాదనిమాత్ర మెవ్వరికిని దెలియదు. డెబ్బదిమైళ్లు దాటినతరువాత రైలు మహానది దాటిపోయెను. అక్కడికి గుడూచీరాజ్య మంతమయ్యెను. ఆనాడే శశిపట్టాభి షేకము. పట్టాభిషేకము పగలు పన్నెండుగంటలకు. ఈ రైలు బయలుదేరినది. తెల్లవాఱుచున్నవేళ. మహానదిదాటునప్పటికిఁ దెల్లవాఱినది. ఆ రైలు ప్రతిచోట నాగదు. పెద్దపెద్ద విడిదుల యందే యాగును. అట్టివి గుడనగర మీఁ నడుమ నాఱు విడిది పట్టులుగలవు. ప్రతిచోట జనము గుంపులుగుంపులుగా వచ్చు చుండిరి. ఆమెను జూచుచుండిరి. ఆమెయున్న పెట్టెకెదురుగా వందలాది జనములు మూగియుండిరి. రాత్రికి గుడనగరమున

జనుగు నామె నాట్యమునుజూచుటకు వందలాదిజనము రైలులో నెక్కుచుండిరి. రైలులో స్థలములేదు. మనుజులమీద మనుజులు కూర్చుండిరి. కొందఱు రైలు పైభాగమున నెక్కిరి. మఱి కొందఱు పెట్టెలలోనికెక్కు ద్వారముల ప్రక్క చెక్కలమీద నిలుచుండి యినుపపట్టెలనుబట్టుకొని వ్రేలాడుచుండిరి. రైలాగెడిస్థలములందు నందఱును దిగుదురు. రైలులోఁ గూర్చున్న వారు నిలుచున్నవారు దిగరు. అట్లే యొకరిమీదనొకరుపడి ద్రొక్కికొనుచుందురు. ఇదియంతయు హంగరాజనాగరకతా మహోలక్షణమనుకొనియే సంతోషించుచుందురు. గుడనగరమునకు వెనుక నాగెడి ప్రదేశమునందు బండి యాగినది. అక్కడికి నలుగురుమనుష్యులు వచ్చిరి. వారు హంగరాజమతస్థులు. వారి దుస్తులలోననే యుండిరి. వారు హీరాకూర్చున్న పెట్టెలోనికిఁ బోయిరి. హీరా యచ్చటనే దిగవలయునని చెప్పిరి. హీరా రక్షకుఁడు వెనుకముందాడెను. వారు తాము హంగబలాయొక్క యాదేశముచొప్పున వచ్చితిమనియు, గుడనగరములో దిగినచో జనము బసకుఁ బోనీయరనియు, నిచ్చటినుండియే మోటారు మీదఁ బోవలయుననియుఁ జెప్పిరి. అతనికి నమ్మకము కలిగెను; కలుగలేదు. హంగబలా గుడనగరములో లేడని గాలి వార్తగా నతనికిఁ దెలిసియును. అందుచేత నతఁడు నమ్మలేదు. వచ్చినవారు మరల నిట్లుచెప్పిరి: "హంగబలా గుడనగరములో లేఁడు. ఆయన కుమారునకు జబ్బుగానున్నదని సకుటుంబముగా వెళ్లినాఁడు. ఈనాడు సాయంకాలమున గుడనగరముచేరును. ఈలోపుగా మీ రాయనయింటిలో బసచేయుటకు వీలులేదు మీకు వేఱె యొకబస నేర్పాటుచేసెను. ఆ బస యెచ్చట

నున్నదో యెవ్వరికిని దెలియదు. జన మచ్చట మూగరు. మమ్ము బంపించెను."

అతనికిఁ గొంత విశ్వాసముకలిగెను. మఱియు నతని కొకవార్త తెలిసెను—హంగబలాయింటిలో దొంగలుపడినారని. ఆ వచ్చినవారు మరలనిట్లనిరి. "హంగబలాయింటికి మన మిప్పుడు పోవుటకువీలులేదు. ఆయన సకుటుంబముగా వెళ్లిన తరువాత .నాయనభవనములో దొంగలుపడిరి. అంత గొప్ప వానియింటిలో దొంగలుపడుటవలన, నతఁడు నగరమునలేక పోవుటవలన రాజభటులు పోయి యాయనసౌధమును రక్షించుచుండిరి. వారికుటుంబము రాకముందు మఱి యెవ్వరు గృహము ప్రవేశించుటకువీలులేదు. అందుచేత మీకు వేఱే విడిదియేర్పాటులుచేసెను. మిమ్మచ్చటనేకలిసికొని యా బసకుఁ దీసికొనిపోవలయునని హంగబలా తంతివార్తనిచ్చెను." వారు తంతిని జూపించిరి. అతనికి విశ్వాసముకలిగెను.

రైలుబండి యచ్చటఁ బదినిమేసములు మాత్రమే నిలుచుండును. అప్పటికే యరగంట గడచినది. రైలింకను బయలు దేరలేదు. హీరా దిగువఱకును బయలుదేరదేమో! తక్కిన పెట్టెలలో హీరాకు రక్షకులుగానుండిన పదిమంది సైనికులును రైలుబండి దిగి యటునిటు తిరుగుచుండిరి. హీరాపెట్టెవద్ద జరుగుచున్న కథయంతయు జూచుచునేయుండిరి. వారు జోక్యము కలిగించుకొనుటకు వీలులేకుండెను. రైలుబండి మహానదిమీది వంతెన దాటినతరువాత బండిలోనికి నలుబదిమంది వివస్వద్రాజ సైనికభటులు ప్రవేశించిరి. వారును రైలు దిగి, నిలిచినచోటఁ బచారుచేయుచునేయుండిరి. శశిరాజ్యసైనికులలోఁ బ్రతి

యొక్కనిని వివస్వద్రాజసైనికులు మువ్వురు నల్వురు కాచి కొనియున్నట్లు కనిపించెను. ఈ సంగతిని శశిసైనికులు కని పెట్టిరి. వా రేమియు మాటాడలేదు. నడుమనడుమ హీరా రక్షకులకును నా సైనికులకును గనుసైగలుసాగుచుండెను. ఆ సైనిక లేమిచేయుటకును వీలులేదు. వారిలో నొక్కఁడు తీవ్ర ప్రకృతివాఁడు పోయి జోక్యముకలిగించుకొనెను. హీరా యచ్చట దిగుటకు వీలులేదనెను. హీరానుదింపుటకు వచ్చిన వాని నీ ప్రసక్తి యేమి యనిరి. అతఁ డేమిసమాధానము చెప్పఁగలఁడు? వివస్వత్సైనికులు నలువురచ్చటఁ జేరిరి. జనము మూగిరి. ఆ మూగినజనములోఁ ద్రొక్కిడిలో బడ్డట్లు త్రోసి కొనిపోయినట్లు ఈ సైనికుఁడు దూరముగాఁ ద్రోయఁబడెను. వానికిఁ గోపమువచ్చెను. తక్కిన శశిసైనికులు వారించిరి. ఇంతలో హీరాను దింపుటకువచ్చినవార లామె పెట్టెలను దదితర సామగ్రిని దామే దింపిరి. హీరారక్షకుఁ డేమిచేయ గలఁడు? వారికిఁ దెలియును. చిన్నసామానులుగూడ దింపు కొనిరి. బండి వెంటనే యీలవేసి బయలుదేరెను. రైలుదిగిన వారికి శశిసైనికులకు హీరారక్షకునకు నొక దిగ్భ్రాంతి కలిగెను. హీరా దిగుటకొఱకే యింతసేపు రైలాగినదన్నట్లు వారి కని పించెను. రైలు వెడలిపోయెను. హీరానుజూచుటకు వచ్చిన జనము చాలమంది మిగిలిపోయిరి. హీరారక్షకున కింకొక మార్గము కనిపించలేదు. దింపినవారు తెచ్చిన మోటారులో నెక్కక తప్పకవచ్చెను. వారిసామాన్లు, హీరాయును ద్రక్ష కుడును వారి పరిచారికయు మోటారులో నెక్కిరి. వారి పెట్టెలు మోటారువెనుక గూటిలో వేసిరి. దింపినవారు నలు

గును. వారి కా మోటారులో స్థానము లేదు. మోటారు బయలుదేరి పోవుచుండెను. కొంతదూరము పోయెను. వెనుకనుండి మరియొక లారీ వచ్చుచుండెను. దానిలో నలుబదిమంది సైనికులు నా దింపినవారు వచ్చుచుండిరి. హీరారక్షకుడు చూచెను. అతని కేమియు దోచలేదు. అతఁడు తనకు దగినంత ధూర్తుఁడు. ఇద్దఱు ముగ్గురమీఁద దిరుగబడి కొట్టగలవాఁడు. తుపాకి ప్రేల్చగల వాఁడు. అతనివద్ద చిన్నతుపాకి యుండనేయున్నది. మోటారు తోలువానిని దానితోఁ జంపి, తాను మోటారును నడిపించు కొనిపోగలఁడు. ఎచ్చటికిఁ బోవలయును? ఎట్లు తప్పించుకోవల యును? ఈ దిగినప్రదేశమునకు గుడనగరమునకు నడుమనున్న దూరము పదునాల్గుమైళ్లే. గుడనగరము రెండుమైళ్లున్నదనగా నొక వాగు కలదు. దానిమీఁద వంతెనగలదు. అచట నైదాఱు మైళ్ల వెడల్పున నొక యడవి గలదు. ఆ ప్రదేశములన్నియు నితఁడు బాగుగా నెఱుఁగును. మోటారు చిన్నబండి. తేలికగాఁ బోవుట. అడవిలో నొక రాతిబాటయు గలదు. అది యడవి లోని కైదారుమైళ్లు లోతుగా జొచ్చుకొనిపోఁగలదు. ఆ బాట పూర్వ మెప్పుడో దేనికో వేసినది. ఇప్పు డుపయోగములో లేదు. ఈ రక్షకుఁడు మోటారుతోలువానిని జంపి, మోటారు నడచుచుండగనే వానిని గ్రిందికిఁ ద్రోచి, తాను చక్రమును బట్టుకొని ప్రళయవేగముతో మోటారును మరలించుకొని యా యడవిలోనికి మరలిన ఱాతిబాటవెంట బండిని తోలు కొనిపోయి తాను సాహసముచేయవలయును. తరువాత నేమి చేయవలయును? తనది చిన్నబండి. వెనుక లారీ తనబండియంత తొందఱగా రాలేదు. ఆ యడవి యింకను నాల్గుమైళ్లదూర

మున నున్నది. వానినిజంపి క్రిందద్రోయుటకు మూడు నాల్గు నిముసములు పట్టును. ఈ నాల్గునిముసములలో లారీ మిక్కిలి దగ్గఱకువచ్చును. లారీకిని, దనకును గనీస మొకమైలుదూరమైన నుండవలయును. అతఁ డాలోచించుచుండెను. ఈ బాట యడవిలో బ్రవేశించినంతనే నాల్గు చిన్ని చిన్ని గుట్టలకు కుడిగా నెడమగా దిరుగుచు బోవును. ఆ నాల్గుగుట్టలు నొకమైలుదూరములో నున్నవి. అచ్చట లారీకిని దనకును నిస్సందేహముగా దూరమేర్పడును. అది తగిన స్థలము.

మోటారునడపువాడు వెనుకనుండి యేమైన బండ్లు వచ్చుచున్నవేమో చూచుటకుఁ దనకెదురుగా జిన్నయద్దమును బెట్టుకొనును. హీరారత్నుకుఁ డా యద్దమువంకఁ జూడలేదు. మోటారునడపెడివాడు హీరారత్నుకునిచలనమంతయు నా యద్దములో గనిపించునటు తగినకోణములో నా యద్దమును ద్రిప్పియుంచుకొనెను. ఇతని తీవ్రమయిన యాలోచనమును జూచుచుండెను. వాఁడు కదలిన ప్రతికదలికయు జూచుచుండెను. హీరారత్నుకుఁడు వంగెను. అతఁ డేదియో పెట్టె తెఱచుచున్నట్లు తోలువాడు గ్రహించెను. ఏదియో వస్తువుతీసినట్లు గ్రహించెను. దానిని దనయొడిలో బెట్టుకొని సర్దుచున్నట్లు గ్రహించెను. అది నిస్సందేహముగా చిన్నతుపాకి. అతఁడు వెంటనే తన్నుఁ గాల్చునా? తుపాకి తనవద్దబెట్టికొని బండిని తనయిచ్ఛవచ్చినట్లు తోలుమనునా? ఇది ప్రశ్న. సారథి యాలోచింపనారంభించెను. హీరారత్నుకుడు సాహసముచేసినచో గుట్టలమలుపులలోఁ జేయవలయును. తాను బండివేగమును దగ్గించెను. వెనుకవారిది గ్రహించిరి. లారీని వేగముగా నడుపుచు మోటారుతో

గలిసికొనిరి. రెంటిమధ్య నెక్కువయెడము లేకుండఁ బ్రయాణము సాగుచున్నది. హీరారక్షకుఁడు నిది గ్రహించెను. ఇంతలో సారథి యేమిచేసెనో తెలియదు. మోటారుయంత్రములో నొక విపరీతధ్వని యారంభించెను. మోటారాగెను. వెనుక వారి కాగుఁడని సంజ్ఞ చేసెను. రెండు మోటారులును నిలిచెను. సారథి బండిదిగి నిలిచెను. నిలిచినంత సేపు హీరారక్షకునివంకనే చూచుచుండెను. అతఁడు చేయికదుపుటకు వీలులేదు. కాలు కదపుటకు వీలులేదు. వెనుకనుండి మనుష్యులు వచ్చిరి. సారథి వారివంకనే చూడలేదు. హీరారక్షకునివంకఁజూచుచు "నీవును హీరాయును బండిదిగవలయును. ఆ పీఠముక్రిందఁ గొన్ని సామానులున్నవి.వానితో యంత్రము మరమ్మతుచేయవలయు" ననెను. అతనికి దిగకతప్పదు. చేతిలోని పిస్తోలు తప్పకుండఁ గ్రిందఁబడును. అతఁడు తటపటాయించుచుండెను. ప్రక్కన నిలుచున్న సైనికుఁడు వానియం దేదో దోసమున్నదని గ్రహించి వానినిఁ గ్రిందికిలాగెను. పిస్తోలు క్రిందఁబడెను. సారథి యా పిస్తోలును జేతదీసికొని తాను మరల బండిలోఁ గూర్చుండి సైనికునితో చెప్పెను. "ఇతనిని లారీలోఁ దీసికొనిరండు. నేను బండి తోలుచుందు"ననెను. హీరారక్షకునకు లారీలో నెక్కుట తప్పినదికాదు.

రెండుబండ్లును నడవిలోఁ బ్రవేశించినవి. గుడనగరాభిముఖముగాఁ బోవుటలేదు. ఏ రాతిబాటమీద బండినిపోనిచ్చి హీరారక్షకుఁడు తన్ను రక్షించుకొనఁదలఁచెనో యా బాట వెంటఁ బోజొచ్చెను. అతఁ డిది గుడనగరమునకుఁబోవుబాట

కాదనెను. నీ విల్లే తప్పించికొని పోనెంచితివిగద! నీ వెక్కడికిఁ బోదలంచితివో నిన్నక్కడికే కొంపోనెంచితిమని వారు చెప్పిరి. అతనికి గుండెలోఁ జాల భయము వేసెను. తన కేదో మూఁడినది. నీరా నేమిచేసెదరో! అతఁడు వారిని 'అక్కడ నిల్లులేదు భవనములేదు. అది వట్టి యడవి. హీరా నచ్చటికిఁ దీసికొని పోయి యేమిచేసెద'రనెను. వారు "నీ వామె నక్కడికి దీసికొనిపోయి యేమి చేయదలచితివి?" యనిరి. అతఁడు మౌనము వహించెను.

హీరారత్నకు డా ప్రదేశమును బదియేండ్ల క్రింద నెఱుఁగును. అప్పు డచట పలకలుచేయుటకుఁ దగిన ఱాతిగని దొరకెను. ఒకవర్తకు డా గని నిజారాకుఁ దీసికొనెను. ఆ కాలములో నితఁడు లారీని నడపుచుండెడివాఁడు. ఇతనిలారీ యా పలకఱాళ్లు మోసికొనిపోవుచుండెడిది. అతని కా ప్రదేశమంతయు సుపరిచితము. అతఁడు రెండు మూఁడు హత్యలు చేసినవాఁడు. హంగరాజుయొక్క ప్రాపకముగలవాఁడు. అనగా హంగరాజు నెఱుఁగు. హంగరాజు తా నిటువంటివారిని గొందఱిని దన పర్యవేక్షణలో బెట్టికొనును. అతనినీతిలో నిట్టివారు కొందఱు కలిసియుండిరి. అతడు కొన్ని కొన్ని పనులిట్టివారిచేఁ జేయించుచుండును. అతనిప్రాపకముతో నితఁడు లారీలుతోలెడువాడుగా మానివేసి, నాట్యముల నేర్పాటు చేయువాడుగాఁ బ్రకాశించెను. హీరానాట్యములు పైకి నాట్యములు గాని, హంగరాజు తా నెవ్వరినో తనవలలో వేసికొనుటకుఁగాని, వారిరహస్యములు తెలిసికొనుటకుగాని యీ నాట్యముల నేర్పాటుచేయించెడివాఁడు. గిరిధరుఁడు, వీరేశ్వర

శ్రేష్ఠి మొదలయిన గుడనగరములోని మహాధనికులరహస్యములను కనుగొనుటకే గుడనగరములో హీరానాట్యమేర్పాటుచేయబడెను. హీరా వారితోడఁ బరిచయము కలిగించుకొని వారివి దనకుఁ దెలిసిన రహస్యములు రక్షకుని ద్వారా హూంగరాజునకుఁ జేర్చుచుండెను.

పూర్వ మీ ప్రదేశమునఁ జిన్నపాకయుగూడ లేదు. ఇప్పు డొక పెద్దభవనము కనిపించెను. అచ్చటికిఁ బోయి బండ్లాగెను. అందఱును దిగిరి. అది పెద్ద భవనము. చాల గదులు కలవు. రెండుగదులు హీరారక్షకునకు నాల్గుగదులు హీరాకును బ్రత్యేకిపఁబడెను. తక్కినగదులలో నలుబదిమంది సైనికులు, నలుగురు హీరాను రైలుబండిలోనుండి దింపినవారు, ఇద్దఱు బఁడ్లుతోలెడివారు నాక్రమించుకొనిరి. అది చిట్టడవి యైనను బరమ నిర్జనప్రదేశము. అక్కడ నింత భవన మెందుకు గట్టిరో, యెవరు కట్టిరో తెలియదు. స్నానాదులైనవి. ఎవరో తెచ్చి భోజనమును వడ్డించిరి. హీరాగాని తద్రక్షకుడుగాని యా గదులలోనుండి వెలికి వచ్చుటకు వీలులేదు. అతఁడు సైనికులలోగాని మఱి యితరులలోగాని యెవ్వరినయినఁ బిలిచి మాటాడుటకు బ్రయత్నముచేసినను వారు పలుకరు. బయటకు రాఁ బ్రయత్నించినచోఁ దుపాకిఁ జూపించుచుండిరి. ప్రతిగవాక్షము వద్ద నొక సైనికుఁడు తిరుగుచునేయుండెను. అతఁ డేమిచేయును. కొంతసేపు నిదురపోఁ బ్రయత్నించెను. నిదురపట్టలేదు. అట్లే కాలము గడచెను. రాత్రిపడెను. ప్రొద్దుపోయెను. ప్రొద్దుపోయినకొలంది దూరముననుండి ఫిరంగులమ్రోతలు, తుపాకులమ్రోత, పెద్ద ప్రేలుడుధ్వనులు వినిపింపనారంభించెను.

ఆ ధ్వనులన్నియు గుడనగరమునుండి వినిపించుచున్నవి. వాని మనస్సులో నొక యాశ రేకెత్తెను. ఈసారి హీరానాట్యము పూర్వమువలె గొండఱిరహస్యములు తెలిసికొనుటకు మాత్రమే చేయబడినది కాదని వానికి లీలగాఁ దెలియును. హంగబలా తనతో దానినిగూర్చి మాటాడినపుడు రహస్య మేదో దాచుచున్నట్లే మాటాడెను. అతఁడు మాట్లాడిన నాల్గయిదుమాటలనుబట్టి వీఁడు గ్రహించెను—ఇది యేదో పెద్ద ప్రయత్నమని. రాజ్యములు విభక్తములగుచున్నవి కనుక గుడరాజ్యముమీఁద నేదో పెద్దయెత్తున నొక ప్రయత్నము జరుగుచున్నదని యతఁ డనుకొనెను. అంతయు నతని మన స్సులో ననుకొన్నదే కాని విస్పష్టముగా నతనికి దెలిసినవిష యము కాదు. గుడనగరములో నీ కాల్పులు ప్రేలుడు విని పింపఁజొచ్చిన తరువాత నతఁ డట్లనుకొనెను. కాని మరల నింకొక యనుమానము తోఁపఁజొచ్చెను. ఇది పట్టాభిషేక దినము కదా! ఉత్సవములు చేయుచుండిరేమో!

రాత్రి ప్రొద్దుబోయెను. సైకులలో నెవ్వఁడును దనవలె నాందోళనమందుటలేదు. అచటి యుత్సవము చూడవలయు నన్న యభిలాషకూడ వారియందుఁ గనిపించుటలేదు. ఆ రాత్రి గడచినది. మఱునా డంతయు గడచినది. గుడనగరములోఁ గాల్పులు ప్రేలుడులు జరుగుచునేయుండెను. వానిధ్వని విన వచ్చుచునే యుండెను. ఇక్కడి సైనికుల కా ప్రసక్తి యా విష యమే పట్టుటలేదు. తన్ను నీరాను జూడనిచ్చుటలేదు. నీరా యెట్లున్నదో యేమయినదో తెలియదు.

మనస్సు దానిపోకళ్లు దానివి. తా నిపుడు ప్రాణాపాయస్థితిలోనుండెను. తనస్థితినిగూర్చి తనకు నమ్మకము లేదు. తనరహస్యము బట్టబయలైనదన్నట్లు సంపూర్ణముగా దెలిసెను. తన్నేమి చేయుదురో తెలియదు. ఈ స్థితిలో నీరా హీరా కాదని వారు తెలిసికొందురేమో యని వానికి భయము. ఇంత తెలిసినవారికి నీరా హీరాకాదని తెలియదా? ఆమాత్ర మతఁ డనుకోవలదా? కాని మనస్సనుకోననీయదు. మఱియు మనసులో నింకొక దిగులు. అది మూగది. తన కేది కావలయునో చెప్పదు. కాని యామెతో బరిచారిక గలదు. ఈమెకు గావలసిన దది చేసిపెట్టునని ధైర్యము. అతనికి హీరామీఁదనున్నంత యభిమానము నీరామీఁద నెవ్వఁడును లేదు. వీరిద్దఱిసంగతి హాంగబలాకు దానుజెప్పెను. అతఁడు హాంగరాజుతో జెప్పెనట. హాంగరాజీమెస్థితి గుప్తముగా నుంచవలెనని హాంగబలాతోఁ జెప్పెను. హాంగబలా యీయేర్పాట్లుచేసెను. ఇదియంతయు నెందుకు జరుగుచున్నదో, దానిప్రయోజన మేమో హీరారక్షకునకు దెలియనే తెలియదు.

రాజనీతివేత్తలు దూరదర్శులు. వారు కొన్ని విషయములను తత్కాలప్రయోజనము లేకుండగనే రక్షించుచుందురు. ఎప్పుడో దానివలనఁ బ్రయోజనము పుట్టవచ్చును; పుట్టకపోవచ్చును. పుట్టినచో దాని నుపయోగించుకొందురు. పుట్టనిచో నది యదిగానే యుండును. అది యదిగానే యవసానము గాంచును. హీరారక్షకుఁ డింత దవ్వు తెలిసినవాడుకాఁడు. కాని హాంగబలా యట్లు చెప్పెను గానఁ జేసెను. హాంగబలా గుడనగరములో లేఁడు. హీరా

నాట్యము జరుగలేదు. కనుక నే యెత్తు జరుగునని వీఁ డనుమాన పడెనో యది జరుగలేదన్నమాట. కాని గుడనగరమునుండి వినవచ్చుచున్న కొల్పులు ప్రేలుడులధ్వనులు పట్టి పట్టాభిషేక సముత్సాహజనితములుగా లేవు.

మూఁడవనాఁడురాత్రి రెండుజాముల వేళ నా భవనము కడకుఁ గ్రొత్తగా వచ్చిన మోటారులధ్వని వినవచ్చెను. ఆ మోటారులమీఁద నెవరువచ్చిరో తెలియదు. పురుషులువచ్చి నట్లే యలికిడియయ్యెను. పురుషులు దిగి లోనికివచ్చునపుడు గొలుసులచప్పుళ్లయ్యెను ఎవరో బంధితులను దీసికొనివచ్చిన ట్లున్నది. ఆ బంధితులు పదిమందికిఁ దక్కువయుండరు. వారు చేతులకు సంకెలలు వేయఁబడియుండవలయును. ఆ భవనములో దూర్పువైపున నొక గది కలదు. ఆ గది కినుపతలుపులు మొద లైన కట్టుదిట్టములు చేయబడియున్నట్లు మూసాన్నాళ్ల క్రింద నతఁడు చూచెను. ఆ యినుపతలుపులు తెఱువఁబడిన చప్పుడు, నందులోనికి వారని ద్రోసినచప్పుడు వీనికి వినిపించెను.

తనచేతికి సంకెలలేల వేయలేదు? మఱునాఁడు వేయు దురా? ఆ బంధితులెవరు? ఎవరినయినఁ జెఱసాలలోఁ బెట్టు దురు కాని, యడవిలోనున్న యీ యింటికి దీసికొనివచ్చుట యేమి? చెఱసాలకంటె నిది భద్రమా? సామాన్యదోషులను జెఱసాలలోనుంతురు. వారిని న్యాయస్థానములో విచారింతురు. అంతకుమించిన మహాద్రోహులను జెఱసాలలో బెట్టరేమో! న్యాయస్థానవిచారణ జరుగదేమో!

హీరారక్షకుఁడు తనలోఁ దానె విచారించికొనెను. తన కింతయూహ యెక్కడిది? ప్రాణముపోవునన్న భయము

పుట్టినచో మనుజునకు వివేక మెక్కువయగునేమో! ఆలోచన యెక్కువగునేమో! ఐనచో రాజనీతివేత్తలు మహాలోచనాపరులు. వారి కెప్పుడును ప్రాణభయముండునేమో! వారి కేమి ప్రాణభయము? సామాన్యులకు ప్రాణభయ మెట్టిదో రాజనీతివేత్తలకు దమ యధికారము పోవునేమోయన్న భయ మట్టిది కావచ్చును. భయముచేతనే యాలోచన వృద్ధిపొందును. భయ మనగా లోకమును బంధించుకొందమన్న యాశ. ఆ యాశ సాగదేమోయన్న యూహయే భయము. అట్టి తలంపే యాలోచనకు నిదానము.

## సప్తమాధ్యాయము

పట్టాభిషేకమునాటిరాత్రి గుడనగరములో రెండు హాంగరాజీయులయిండ్లు ముట్టడింపఁదగినస్థితిలో నుండెను. ఎప్పటికప్పు డీ వార్తలు వల్లభమంత్రికిఁ దెలియుచునేయుండెను. ఇట్టి వెన్నియుండెనో, యీ యిండ్లు దుర్గములుగా నెందుకు సిద్ధముచేయఁబడినవో, యివి యెప్పుడు పేలుమనునో! గుడనగరములో హాంగరాజీయులగృహములు కొన్ని వేలున్నవి. సామాన్యులయిండ్లు దీసివేసినను ధనవంతులవి కొన్నివందల యిండ్లుండును. ఈ వందలగృహములలో నే గృహ మీ రీతిగా మందుకొట్టుగా నున్నదో విచారించుట యెట్లు? తెల్లవాఱినది. రంగీలా కాలగిరికిఁ బంపింపఁబడెను. ప్రొద్దెక్కినది. హీరా నిర్బంధింపఁబడెను. హాంగజంగ అనుయాయులు బంధింపఁబడిరి. వారివారి వర్తమానములు తెలిసినఁగాని యేది యెట్టిదో యెట్లు చేయవలయునో తెలియదు. హాంగరాజు వేసినపదక

మొకటి మనస్సునకుఁ దట్టుచున్నది. ఆ పదకము నిక్కువముగా భాసించియుండవచ్చును. ఆ పదకములో నొక్కయంశమే తెలిసెను. హీరా చనిపోయినది. ఆమెచెల్లెలు నీరా. ఇది మూగది. హీరాపేర నాట్యమునిర్ణయించి నీరాను రంగము మీదికి దీసికొనివత్తురు. నీరా నాట్యముచేయలేదు. ఇది యెందుకు జేసినట్లు? హీరాయందు జనులు సముత్సాహము కలవారు. జనులను బ్రమత్తులఁజేయుటకా? హీరానాట్యమన్నచో నగరములోని ధనవంతులు, నధికారులు, సర్వజనుల నొకచోట సమకూర్చుటకా?

ఈ యూహ తోచినంతనే వల్లభమంత్రి యాజ్ఞపంపించెను. నాట్యభవనమును సైనికులు ముట్టడింపవలయును. మూరు మూలలు వెదుకవలయును. గోడలక్రిందఁ దవ్వించూడవలయును.

ఈ నాట్యభవనమునకు రెండువైపుల వీథి కలదు. ఒక వైపున నంగళ్లుపెట్టు విశాలస్థలము కలదు. పొడుగయిన నాల్గవ వైపున వెనుకతట్టున హంగరాజీయులయిండ్లు కలవు. వారంద ఱును బేదయు బిక్కయు.

మఱునాఁడు తెల్లవాఱినది. సైనికులు పోయి నాట్యభవనముచు ముట్టడించిరి. ముట్టడించుటకేమున్నది? అంగళ్లుగల వైపునఁ గ్రయవిక్రయములు జరుగుచుండెను. అందు గృహములు లేవు. విశాలమయినప్రదేశము. కూరగాయలు మొదలైనవి యమ్ముదురు. సైనికులు వారందఱను బంపివేసి యాస్థలము నాక్రమించిరి. ముట్టడివేయదగినస్థలము నాల్గవవైపున నున్నది. ఆ వెనుకనున్న హంగరాజీయులగృహములు వెనుకకుఁ బోనుపోను నగరములోగల తక్కినయిండ్లతోఁ గలిసికొని

యున్నవి కాని విడివిడిగా లేవు ఆ ప్రాంతమున నిండ్లు క్రిక్కిరిసి యున్నవి. ఒకదానిమీఁద నొకటి యున్నది. అన్నియు జిన్నచిన్న సందులు. కొన్నియిండ్లకు మార్గమే లేదు. ఒక యింటిలోనుండి మఱియొకయింటిలోనికిఁ బోవలసియున్నట్టుండెను. సైనికు లా యిండ్లలో ప్రవేశించిరి. ఆ యిండ్లలో నివసించువారి నిండ్లువదలి పొమ్మనిరి. కొన్నియిండ్లు మాంధాతృ మతస్థులవి. వారి కేమియు దెలియలేదు. నాట్యభవనమున కాని కొనియున్నయిండ్లనే ముఖ్యముగా బరీక్షింపవలయును. ఈ పరీక్ష ప్రొద్దెక్కువఱ కారంభింపఁబడినది. కొన్ని యిండ్లలోనికిఁ బోయినసైనికులు లోపలనే వధింపఁబడిరి. వెంటనే సేన పెద్ద యెత్తున ముట్టడి యారంభించెను. జనము భీతావహులై తమ తమయిండ్లు వదలి, కొందఱు కట్టుగుడ్డలతోఁ గొందఱు చే జిక్కినంత సామానుతో నా ప్రాంతమునందలి గృహములలో నుండి పలాయనముచేసిరి. ఈ జనము పోయి తక్కిన యూరి మీఁదఁబడి యెక్కడనో యొకచోటఁ దలదాచికొనవలసివచ్చెను. నిముసనిముసమునకునాట్యభవనమువద్దఁదుపాకులమ్రోతలు యిళ్లు ముట్టుకొని తగులబడిపోవుట జరుగుచుండెను. ఆ పేట పేటయంతయు సుమారు మూఁడు నాల్గువేల యిండ్లవారు ప్రొద్దుగ్రుంకువఱకు లేచిపోయిరి. కొన్ని సుపరీక్షితములయి కట్టుదిట్టములుచేయబడిన యిండ్లను సైనికులు స్థావరమేర్పఱచి కొనిరి. ఏ గృహముయొక్క స్థితి సందేహాస్పదముగానున్నదో యా యిండ్లమీఁదికి గాల్పులు సాగించుచుండిరి. ఆ ప్రాంతము లందలి హంగరాజీయులనెవ్వరినిఁ బారిపోకుండ నిర్బంధించిరి.

అరగంటకో గంటకో యొక పెద్దప్రేలుడు, ఏదో కట్టుదిట్టముగల గృహమునుండి కాల్పులు. ఆ గృహములలోనున్న హంగరాజీయులు నాట్యభవనములోనికిఁ బోవుటకు వీలులేదు. నాట్యభవనమునకు రెండువీధులవైపున సైనికులు తుపాకులతో నిలచి యుండిరి. అంగళ్లుపెట్టు విశాల స్థలమునందు నాట్యభవనపు గోడనానికొని సైనికులు త్రవ్వి చూచిరి. ఆ గోడక్రింద మందు గనులున్నవి. అన్నిటిని జాగ్రత్తగాఁ దొలగించిరి. ఊరంటుకొని యున్న నాలుగవవైపున గోడక్రింద నిట్టిది యుండవలయును. అచటఁ ద్రవ్వుటకు వీలులేదు. ఏ నిముసములో నేది పేలునునో తెలియదు. వానియంతటనవి ప్రేలవలయును. లేదా యా వరసలోనున్న వందయిండ్లు స్వాధీనము కావలయును. ఆ పగటిమొత్తముమీఁదఁ బదియిండ్లు మాత్రము ప్రేలినవి. ప్రేలినంతమేర గోడలు పడిపోయినవి. ఆ వెనుకయిండ్లు దగ్ధమయినవి. ఏ యిండ్లు ప్రేలునో వానినిగూర్చి విచారించుట వేఱును, దగులబడుచున్న యిండ్లనుజల్లార్పఁ జూచుట వేఱును. ఆ యిండ్లను జల్లార్చుటకుఁ బోయినచో యేది యేమి విపత్తో తెలియదు. అంతయుఁ బరమదుర్గ్రాహ్యముగా నుండెను. కాని సైనికులకు నిట్టి పరిస్థితులలో సర్వము సువ్యక్తముగా నుండును. వా రంగుళముమేర ముందడుగువైచినచో ముందుకట్టుచూచి కొనియే వేయుదురు. సైనికశిక్షణ యటువంటిది. వారి పదకములు—వారు ముందుకుసాగుటయు, వా రాపదలను బసిగట్టుటయు,వారు శత్రువులను గనుగొని యెచ్చటివారి నచ్చట మడియించుటయు వారికేఁ దెలియును. మఱి యెవ్వారికిని దెలియదు.

ఈ మహాకార్య మనవధికముగా నచ్చట నుండెను. వల్లభమంత్రియాజ్ఞ మఱియొకడు బయలుదేరెను. ఆయన యాలోచించెను. ఇదియంతయు మాంధాతృమతనిర్మూలనముకొఱకు గుడనగరనాశనము కొఱకు, గుడరాజ్యము గుడూచీరాజ్యమున జేర్చుకొనుటకుఁ, బెద్దయెత్తున మాంధాతృమతస్థుల నిర్మూలనముకొఱకు. ఇది ప్రజలకుఁ దెలియరాదు. తెలిసినచో బ్రజలు గగ్గోలుపడిపోవుదురు. పైగా ఆపద యిచ్చోటనున్నదని తెలియదు. గుహాగానున్నదని దలదాచుకొనుటకుఁ బోయినచో నచటఁ బెద్దపులి యుండవచ్చును. ఈ సంగతి ప్రజలకుఁ దెలియరాదు. రక్షకభటులకే తెలియవలెను. రక్షకభటాధికారిని బిలిపించెను. "ఓయి! మున్నాళ్లు రక్షకభటులకును నగరసంరక్షణకును సంబంధములే"దని చెప్పెను. నగరమంతయు సైనికులకు వశమయ్యెను. నగరవీధులలో బురుగు లేదు. మాంధాతృమతస్థులకు దిక్కు దిబాసు తోచలేదు. గుట్టు తెలియదు. కొన్ని యేండ్లుగా వారెఱిగిన దొక్కటేవిషయము. హంగరాజీయులావేశమెత్తినపుడెల్ల నగరముపయిఁబడి కోలాహలము చేయుట, మాంధాతృమతస్థులయిండ్లలో దూఱుట,మనుష్యులను వధించుట, దోచికొనుట-ఇట్టివి వారెఱుగుదురు. ఇప్పు డదియే జరుగుచున్నదని జనులనుకొనిరి. జనులంగళ్లకుఁ బోవుటలేదు. ఉద్యోగములకుఁ బోవుటలేదు. తలుపులుదీసికొని బైటకు వచ్చుటలేదు. ప్రక్క నెదో పెద్దప్రేలుడు వినిపించును. అరుగో హంగమతస్థులు వచ్చుచున్నారు. వారి దాడికిఁ దమయిండ్లు నిలువవు. పదిమంది పేదయిండ్లవారు పాలుత్రావు పసికూనలను జంకవేసికొని ప్రాణప్రదములయిన

వస్తువులను బెట్టెలలో బెట్టి తలలపైఁ బెట్టికొని, వారియిల్లు భద్రమయినది వీరియిల్లు భద్రమయినదని వెదకుచు గట్టియిండ్ల లోనికిఁ బోజొచ్చిరి. వారు నాశ్రయమిచ్చుచుండిరి. నగరమంతయు నింత గగ్గోలనిఁ జెప్పుటకు వీలులేదు.

ఇట్లుండగాఁ బ్రొద్దుగ్రుంకెను. చీకట్లు వచ్చెను. అంతకంటె నంతకంటె నిది యిది యని తెలిసికొను తెలివి వెనుకఁ బట్టెను. చీకటికి భయమునకు నొక్కటియే భేదము. చీకటి యనగా లోకమునందు వెలుగాడకపోవుట. ఇది యిదియని సుస్పష్టముగాఁ దెలియకపోవుట. ఒకదానినిజూచి మఱియొకటి యనుకొనుట. చక్కగానున్నదని గోతిలో పడవచ్చును. గోయి యనుకొని మెట్టమీద గాలువేయవచ్చును. బురద యున్నచోట మంచినేలయని కాలువేసి దిగబడవచ్చును. ఏదో తెల్లగానున్నచోట మనిసియనుకొనవచ్చును. ఏదియో దయ్యమువలెఁ గనిపింపవచ్చును. భయము, మనసులోఁ దెలివి యాడకపోవుట—ఇన్ని లక్షణములు భయములోఁగూడఁ గలవు. ఆ భయమును చీకటి విజృంభించినది.

ఇది యిట్లుండగా రైళ్లు వచ్చుచునేయుండెను. వాని కూతలు వినిపించుచుండెను. రైళ్లుదిగినజనము తా మెచ్చటికిఁ బోవలయునో తెలియదు. వారిని సైనికు లెచ్చటికిని బోనిచ్చుట లేదు. ఎచ్చటనో యెందుకో కొన్ని కేకలు వినిపించును. అదుగో హంగరాజీయులు! జనము తండతండములుగాఁ బరుగెత్తిపోవుదురు. చీకటి పల్లములలోఁబడుచు మెట్టలనుఁగొట్టుకొనుచు సంసారములతోఁ దూరదూరములు పోవుచు జనముపొందిన దురవస్థకు మితిలేదు.

ఇంకొకయంశము బయలుదేఱినది. హాంగరాజీయులు మతావేశపరులయి బయలుదేరినపుడు వారి నెదుర్కొనుటకుఁ దగిన దృఢకాయులు మాంధాతృమతస్థులు కలరు. వారు గిరిధరునిమల్లులు.మఱియుఁబెక్కు చోట్లగల ధూర్తులైనమాంధాతృమతస్థులు. వారును దృఢకాయులు. వారు మహానగరమునందు బయలుదేరిరి. రక్షకభటులు లేరు. వారికి నగరము యథేచ్ఛావిహారమయ్యెను. ప్రాత పగలు వెలికివచ్చెను. వారి కెట్లు తెలియునో తెలియును, నగరము హాంగరాజమతస్థులు నాశనము చేయుట కారంభించిరని. తమ ప్రాణములు రక్షించుకొనుటకు మాంధాతృమతస్థు లెట్లు పారిపోవుచుండిరో కొందఱు హాంగరాజమతస్థులు నట్లే పోవుచుండిరి.ఈ మల్లులు వారినెక్కడివారి నక్కడ మడియించుచుండిరి. సౌధములపైని గవాక్షములనుండి, వీథులలోనికిఁ దెఱచియున్న గవాక్షములనుండి వీథిలోఁ బెద్దయలజడి పుట్టగా నేమిజరుగుచున్నదో చూడవలయునని జాగ్రత్తగా గవాక్షపుదలుపులు తెఱచి పెద్దవారు వలదనుచున్ననుఁ బిన్నవారు చూడనారంభించిరి. ఏమి జరుగుచున్నది? ఎవ్వరినో కొందఱిని మఱికొందరు తఱుముదురు. కర్రలతో గొట్టుదురు. వారు చచ్చిపోవుదురు. ఆ శవములను గోడప్రక్కలకుద్రోసి వీరి దారిని వీరు పోవుదురు. ఇంటిలోనున్న యందఱును గవాక్షములనుదెఱచి చూతురు నఖశిఖపర్యంతము కంపించిపోవుదురు. మరల దలుపులు వేసికొందురు. ఆ చనిపోయినవా రెవరో, ఆ చంపినవా రెవరో? చనిపోయినవారు తామమాత్రము కాదు. భయసముద్రములోని చిన్ని ద్వీపము.

మూఁడున్నాళ్ళిట్లు గడచినది. జనులకు ప్రాణములలో ప్రాణములు లేవు. మనస్సులో మనస్సులేదు. ఇండ్లలోఁ బ్రతికియున్నవారు బ్రతికియున్నారు. ఊరంతయు శవములు పాసిపోవుచున్నవి. దుర్వాసన ప్రబలిపోవుచున్నది. శవములను కుక్కలు పీకుచున్నవి. గ్రద్దలాడుటలేదు. ప్రేలుడులకు బెదరి పక్షియన్నది మహానగరాకాశముపొంతకు వచ్చుటలేదు. పెక్కిండ్లలో వంటలేదు. తిను పదార్థములు లేవు. కొనదగినచోటులేదు. ఎవఁడయినను దెగించి బయలుదేరినచో నింటికి తిరిగివచ్చుననునమ్మకము లేదు. తిండిలేక చనిపోయినచో నింటిలోననే చనిపోదము. బయటికిపోయి యిట్టి దుర్భరమయినచావు చచ్చుట యెందులకని స్త్రీలు పురుషులఁ బోనీయరు. కాని యొకదానినట్టుకొని యొకఁడుగా బదికొంప లున్నచో నందులోని నలుగురు సాహసులైనపురుషులు గుమిగా కూడి యేమయిన పదార్థములు దొరకినచో గొనితెత్తుమని పోవుటయు, దారిలో భయంకరదృశ్యములు చూచుటయు, నంగళ్లులేవని తెలిసికొనుటయు,నిండ్లకు దిరిగివచ్చుటయు, వచ్చి నిర్వాకుల్లగుటయు జరుగుచున్నది

ఈ వ్యవహారము నాల్గుదినము లవిచ్ఛిన్నముగా జరిగినది. అరగంట గంట రెండుగంటలు పదినిమేషము లెడమెడముగా ఫిరంగుల మ్రోతలు, తుపాకులకాల్పులు తప్ప మఱియొక్కఁ డా యూర లేదు. ఐదవనాఁడు తెల్లవారువఱకు సర్వము శాంతించినది. వీథిలో నొక్కశవము లేదు. వీధులన్నియుఁ బరిశుభ్రముగా దుడువఁబడినవి. యథాస్థితిగఁ బాలమ్మువాండ్రు వచ్చి తలుపులుకొట్టిరి. అందరును బెరుకుబెరుకుమనుచుఁ దమ తమ కార్యములయందుఁ బ్రవృత్తులయిరి. అప్పటినుండి సరఁవార్తలు

తెలియసాగెను. హూంగరాజీయులు హీరానాట్యము జరుగు వేళకు నాట్యభవనము ప్రక్కనంటికొనియున్న గృహములలోఁ బెట్టిన గనులకు నిప్పుముట్టించెడివారట. నాట్యభవనములో నావేళకు గుడనగరములోని మహావర్తకులు మహాధికారులు నందఱు నుందురు గదా! అంద ఱొక్కసారి దగ్ధపటలమయిపోవుదురు. విశాలమయిన యంగళ్లస్థలమునంటియున్న గోడక్రిందఁ గూడ గనులుపెట్టిరి. తక్కిన రెండువైపుల హూంగరాజమతస్థులు సాయుధపాణులై నిలిచియుండెడివారట. ఆనాటిరాత్రి నాట్యమే జరిగినచో నాట్యభవనములోనున్న మాంధాతృమతస్థుఁడొక్కఁడు బ్రదికియుండఁడు.

మహానగరములో నప్పటికి దుర్గములనలె నిర్మింపఁబడి మందుగుండుసామానులతో నింపబడియున్న హూంగరాజమతస్థులభవనములు వంద తేలినవి. ఈ వందగృహములు మహానగరమునం దక్కడక్కడ నున్నవి. ప్రతియింట నేబదిమంది మొదలు వందమందివఱకు హూంగరాజీయులయిన దృఢకాయులు సాయుధులైయుండిరట. ఈ నాట్యభవనము ప్రేలుట వారికి సూచన. ఆవేళకు గుడనగరములోని భిన్నభిన్నప్రాంతములలో మాంధాతృమతస్థులవధ యథేచ్ఛముగా సాగియుండెడిది. మఱునాటికి గుడనగరమంతయు గుడూచీనగరరాజధానిలో జేరెడిది. సైనికు లెచ్చటనో యుందురు. సైనికులువచ్చువఱకు గుడనగరమే యుండెడిదికాదు.

# అష్టమాధ్యాయము

హీరారత్నకుఁ డారాత్రి యినుపతలుపులు తెఱచు టయు శృంఖలాబద్ధులయిన యెవ్వరినో యా గదిలో నుంచు టయుగా సవ్వడులు వినెను. మఱునాటి ప్రొద్దున నాలుగుదిన ములనుండి లేని విడుదల వానికి లభించెను. ఆ విడుదల విలక్షణ మయినది. నాల్గుదినములనుండి యతఁడు గదులలోనుండి వెలికి వచ్చుటకు వీలులేదు. ఇపుడు వెలికివచ్చుటకు వీలయినది. నాల్గు దినములనుండి వానిచేతులకు గాళ్లకు సంకెలలు లేవు. ఇప్పు డున్నవి. ఇది విడుదలయా? అది విడుదలయా? అది యొకరీతి విడుదల; ఇది యొకరీతి విడుదల. అది యొకరీతి బంధనము. ఇది యొకరీతి బంధనము. ఈ రెంటిలో జీవున కేది ప్రియతరము? హీరారత్నకుడు కడచినరాత్రినుండి వివేకియై నాడు. ఆలోచనాపరుడయినాడు. ఇది యొక చిత్రము. జీవిత ములో నగానికిఁబైగా దరిద్రుడయియుండి యే యఱువదియవ యేటనో ధనవంతుడగును. జీవితములోఁ బెద్దకాలము బ్రహ్మ చారిగా నుండి యపుడు వివాహితుఁడగును. పెద్దకాల మన పత్యుడుగా నుండి యపుడు సంతానవంతుఁడగును. ఎవో సన్నివేశములు జరిగి వానికా యా దశలుపట్టును. ఇవి బాహిరమయినవిషయములు. అవి యట్లు సంఘటిలుటలో జనము చెప్పికొన్నను వాని యదృష్టమని చెప్పికొందురు. లోక ములో నదృష్టమన్నమాటకు యోగార్థము పోయి రూఢ్యా ర్థము పట్టినది. యౌగికార్థప్రశంసయే కనిపించదు. దృష్టమయి నదియే యదృష్టముగాఁ జెప్పుదురు. అదృష్టమైనదానిని విచా

రించరు. దానిని విచారించవలసిన సన్నివేశ మిట్టిది. నలుబది యేండ్లు మూఢుఁడు, నాలోచనాహీనుడు, పశువు. వానిలో నవ్వు డూహా ప్రజ్వరిల్లును. ఆలోచన సంజ్వలించును. భావన యంకురించును. ఇది చిత్రము. అంతటి దృష్టము కాదు. ఇచట నదృష్టశబ్దము రూఢిని వదలి యౌగికప్రశంసకు జేరును. దీని నెవ్వడును వాని యదృష్టమనఁడు. అసఁగా రూఢ్యర్థములో ననఁడు. యౌగికార్థములోనను ననఁడు. కాని యదృష్ట మనఁగా నిది. వానిమనస్సులో నూహాలు చెలరేగెను. శృంఖలావిహీనములయిన కాలుసేతులతోఁ బరిమితప్రదేశ మున నుండుట సుఖమా? శృంఖలాసహిత కరచరణములతో నంతకంటె నెక్కువమేర సంచరించుట సుఖమా? అతడు కాక యింకొకడయినచోఁ దొలుతటిది సుఖమని యనుకొనియుం డును. అతఁ డనగా నొక విలక్షణమయిన మార్పును బొందిన మనఃప్రవృత్తిగల యప్పటియతఁడు. వానికి సశృంఖలుఁడయ్యు వెలికివచ్చుట యధిక సుఖమనిపించెను. ఇది నాల్గునాళ్లు వాడు పొందిన యిరకటమా? సహజముగా వానిమనస్సుపొందిన విప్పుదలయా?

ఆ నాల్గునాళ్లలో వానియనుభూతి యొక విలక్షణ మయినది. ఆ రెండుగదులలోననే యుండి గుడనగరములో నుండి వినవచ్చు ప్రేలుడుల వినుచుండి, ప్రక్కగదిలోనున్న నీరాసంగతి యేమియుఁ దెలియకుండి, నాల్గుదినములు నిద్ర లేకుండి, తిన్నతిండి మరణమొక్కటి కలిగించునది కానంత మాత్రమైయుండి, యీ నాల్గుదినములు తనదోషమంతయు దనకు దేటతెల్లమై, యిది యితరులకుగూడ దేటతెల్లమైన విష

యము తేటతెల్లమై, క్రమముగా హంగరాజ,హంగబలా,హంగ జంగప్రభృతుల సర్వాలోచనయు శత్రువులు గ్రహించి తత్ప్రతిక్రియావ్యగ్రులైరన్న విషయము దీపించి, తాను తన శరీరములోఁ బ్రాణములున్నవో లేవో తెలియకయున్న ప్రాణము లుండినయట్లుకాక సర్వబాధయుఁ బుంజీభూతమై యా రెండుగదులలోనుండి తన కదలరానియునికి యందుఁ గేంద్రీకరింపబడి యది యొక్కటేకాని యేస్థితియైనను విడుదలగా భాసించి, వాఁడు వెలికి వచ్చునప్పటికి నడవిలోనుండి వచ్చిన చల్లగాలి దూర సమీపాకాశముల యనంతత్వము వానిలోని బ్రాణములకు సమీపబంధువులవలెఁ గనిపించెను. కరచరణములకు సంకెలలున్నవన్నమాటయే తెలియలేదు. మనుజుడెప్పుడో యొకప్పుడు చనిపోవును. ఈ గాలిలో కలసిపోవునా, ఈ యాకాశములో లీనమగునా? ఆకాశములో లీనమగుట యేమి,ఆకసమునందు బఱచుకొనిపోవునా? ప్రాణముయొక్క యథార్థస్వరూపమదియా? వాని నెదో మూటకట్టి యొకచోటఁ బెట్టినట్లు శరీరములోఁ బెట్టిరా? ఈ మూట యెప్పుడు విప్పుదురని యవి యెదురుచూచుచుండునా? బైటికి వచ్చినంతనే మూట విప్పఁబోవుచున్నారన్న యాశ కలిగెనా? వానియొడలు వానికిఁ దెలియదు. సైనికులు నడువుమని కత్తితో దోసినపుడు వానికిఁ దెలిసెను. ఆ భవనముచుట్టు ప్రాకారమున్నది. ఓహో ! యిది బంధితులను భద్రపఱచెడు స్థలమే. ఈ ప్రాకారము నాల్గుదినముల క్రిందఁ దాను వచ్చినపుడు కనిపించలేదే ! తన మన స్సన్యథా వ్యగ్రమయియున్నది కాబోలు ! ఇంత ప్రాకారము కనిపించనంత వ్యగ్రతయా ? వ్యగ్రమనగా

దేనియందు వ్యగ్రము? అనాడు తనగుట్టు బట్టబయలగునేమో యన్న విషయమునందు వ్యగ్రత. తన ప్రాణమంతయు నప్పు డా యొక్క విషయమునందు లగ్నమైయుండెనా? అప్పు డా యేకైకవిషయమునందు లగ్నమైయున్న ప్రాణము నే డిప్పు డే విషయమునందు లగ్నమైయున్నది? అనంతాకాశమునందా? వాయుప్రచాలనమునందా? ఒక బిందురూపముగానున్న యొకవిషయమునం దొకడు లగ్నముకావచ్చును. పఱచబడియున్న దానియందు లగ్నమగుట యెట్లు? దాని యందుఁ బ్రసారముపొందును, అదియు లగ్నతయా? కాక పోవచ్చును. ఎక్కువప్రదేశమునందు వ్యాపించియున్న యొక వస్తువును ఖండఖండములు చేసినచో దేనికదిగా వచ్చును. ఆ వస్తువునం దేకత్వముండదు. భిన్నభిన్నమయిపోవును. అందు చేత నది లగ్నతయనుటకు వీలులేదు. అభివ్యాప్తమైనది. ఈ వ్యాప్తిలో భిన్నైకదేశములు కలవు. అందుచేత వానికిఁ గత్తి పోటు భాసించెను. ఆకాశమునం దభివ్యాపించియున్న వాని ప్రాణములం దేకదేశము శరీరగతమైయుండి కత్తిపోటునకు మేల్కనెను. అప్పుడు వానికిఁ దెలిసెను. అచట నున్నది తా నొక్కఁడే కాదు. హంగజంగు కలఁడు. అతనిమల్లులు పదిమంది కలరు. మఱికొంతదూరమున హంగబలా కలఁడు. అతఁడు దిగ్భ్రాంతుడై పోయెను. హంగబలా యిక్కడ నెట్లుండెను? వాని కొడుకున్నయూరిలో కొన్ని వందలమైళ్ల దూరమున నుండెను. తమదియంతయు నొక పదకము. ఈ పదకములో నున్న భిన్న భిన్న దేశము లొక్కసారిగా నెచ్చటినుండియో వెనుకనుండి చూచుచున్న యొక తీక్ష్ణమయిన దృష్టి, యొక సర్వమునావ

రించగలదృష్టి యేదో యున్నది. ఆ దృష్టియొక్క కాంతిప్రసారము సన్నని దారములవలెఁ బోయి, యిచట నంటుకొన్నవి యిచట నంటుకోలేదని చెప్పుటకు వీలులేనట్లుగా నున్నది. హంగబలా జంగహంగులను జూచినచో నిత డెప్పుడును నమస్కారములు చేసెడివాఁడు. ఇప్పుడు చేయవలయునా? చేతుల సంకెలలు లేచునా? వారు నమస్కారస్వీకారయోగ్యస్థితిలో నున్నారా? తన్నుజూచి సిగ్గుపడుదురు. వారి నిప్పుడు తాను సిగ్గుపఱచవలయునా? తలత్రిప్పికొని పోవలయునా? ఇటిస్థితిలో నందఱు నొకటియేనా? ఒక్కనిముసములో నంత మార్పా! ఆ పూర్వస్థితి యంత యయథార్థమా? దానిస్థితి కల్పితమా? దానియందు మఱి తా నంత యొందులకు బద్ధమనస్కుఁడై యుండెను? తత్కాలమున నది యోగ్యము. అప్పు డట్లు లేనిచో దోసము. ఇప్పు డదియంతయు గలసి యొక యయథార్థము. చాలఁ జిత్రముగా నున్నది. తనవలెనే వారుకూడ నూహించుచున్నారా? వారివంక జూచినచో వా రెదో బాధపడుచున్నట్లున్నది. తన కా బాధ కనిపించుటలేదే! తాను బాధపడుచున్నట్లు వారికనిపించునా? అనిపించదు. తాను బాధపడుట లేదు.

ఆనాటి సాయంతనమున నా భవనమునందలి పెద్ద సావడిలో నలుగు రధికారులవలెఁ గూర్చొండియుండిరి. ఒకాయన వృద్ధుఁడు. తెల్లని బుర్రమీసములు, వంగపండుచాయ మేనివాఁడు. కనులు పరమశాంతముగా నుండెను. సామాన్యములయిన దుస్తులు వేసికొనియుండెను. రెండవవాఁడు రంగీలా. తక్కిన యిద్దఱు నడివయసులోవారు. దృఢకాయులు. సైనికుల

దుస్తులు ధరించినవారు. వారిదుస్తులనుబట్టి వారు సేనాధిపతుల వలెఁ గనిపించుచున్నారు.

బంధితులనందఱిని దీసికొనివచ్చి వారియెదుట నిలువఁ బెట్టిరి. ఒకఁడు హీరారక్షకుఁడు. రెండవవాఁడు హంగబలా. మూఁడవవాఁడు జంగహాంగు. నలుగురు మల్లురు. ఈ నలుగురు మల్లులకాలుసేతులకు నమర్పఁబడిన గొలుసులనుండి వేఱ పెద్దగొలుసు లున్నవి. అవి యచటనున్న యినుపదూలమునకు బిగింపఁబడియున్నవి. అంత నీరా లోనికిఁ దీసికొనిరాఁబడెను. రంగీలా యామెను బ్రశ్నించెను. “నీ పేరు హీరా కదా?” ఆమె తలయూపెను. “నీ తల్లి పేరేమి?” సమాధానము లేదు. “నీతండ్రి పేరేమి?” సమాధానము లేదు. “నీవు పూర్వము మఱొక నాట్యకత్తెతోఁగలిసి ప్రదర్శనములిచ్చెడిదానవు. ఆమె పేరేమి?” సమాధానము లేదు. “నీకు నొక చెల్లెలు గలదు. మీరు కవలపిల్లలు” నీరాకనులు పెద్దవయ్యెను. “ఆమె పేరేమి? ఆమె యిపు డెచ్చటనున్నది?” సమాధానము లేదు. “ఆమె మూగది. ఆమె మసూచికమువచ్చి చనిపోయినదట, నిజమేనా?” నీరా తలయూపినది. “చనిపోయినది హీరాకాని నీరా కాదనియు, నీ వా నీరావనియు నొకవార్తవచ్చినది. నీవు హీరావో నీరావో నీవు మాటాడినచోఁ దెలియును. (రక్షకునిఁ జూపి) యితనిపేరేమియో చెప్పుము.” సమాధానము లేదు. అంత రంగీలా హీరారక్షకుని జూచి యిట్లనెను. “నీ వేమి చెప్పెదవు? మీరు చెప్పకముందు నీకు గొన్నివిషయములు చెప్పవలయును. హీరానాట్యముపేర గుడనగరములోఁ బెద్ద యెత్తున హత్యలు, దహనములు సాగించి గుడనగరము సర్వనాశ

నము చేయుటకును, గుమాచీ రాజ్యములోఁ జేర్చుటకును గొప్ప ప్రయత్నములు జరిగినవి. గుమాచీరాజ్యసైన్యములు మహానది యొద్దున సిద్ధపఱుపఁబడియున్నవి. ఈతలియొద్దున గుడరాజ్య సైన్యములు సిద్ధముగా నున్నవి. ఈ గూఢపురాణియంతయు మహామంత్రికిఁ దెలిసెను. ఈ పదకము హాంగబలా ప్రధాన వ్యక్తిగా గుడనగరమున వేయఁబడెను. హాంగబలా, హాంగజాగు లిద్దఱును వీనిలోఁ బ్రధాననాయకులు. నగరములో నూట యేఁబది హాంగరాజీయులయిండ్లు మందుగుండుసామానులతో నింపబడియున్నవి. బలిష్ఠులైన యాయుధపాణులు రెండు వేల మంది యా యిండ్లలో దాగికొనియుండిరి. పట్టాభిషేకము నా డర్ధరాత్రమున నాట్యము జరుగఁబోవు వేళ నాట్యభవనము నగ్నిపర్వతమువలెఁ బ్రేల్చుట. ఆ నాట్యభవనములోన నగర ములోని పెద్దలు నధికారులు సగానికి సగము భస్మీభూతులగు దురు. నిదురపోవుచున్న మాంధాతృమతస్థులమీద, వారిలోఁ బ్రధానులగువారి గృహములమీద నీ రెండు వేలమందియుఁ బడి తెల్లవారుపఱకు నగరమంతయు భస్మీపటలము చేయగా, నా నూటయేఁబదియిండ్లును క్రిందనున్న మందుగనులు ముట్టించగా, నవి ప్రేలి చుట్టుపట్లఁ గొన్ని వేల గజములు నాశనముకాగా, నిట్టి మహాఘోరము సంకల్పింపబడి పదకము వేయఁబడి యాచరణో న్ముఖమయి నాల్గుదినములున్నదనగా రహస్యము వెలిఁ బ్రాకి నది. అనుమానముగానుండి హాంగబలాయిల్లు పరిశోధింపఁబడి నది. అతఁడు దొంగతంతివార్తమీద నగరమునుండి తొల గింపఁబడినాఁడు. ఈ నీరారహస్యము కాలగిరిగ్రామమునకుఁ బోయి యొక రహస్యచారుఁడు మూలముట్టుగాఁ దెలిసికొని

వచ్చినాఁడు. పదకమంతయు నిర్మూలింపబడినది. ఆ నూట యేబదియిండ్లును భద్రముచేయబడినవి. పాతికయిండ్లు తప్పఁ బ్రేలలేదు. తక్కిన మందుగనులు త్రవ్వి వేయఁబడినవి. ఆ రెండు వేలమంది సంహరింపబడిరి. ఆ రెండు వేలమందిలోఁ గాల గిరిలోని వందమంది ధూర్తు లుండిరి. వారందఱు హతమార్చఁ బడిరి.

ఈ గందఱగోళములో గుడనగరముననున్న హాంగ రాజమతస్థులు లక్షమంది నాశనమయిరి. ఇంతమంది హాంగరాజ మతస్థులు నాశనమగుటకు నీవు కారణము. పరమతస్థులను జంపినచో నది వేఱే విషయము. నీయం దివ్వి డారోపింపబడిన నేరమేమనగా సుమారు లక్షన్నరమంది స్వమతస్థుల నాశనము నకు మీరు హేతువగుట. ఏమి చెప్పెదురు?"

ఎవ్వరు మాటాడలేదు. అందఱి మొగములు వ్రాల్పఁ బడినవి. ఎవ్వరికిని ప్రాణములోఁ బ్రాణములులేవు. తమ్ము నిలబెట్టి కాల్తురని యందఱికిని దెలియును. ఈ భయముతోఁ బాటు లక్షన్నరమంది తమ మతస్థులకు విలయము తమ హేతు వున వచ్చినదన్న దుఃఖ మందఱిగుండెలలోన నున్నది.

అప్పుడు హీరారత్నకుఁ డిట్లనెను, "అయ్యా! నా కీ పదకమంతయు దెలియదు. లీలగాఁ గొంత తెలియును. దీని కింత లోతున్నదని నాకుఁ దెలియదు. ఈమె హీరా కాదు, నీరాయే. హాంగరాజును నే నొకసారియో రెండుసార్లో చూచితిని. ఆమె బదు లీమెను సిద్ధముచేయుమని చెప్పినది హాంగబలా. ఈయన యొక్కయాజ్ఞచేత నే నేను నడచుచుంటిని. ఈమెకు మాటలు రావు. నన్ను మీ రురితీయుదురు. లేదా తుపాకితోఁ గాల్చ

దుడు. నా దొక్కటియే కోరిక. నన్నుగాల్చకముందు పట్టి గాలిలో నాకాశముక్రింద గంటసేపు త్రిప్పి తరువాత గాల్చుడు. అదియొక్కటియే కోరిక. ఇపుడు చెప్పి ప్రయోజనము లేదు గాని, గుడూచీనగరములో గుడనగరములోనున్నంతమంది నిశితబుద్ధు లయిన నాట్యభావుకులు లేరు. గుడూచీనగరమున నాట్యమును శావబుద్ధితో స్త్రీలోలబుద్ధితోఁ జూతురు. గుడనగరమున విద్యను గ్రహించవలెనన్న స్వాదుతాలక్షణముతోఁ జూతురు. ఇంతియే భేదము.

# నవమాధ్యాయము

తరువాతఁ బదిదినములు గడచినవి. మరలఁ బదిదిన ములు గడచినవి. అప్పటికి గుడనగరము చల్లఁబడినది. ఈ మహా హత్యాప్రయత్నముయొక్క స్మరణ తగ్గిపోయినది. గుడనగరము పూర్వస్థితికి వచ్చినది. రెండు రాజ్యములనడుమ నున్న యెల్ల భద్రపఱుపఁబడినది. మహానదియొడ్డు వెంట ముప్పది భూగర్భదుర్గములు నిర్మింపఁబడినవి. అంతయుఁ బదు నేనుదినములలో జరిగినది. హంగరాజును తత్సేనాపతులును మహాశ్చర్యచకితులయిపోయినారు. మఱియు నింకొక సంగతి జరిగినది. తమ దేశములోని బ్యాంకులలోని ధనమంతయు నెప్పుడు గుడనగరమునకుఁ బోయినదో వారికిఁ దెలియదు. గుడనగరములోని మహావర్తకుల గిడ్డంగులు గుడూచీనగరము నుండి యెప్పుడు తరలింపబడినవో తెలియదు. మఱియుఁ బూర్వ మున సర్వవర్తకము గుడూచీనగరముద్వారా జరుగుచుండెను. పదునేనుదినములలో నదియంతయు గట్టువడెను. ఇతర దేశము

లకు నితరరాజ్యములకు సరకుల యెగుమతి దిగుమతులు గూడ నగరమునుండియే సూటిగా జరుగుచుండెను. అంచనా వేసి చూచికోఁగా హంగరాజునకు రాజ్యవిభాగము లాభదాయకముగాఁ గనిపించలేదు. నష్టహేతువయినది.

అన్నిటికంటెఁ బ్రళయహేతు వీపాటికి మహానది వఱదలమీఁద నుండవలయును. ఏఁడాది యేఁడాది యీపాటికి నొడ్డులుమోసి కూలములుదాటి క్షేత్రములు ముంచునన్నట్లు ప్రవహించెడు మహానది యొదిగియొదిగి సాగుచుండెను. వఱదల కొఱకు జనము ప్రతీక్షించుచుండిరి. వఱదలు లేకపోయిన మానె. కాలువలకు సమృద్ధిగా నీరెక్కుటకు మహానదీప్రవాహము బలిసి వచ్చుటలేదు. కారణము తెలియలేదు. నదులు రెండువిధములు. వేసంగిలోఁ గొండలమీఁది మంచు కరగి వఱదలుకట్టెడి నదులు. వర్షకాలములోఁ గొండలమీఁద వానలు కురిసి వఱదలుగట్టెడి నదులు. మహానది మొదటితరగతిది. రెండవజాతినదులకుఁ బైన వానలు కురియలేదని యనుమానపడవచ్చును. మొదటిజాతి నదులలోఁ బైన మంచు కరుగలేదని యనుమానపడుట యెట్లు? వారి కేమియు నర్థముకాలేదు.

ఇట్లుండగా గూడదేశములోఁ ద్రవ్విన తూములుకట్టి వంతెనలుగట్టి నీటి నిలుపుదలప్రదేశములందు తలుపులుబెట్టి సర్వసిద్ధముచేసిన పదకమంతయు ఫలవంతమయ్యెను. ఆ నది ప్రవహింపసాగెను. ఆనకట్టలదగ్గఱ నాగుచుండెను. కాలువల కెక్కుచుండెను, చిన్న కాలువలలోనికిఁ బ్రవహించుచుండెను. ఇది యొకచోటనా, రెండుచోట్లనా? ఆనకట్టలు నాల్గుచోట్ల. ఆ పెద్దకాలువలనుండి చిన్న కాలువలు కొన్నివందలచోట్ల. కాలువ

లలో నీరు ప్రవహించుచుండగా వేలాదిజనులు రెండుగట్టుల యందుఁ బ్రవాహము వెంటఁబడి పోఁజొచ్చిరి. దిగి స్నానము చేయఁజొచ్చిరి. కడుపునిండ నీళ్లు త్రావఁ జొచ్చిరి. కట్టుగుడ్డలతో స్నానముచేయుట ఒడ్డునకు వచ్చుట. ఆ గుడ్డ లాడలనే యెండ వలయును. మరలఁ బోయి మునుగుట.ఆ నీళ్లు దోసిళ్లతో నెత్తినఁ బోసికొనుట. అవి నిలుచునట్లు గుడ్డలలో మూటగట్టి వెలికి వచ్చుట. అవి కారిపోగాఁ బగులఁబడి నవ్వుట. ఒకరిమీద నొకరు నీళ్లు చిందుకొనుట. కొందఱిని మఱికొందరు బలవంత ముగా నీళ్లలో ముంచుట. గొడ్లను దీసికొనివచ్చి కాలువ లోనికి దింపుట. తమయూళ్లలో నున్న ముసలివాండ్రను బసిపిల్లలను బండ్లుకట్టి తీసికొనివచ్చి స్నానములుచేయించి తీసి కొనిపోవుట. ఆ కాలువ మరల రేపుండదన్నట్లు నింటిలో నెన్ని బిందెలున్నవో వానినిండ నీళ్లు దీసికొనిపోయి యింటిలో భద్రముచేయుట. ఉదికినబట్టలుగూడ దీసికొనివచ్చి కాలువలోఁ దడుపుట. కొందరు బాలురు చిన్నచిన్న చెంబులతో నీళ్లు తీసి కొనిపోయి — అవి తమ నీళ్లు — వాని నెక్కడనో తాము భద్ర ముగాఁ బెట్టుకొని, కాలువలకుఁ బోయి దోసిళ్లతో నీళ్లు తీసి కొని నెమ్మదిగా నడచుచు నింటికి బయలు దేరిరి. రెండుగజాలు పోలేదు. దోసిళ్లలో నీళ్లు లేవు. ఆ దోసిలి యెంత దోసిలి! మిల్లిగరిటెడు. అందులో దోసిలి సరిగాఁబట్టుకొనుట చేతగాని దోసిలి. మరల మరల వచ్చి నీళ్లు తీసికొందురు. ఇంటికిఁ జేరిన నీరు లేదు గాని, మొగమునిండ లాగులనిండఁ జొక్కాలనిండ నిండిన బురద యున్నది.

ఈ మహోత్సవము గుడనగరమున కెగుర ప్రారంభ మైనది. రాజ్యముచివఱిదాక పోవువఱకు రెండునెలలు పట్టి నది. ఒక్కొకచోటఁ బదినాళ్ల యుత్సవము. ఉత్సవము పూర్తి యగువఱకు పూర్తిగా మూడు నెలలయినది. వ్యవసాయ మప్పుడు ప్రారంభించబడినది. మెట్టనాగళ్లు పనికిరాలేదు. మాగాణివ్యవసాయమునకు గావలసిన సాధనములు చేయించి కొనవలసెను. ఆ సాధనములు సిద్ధమై మాగాణిచేసెడి నేర్పు తెలిసి సరియైనవ్యవసాయము సరియయినపంటయుఁ దరువాత రెండేండ్లు గడువగాఁగాని జనమునకుఁ దెలియలేదు. మూడవ సంవత్సరము ప్రారంభించినది. దేశము సుభిక్షమయినది. వ్యవ సాయముచేయుటకు విపన్వత్ప్రభువు ప్రజలకు ధనము ఋణము లిచ్చెను. అంతటి ధన మెచ్చటనుండివచ్చినదో! హంగరాజీయ మయినబ్యాంకులోని డబ్బేమో!

ప్రజలకు స్వారాజ్యము వచ్చినట్లుండెను. వచినట్లుండె ననుటయేమి, వచ్చెను. కాని, వచ్చిన స్వారాజ్యము చిత్రముగా నుండెను. స్వారాజ్యమన్నమాట యొక్క యర్థమే యెంతలోతు కలదో తెలియదు. పరరాజు వచ్చి మన దేశము నాక్రమించెను. అది స్వారాజ్యము కాదు! ఎందుచేతఁ గాదు? దేశముమీద వచ్చిన పన్నులు మొద లయిన డబ్బులో వానియిష్టమువచ్చినంత యిచ్చట ఖర్చు పెట్టి, తక్కినది వాని దేశమునకు వాఁడు తరలించుకొనిపోవును. పెద్దపెద్ద యుద్యోగములన్నియుఁ దన దేశమువారి కిచ్చును. తనకు నీ దేశమునకు జరిగెడు వ్యయములన్నియు దేశముమీఁద రుద్దును. ప్రజలకు సౌకర్యములుచేసినట్లు చూపును. ఇది యార్థిక

మయిన పరరాజ్యము. మనదేశప్రజలే మనజాతి రాజే మనలను బాలించుచున్నచో నది యార్థికస్వారాజ్యము. పెద్దపెద్దయుద్యోగములు మనవాండ్రకే వచ్చును. వచ్చిన పన్నులతోఁ బ్రజల కెక్కువ యుపయోగముచేసికొందుము. ధనము మిగిలినచో దేశాభివృద్ధికి దేశరక్షణకు వినియోగపఱతుము. ఇది యార్థిక స్వారాజ్యము. రెండవది విద్యావిషయికముగాఁ బరరాజు తన చదువు ప్రవేశపెట్టును. వాని గ్రంథములు చదివించును. వాని కవులయందు, వాని సారస్వతమునందు నభిరుచి పెంపొందించును. ఒక్కొక్క జాతిలక్షణము వొకొక్కవిధముగా నుండును. ఒకొక్కసారస్వతలక్షణ మొకొక్కవిధముగా నుండును.ఆంగరాజమతస్థులు మాంధాతృమతస్థులు నందఱును మనుష్యులే.వారితిండి వేఱు,వీరితిండి వేఱు; వారిదుస్తులు వేఱు, వీరిదుస్తులు వేఱు. వారి యాచారములు వేఱు, వీరి యాచారములు వేఱు. ఇవియన్నియుఁ బయివిషయములు. పట్టింపునకు రావందము. మరికొన్ని చూతము. వారి ముఖలక్షణములు వేఱు, వీరి ముఖలక్షణములు వేఱు, వారి యవయవనిర్మితి స్వరూపము వేఱు, వీరి యవయవసన్నివేశము వేఱు. ఇది కూడఁ బాటింపునకు రాదందము. వారివిశ్వాసములు వేఱు; వీరివిశ్వాసములు వేఱు. వారిచిత్తవృత్తులు వేఱు, వీరిచిత్తవృత్తులు వేఱు. వారి ప్రవృత్తిలక్షణము వేఱు వీరి ప్రవృత్తిలక్షణము వేఱు.వానివలనఁ గలిగెడుఫలితములు విస్పష్టముగా వేఱు. ఈ చిత్తవృత్తి మొదలయినవి,ముఖలక్షణములు మొదలయినవి,యాచారములు మొదలయినవియన్నియుఁబరస్పరసంబంధముకలవే. వారిచిత్తవృత్తులనుబట్టియే వారి యాచారములు

వారివిశ్వాసములు. వానినిబట్టియే దుస్తుల మొదలయినవి. వీనియ
న్నింటికి బహిఃకారణము లుండును. అంతఃకారణము లుండును.
బహిఃకారణములు తద్దేశ శీతోష్ణపరిస్థిత్యాదులు. అంతఃకారణ
ములు చిత్తవృత్త్యాదులు. ఈ చిత్తవృత్త్యాదులు బహుకాల
తద్దేశనివాసజనితాచారాదినిత్యక్రియా హేతుకరక్తగతగుణజనిత
మయినవి కావచ్చును. ఇది యొక గిజిగానిగూడు. ఏ దార
మున కా దారము తీయుట యసంభవము. ఇట్టిస్థితిలో సార
స్వతలక్ష్యములు నిస్సందేహముగా విడివిడిగానే యుండును.
ఆ విజాతీయములయిన భావము లీ పరపరిపాలనములోనున్న
జనులయందుఁ బ్రవేశించుటచేత స్వజాతీయాచార సంప్ర
దాయ విశ్వాసాదులయందు వైముఖ్యము కలుగుచు సర్వ
మానవులు నొకటియే. అన్ని యాచారములు నొకటియే.
ఒకజాతి కొక యాచారము, నొక సంప్రదాయమన్నది సంకు
చితమయిన యభిప్రాయము. అది జగత్క్షేమంకరమయిన
విషయము కాదు. సర్వమానవత మా ప్రధానలక్ష్యమని
వాదించవచ్చును. ఈ సర్వమానవత దయాదులయందు నితరు
లను జూచి యోర్చుటయందు, నితరులరాజ్యములను మనము
సంపాదింతమను దురభిప్రాయము లేకపోవుటయందుఁ బాటించ
వలసినది. ఈ యాచార సంప్రదాయ విశ్వాసాదులు మనోజనిత
ములై కనిపించినను వానిలక్షణము వానికున్నది. ఉదాహార
ణము వృక్షాదులను దీసికొనవచ్చును. మిక్కిలి చల్లని దేశ
ములలో నొకజాతివృక్షములు పుట్టును. మహోష్ణదేశములలోఁ
బుట్టెడు వృక్షజాతులు వేఱు. ఆ చెట్టు నిచ్చటఁ బెంచి
నను, నీ చెట్టు నక్కడఁ బెంచినను బెంచుటలోని కష్టమే మిగు

లును గాని, ఫలితము స్వల్పము. మామిడిపండునకుఁ దీపి యుష్ణదేశములలోనే కలుగును. శీతలదేశములో మామిడి చెట్టు పెరుగనే పెరుగదు. పెరిగి కాయ కాచినచో నిలువనే నిలువదు. ఉష్ణదేశములలోనున్న త్రాచుపాములకే విషముం డును. చల్లని దేశములలోనిపాములకు విషముండదు. ఇంక విషమూ నీ కుదాహరణకుదొరికినది యనగా, దేని చెడ్డ దానిది, దేని మంచి దానిది. పామువిష మౌషధములలోనికిఁ గూడఁ బనికివచ్చును గద. పరమేశ్వరు డీ సృష్టిని జేసినపుడు మానవ జాతి భిన్నదేశములందు భిన్నకాలములందుఁ బుట్టుచున్నపుడు వారిస్థితి దేశకాలములచేత నియమితమగుచున్నది. ఈ నియ మము పరమేశ్వర నిర్మితము. పరమేశ్వరుఁడు లేఁడని యందము. ప్రకృతియే యున్నది. ఈ ప్రకృతియే దేశక స్వరూపము. అప్పుడయినను నియమము తప్పలేదు. ఆ ? తిని నిర్మూలించి మనుజుడు సాధించునది యేమి? భిన్న భిన్నములయిన సంప్రదాయములవలన భిన్నభిన్న విశ్వాస ములు కలవు. ఆ విశ్వాసము కలిగిన యా మానవునియొక్క యాత్మపరిణామ మొక విలక్షణమయినది. ఈ యనంత కాలా కాశములం ను నభివ్యాప్తిపొందిన ప్రతిజీవునకు నొక ప్రత్యే కత యున్న న్నచో నా జీవునియొక్క పరిణామమునకు వాని యా యా ్వాసములు హేతుభూతములగును. జీవుఁడే లేఁ డన్నచో దుండు తుపాకిని నెగురగొట్టినట్లే.

జీవుఁడే లేఁడు భగవంతుఁడు లేఁడు. మానవులు పుట్టు చున్నారు. బ్రదుకుచున్నారు. మరణించుచున్నారు. ఒక మాన వునిగూర్చి మరొక్క మానవునికిఁ జింత యెందులకు? తన

సుఖము వారిమీద నాధారపడియున్నదనియా? ఒప్పికొందము. తాను మరణించినంతనే యీ బాధ్యత వదలిపోయినది. భవిష్యత్తులో మానవులు పుట్టుదురు. సర్వమానవశ్రేయస్సు కొఱకు నేను బాటుపడుచున్నానని యొక మానవుఁ డనును. జీవుఁడే లేనిచో మానవులుకూడ నల్లులవలె దోమలవలె గంబళి పురుగులవలె నుసుళ్లవలె గాలికిఁబుట్టి గాలికిఁజచ్చినచో నింత ప్రయత్నము వృథాయగును. ప్రయత్నము నిష్ఫలము కాఁ గూడదని, ఫలరహితముగాఁ బ్రవర్తించదని, యత్నఫలములు నిత్యానుబంధులని, ఫలితమునకు నైరర్థక్యము లేదని తార్కికమయిన నిష్కర్ష. అందుచేత నా వాదిం చెడివారివాదన వాదనయే కాదు. ఏమియులేనిదానికొఱకుఁ బ్రయత్నించుటయా? సుఖదుఃఖములున్నవి గదా యందుము. అవి యనుభూయమానములగుచున్నవి. ఎవరిచేత? మానవునిచేత. మానవుఁడనగా నేమి? సుఖదుఃఖము లనుభవించువాఁడు. ఇది తర్కము కాదు. చెట్టునకు విత్తు కారణము. విత్తునకుఁ జెట్టు కారణము. ఈ రెండు నొక సమష్టివస్తువయినచో దానికిఁ గారణముండునా? ఇట్లు గారణమునకుఁ గారణముగా నవ్యవస్థాదోషపరిహారకముగాఁ బరమేశ్వరుడున్నాడని మొదటి నిరూపణము.

ఔనో కాదో, ఆటవికులో నాగరకులో, పురాతనులో, అధునాతనులో—మానవులలోఁ బెక్కుమంది, భగవంతుడున్నాఁడు. భిన్నజాతులున్నవి, భిన్నవిశ్వాసము లున్నవి, జీవుఁ డున్నాఁడు, వానిసంస్కార మున్నది—ఈ రూపమయిన విశ్వాసములు తదనుకూలప్రవర్తనకలవా రున్నారు.

అప్పుడు వారొకజాతి. వారిచదువు వారిది. వారి విశ్వాసములు వారివి. వారిజీవులు, నా జీవులప్రయాణములు నున్నవి.

వారినిఁ గాదని యొక ఖడ్గవాది లేదా తుపాకివాది తన నిర్మించుకొన్న కొన్ని సిద్ధాంతములకుఁ గొంతమేరఁ బ్రచారము చేసి, యా సిద్ధాంతములు బలవంతముగాఁ గొన్నిచోట్ల సాదువలవలతుణముగాఁ గొన్నిచోట్ల వ్యామోహములు నెఱపి, కొన్నిచోట్లఁ బ్రవేశపెట్టి యవియే పరమసిద్ధాంతములని ధార్ష్ట్యము నెఱపుట మానవక్షేమము కొఱకా? తన విశ్వాసమే యందఱు నాచరించవలయునన్న యహంకారమా? తానును ననంత దేశములందున్నవాఁడు కాఁడు. అనంత కాలములందున్న వాఁడు. ఉండఁడని వాని సిద్ధాంతమేకదా- అనంత కాలమునందుం డఁడు. సరే. తాను బ్రదికియున్నప్పుడు కల సర్వభూమండలము లందలి సర్వ దేశములను దనసిద్ధాంతమునే ప్రవేశపెట్టును తక్కిన కాలముల మాట యేమి? తాడిఁదన్నినవానితలఁదన్నెడివాఁ డుండును. వీఁడు చనిపోయినతరువాతనో వీఁడు వృద్ధుఁడయి వీని శక్తి యుడిగినప్పుడో, మఱియింకొక ప్రచండుఁడు మఱియొక సిద్ధాంతమును బెట్టఁడా? కనుక బుద్ధిమంతుఁడయినవాఁడా మహా పరమేశ్వరనిర్మితమయిన పదకముతో జోక్యము పెట్టుకొనఁడు. ఆ గొడ్డు మంచిదయినచో నా యూరనే యమ్ముడుపోవు నన్నట్లు తాను వివేకవంతుఁడయినచోఁ దన బ్రదుకు దాను జూచుకోవచ్చును.

వల్లభమంత్రి హంగరాజీయవిద్యాసారస్వతములు గుడ రాజధానినుండి తొలగించుటకుఁజేసిన ప్రయత్నములలో నెదు

రొక్కన్న కష్టములయొక్క స్వరూప మీాపైనఁ జెప్పినదంతయుఁ తన నీతిబలముచేత దేశమును సుభిక్షమును జేసెను. సంపద్వంత మును జేసెను. శత్రువులు వేసిన పదకములను నిర్మూలించెను. ఈ యాంతరమయిన గెలుపు గెలువలేకపోయెను. అంతవఱకు వల్లభమంత్రికి హంగరాజుయొక్క నీతి లోతు తెలియలేదు. పైకిఁ దాను హంగరాజును గెలిచినట్లు గనిపించెను. కాని నిజముగా గెలువలేదు.

మాంధాతృరాజ్యముయొక్క స్వతంత్రరాజ్య మేర్పడి పదియేండ్లయినది. మాంధాతృరాజ్యమును జూచినచో శత్రువులకు గుండెదిగులుగా నున్నది. ఆధునిక ప్రకృతిశాస్త్ర పరిజ్ఞానఫలితములయిన సర్వయంత్రములయందు సర్వమారణా యుధములందు సర్వరాజనీతియందు గుడరాజ్యమును వల్లభ మంత్రి తన బుద్ధిబలముచేత సర్వోత్కృష్టమైన రాజ్యముగాఁ జేసెను.

వల్లభమంత్రి పరమవృద్ధుఁడై మృత్యుశయ్యమీాదనుండి చివఱికనినమాట లివి: "వివస్వంతుఁడు శశి కన్నగారు. శశి మతముపుచ్చుకొన్నాఁడు. ఇతడు పుచ్చుకోలేదు. ఇంతే భేదము. ఇతడు నా సంప్రదాయములోననే పెరిగినాఁడు. ఇతఁ డీ దేశమున నాంతరమయిన స్వరాజ్యమును దీసికొనిరానీ యఁడు. భగవంతుఁడున్నచో వాఁడు చేయవలసినపనిగాని రాజనీతిదక్షుఁడయిన యొక మంత్రి చేయదగినపని కాదిది. భగవంతుడనగా గాలస్వరూపుఁడు. ఆ కాలస్వరూపుడయిన భగవంతున కిదియే యభిమతమేమో!"

